The one and only Magazine devoted to Humour & Music

పేజీలు : 68+8

వెల : రూ.10

# హాసం

హాస్య-సంగీత పత్రిక

1-15 ఏప్రిల్ 2002



లోపలి పేజీల్లో
ఉగాది స్పెషల్‌గా
ఎన్నో ప్రత్యేకతలు



ఏప్రిల్ 8

ఎ.ఎం.రాజా

వర్ధంతి

సందర్భంగా

సినీ సంగీత

ప్రియుల కోసం -

# ఇదీ సంగతులు

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

## హాస్యం సంగీతం



**కొత్త శీర్షిక**



**45వ పేజీలో**



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'నీతోడుకావాలి',
'ఆడుతూ..పాడుతూ'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో





8 పేజీల ప్రత్యేక కానుక: ఎస్.పి.కోదండపాణి స్వరపరిచిన గీతాలు,
ఎ.ఎం.రాజా గానం చేసిన గీతాలు

ముఖచిత్రం: గజాలా

# ప్రయోజన వాక్యం

మార్చి 1-15 సంచిక హాసం "ప్రయోజన వాక్యం" వుత్తరాల శీర్షికలో శ్రీ పి.ఎస్.గోపాలకృష్ణ త్యాగరాజస్వామివారు పుట్టిన వూరు తిరువాయూరు కాదు తిరువయ్యారు గమనించగలరు అని వ్రాశారు. అది తప్పు.

త్యాగరాజస్వామివారు పుట్టిన వూరు తిరువాయూరు. ఆ వూళ్ళో త్యాగరాజస్వామి దేవాలయం కూడా ఉంది. ఆ దేవుడి పేరే త్యాగరాజ స్వామి వారికి పెట్టారు తల్లిదండ్రులు. త్యాగరాజుగారు నివసించినది, స్వర్గస్థులయిన వూరు మాత్రం తిరువయ్యారు. ఆయన సమాధి మందిరం తిరువయ్యారులో వుంది. ఏటేటా త్యాగరాజ ఆరాధనోత్సవాలు జరుపుతారు. నేను రెండు గ్రామాలకూ వెళ్ళాను కూడా. తంజావూరు నుంచి రెండు గ్రామాలకు బస్‌లలో వెళ్ళవచ్చు. త్యాగరాజుగారి యింటి పేరు కాకర్ల. ఆయన తెలుగువాడు. పూర్వీకులు కర్నూలు ప్రాంతం నుండి తిరువాయూరు వలస వెళ్ళారు. తిరువయ్యారు లో జయంతి టాకీసు ఎదురు సందులో త్యాగరాజుగారి యిల్లు వుంది. ఆ యింట్లో ఆయన తాలూకు వస్తువులు వగైరాలతో సందర్శకుల యిల్లుగా వుంది. త్యాగరాజుగారి యింటి వీధి పేరు తిరుమంజనం స్ట్రీట్ అని వ్రాయబడింది. త్యాగరాజస్వామి వారు 1824 సంవత్సరం వరకు జీవించారు. త్యాగరాజు గారికి కొడుకులు లేరు. కుమార్తె తాలూకు ముని మనుమలు వున్నారు. చాలా పేదరికం కుటుంబాలు. సమాధి మందిరం దర్శించి తృణమో పణమో మనం యిస్తే అక్కడ బుక్కులో సంతకం చేయించుకుంటారు. మనకి వారి పద్ధతిలో ఓ పూట తమ యింట్లో భోజనం కూడా చేయమని కోరతారు. వినయం ఉట్టిపడే మనుష్యులు.

-ఏచూరి,
సినీ జర్నలిస్ట్ అండ్ సినీ ఆర్టిస్ట్,
చెన్నై - 600 024.

నేను గత సం॥రం మధుర గాయని శ్రీమతి సుశీల గారిని కలిసాను. మాటల సందర్భంలో "మీకు పద్మశ్రీ ఎందుకు రాలేదు?" అని అడిగాను. ఆవిడ నవ్వుతూ నేను మద్రాసులో వుండటం వలన తెలుగునాయకులు నన్ను మరచిపోయారు. తమిళనాడులో నేను తెలుగింటి బిడ్డనని తమిళనాయకులు మరచిపోయారు. పోనీలే ఎవరు మరచిపోయినా మీలాంటి అభిమానులు నన్ను గుర్తుకు తెచ్చుకొని నా పాటలను మళ్ళీ మళ్ళీ పాడమని అడుగుతున్నారు. అంతకన్నా నాకు ఏం కావాలి?" అన్నారామె వినయంగా. నాకు ఎంతో బాధ కలిగింది. లతా మంగేష్కర్ గారికి భారత రత్న, ఆశాభోంస్లేకు దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు వచ్చాయి. వారితో సమానమైన మన తెలుగింటి ఆడబిడ్డను కనీసం పద్మశ్రీకి సిఫార్సు చేయడం మన తెలుగు రాజకీయ నాయకులు గాని, చిత్ర రంగ ప్రముఖులు గాని ప్రయత్నించకపోవడం దురదృష్టకరం. డాక్టరేట్లు యివ్వడానికి ఉత్సాహం చూపే యూనివర్శిటీ వారు కూడా సుశీలమ్మను మరచినారు. యిదేమీ రికమండేషన్ కాదు. మన అందరి బాధ్యత. దయచేసి యీ వుత్తరాన్ని మీ "హాసం" పత్రికలో ప్రచురించితే చదువుతున్న (హృదయమున్న) ప్రముఖులు నా ఆవేదనను అర్థం చేసుకుంటారని.

-కె.వెంకటరంజన్, చిల్లకల్లు

ఈ పక్షం సైతం హాసం.... ఆమూలాగ్రం... అద్భుతంగా ఉంది. రాజావారి "మటాష్" కామెడీ స్కిట్.... పట్టార్కర్ అంటూ గమ్మత్తయిన పేరుతో పాత్ర.... కడుపుబ్బ నవ్విస్తూ.... అలరింపజేసి అప్పుడే అయిపోయిందా నిపించింది. "జస్ట్ ఫర్ ఫన్"...లో గోపి 'రిటర్న్ ఆఫ్ ది టైగర్స్'' మమ్మాకర్షించింది. కార్టూన్ల కమామీషూ..... అంటూ మీరు కార్టూన్లకు పెద్ద పీట వేయడంతో పాటు కార్టూనిస్టు ఎమ్మెస్ రామకృష్ణగారి స్వపరిచయం ప్రచురించటం హర్షణీయం. మొదటి నుంచీ హాసంలో.... ఎంచ తగ్గ ముఖ్య విషయం, మీరు ప్రముఖుల అందరి చిరునామాలు అందించడం. ఇది చాలా చక్కని సాంప్రదాయం.

-నేమాన సుభాస్‌చంద్రబోస్, శ్రీకాకుళం టౌన్

"హాసం" పన్నెండవ సంచిక మహాద్భుతంగా ఉంది. గత పదకొండు సంచికల్లో ఒక సంచిక బాపు గారి కార్టూన్లతో (అనుబంధం) వచ్చి అలరించి నట్లే, ఈ సంచిక శ్రీరామకృష్ణగారి కార్టూన్లతో వచ్చి మా మదిని కొల్లగొట్టింది. శ్రీ ఎం.వి. ఎస్. హరనాధరావు గారి కథ, శ్రీ మల్లాది, శ్రీ ఎమ్బీయస్‌గార్ల సీరియళ్లు అదరహో లెవెల్లో ఉన్నాయి. అంజిగాడు (బాలకృష్ణ) గురించి శ్రీ రావి కొండల రావు గారు మంచి సమాచారం అందించగా, ఏవిఎం వారి 'సంఘం' గురించి రాజా ఆపాత మధురంలో అద్భుతంగా వివరించారు. హాసం అన్నికాలాల్లో హాస్యసంగీత సృష్టిచేస్తూ పదికాలాలపాటు నిలవాలని ఆకాంక్ష!

-యన్.కె.నాగేశ్వరరావు, పెనుగొండ

"హాసం" 16-31 మార్చి 2002 సంచిక లోపలికంటా వివరంగా చూడకముందే 50వ పేజీలో మీరిచ్చిన తాయిలం "బాపు కార్టూన్ల స్పెషల్ ఉగాది కానుక" బాగా వూరించింది. పైగా బాపుగారి రైటింగ్‌లో నామీదేనర్రోయ్ అంటూ చాలా ఆసక్తిని రేపింది. 'ఆదిత్య 369' సినిమాలో టైము మిషన్ భవిష్యత్ కాలానికి వెళ్ళిపోయి నట్టుగా మనం ఉగాదికి ఒకేసారి ఇప్పుడే వెళ్ళిపోతే? అనిపించింది. ఈ సంచికలో రెండు హాస్యకథలు, ముని మాణిక్యంగారి రచన, రాజాగారి స్కిట్, 62 రామకృష్ణ కార్టూన్లతో వియ్యాలవారి విందును మరిపించేదిగా వుంది. కుమారి శ్రీరంగం గోపాలరత్నం గారిని చిత్ర రంజన్ గారి వ్యాసంతోనూ, మరియెక వ్యాసం తోనూ స్మరించి, ఆ మధుర గాయనికి సరియైన నివాళి నర్పించారు. ముళ్ళపూడి గారు స్క్రిప్టు గురించి ఉత్కంఠ భరితంగా చెప్పారు. ఆ వ్యాసంలో ఆయా చిత్రాలు సన్నివేశాలకు సంబంధించి ఫోటోలు ప్రచురించాలన్న కాన్సెప్టు మెచ్చుకోదగ్గది.

-జి. ప్రభాకర్‌రావు, హైదరాబాద్

అన్నిసంచికలు బాగున్నవి. హాస్యం కురిసింది - సంగీతం విరిసింది
1. "సూరజ్" చిత్రంలోని పాట, రఫీగానం దాని అర్థం వహ్వా - వహ్వా 2. లలిత సంగీతంలో, ఒక పిలుపులో పాట చదువుతుంటే 'ఓహో' అన్పించింది. 3. కార్టూన్లు చూసి, చదువుతుంటే పడిపడి నవ్వాను. అందరికి - చెప్పి నవ్విస్తాను. 4. "సంఘం" సినిమాలోని పెళ్ళి పాటను అభినయించిన ఎస్.బాలచందర్ తరువాత వైణికుడు అంటే బాప్ రే బాప్ అన్పించింది. 5. 'హాస్యం - సంగీతం' సమపాళ్ళలో గల 'హాసం' చేతికి అందిన రోజున విందుభోజనం కల్గిస్తుంది.

పాత నటులు ఏం చేస్తున్నారు. వారిని కూడా పరిచయం చేయండి. ఉదా: కృష్ణకుమారి, రాజశ్రీ, దేవిక జీవించి వున్నవారే సుమా! సౌందర్య రాజన్, శీర్కాళి గోవిందరాజన్ గారి పాటలు కూడా పరిచయం చేయండి. పత్రికకు శుభమగు గాక!

-ఉప్పాల మోహనబాబు, అవనిగడ్డ

మీరు చెప్పిన కృష్ణకుమారి, రాజశ్రీ, దేవిక హాస్యానికి, సంగీతానికి సంబంధించిన వారు కాదు కాబట్టి కుదరదు. ఇక సౌందర్‌రాజన్, శీర్కాళి గోవిందరాజన్ అంటారా.... అవకాశం దొరికితే ఒదులుకోంగా!

- ఎడిటర్

మునిమాణిక్యంగారి రచన (ఉపాధ్యాయ ఉవాచ) చాలా బావున్నది. అలాంటి రచనలు వేయడానికి ప్రయత్నించండి. కన్నడంలో చాలా హాస్య ప్రయత్నాలు చేశారు. 'చుటుక సాహిత్యం' - గాంపర గుంపులాంటివి చాలా వున్నవి. వాటిలో మంచివి ట్రాన్స్‌లేట్ చేసి పంపితే ప్రచురిస్తారా?

-వేలూరి కృష్ణమూర్తి, మైసూరు

బావుంటే.... తప్పకుండా....!

-ఎడిటర్

సంపుటి :1 సంచిక: 13

1 - 15 ఏప్రిల్ 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 13

తెలుగువారికి కొత్త సంవత్సరం వస్తోంది. కొత్త ఆశలు, కొత్త ఆశయాలు, కొత్త తీర్మానాలు, కొత్త ప్రణాళికలు - ఇవన్నీ వెంటబెట్టుకు మరీ వస్తోంది. వ్యక్తిగతంగానైనా, సంస్థాగతంగానైనా ఇవి తప్పదు. ముఖ్యంగా పాత కొత్త సంవత్సరాల సరిహద్దుమీద నిలబడి గతాన్ని సమీక్షించుకుని ముందుకు సాగాలనుకున్నప్పుడు, గమ్యాన్ని, గమనాన్ని మరొక్కసారి తలచుకుని సరిచూసు కుంటున్నప్పుడు కొన్ని ఆలోచనలు చుట్టుముట్టడం సహజం.

గత సంవత్సరంలోనే ఆరునెలల క్రితం "హాసం' ఆవిర్భవించింది. ఆవిర్భవిస్తూనే తెలుగు పత్రికారంగంలో సంచలనాన్ని రేకెత్తించిందని అనలేము కానీ తెలుగుపాఠకులలో ఒక చిన్న ఆశను రేపింది. 'ఇదేదో మంచి పత్రికగా, నాలుగు కాలాలపాటు మనగలిగన అభిరుచి గల పత్రికగా కనబడుతోందన్న' అభిప్రాయాన్ని కలిగించింది. 'హాస్యాన్ని, సంగీతాన్ని రంగరించి అందిస్తే మనస్సుకు ఇంత హాయి చేకూరుతుందన్నమాట...!' అని తెలుసుకునేలా చేసింది. 'అశ్లీలం, అసభ్యత జోలికి పోకుండా వ్యాపారపరంగా కూడా నిలబడగలిగిన పత్రిక నడపవచ్చన్నమాట' అనే ఊరటనిచ్చింది. దొంగతనంగా దాచుకుని చదువుకునేలా కాకుండా, కలకాలం దాచిపెట్టుకోవలసిన పత్రికలా రూపొందించిన పత్రిక తెలుగునాట మొలకెత్తినందుకు గర్వపడేలా చేసింది. ముఖ్యంగా బంధువులకు, సన్నిహితులకు, స్నేహితులకు ధైర్యంగా రికమెండ్ చేయదగిన, బహుమతి ఈయదగిన పత్రిక ఒకటి దొరికిందన్న సంతోషం కలిగేలా చేసింది.

ఇక రచయితల విషయానికొస్తే "హాసం" వారికి ఒక అభిమాన పత్రికగా రూపుదిద్దుకుంటోంది. సీనియర్ రచయితల నుండి, ప్రస్తుతం చాలా బిజీగా సినీరచయితలుగా ఉన్నవారు కూడా ఎంతో సమయం వెచ్చించి, "హాసం" కు కథలు, వ్యాసాలు వ్రాసి పంపుతున్నారంటే "హాసం" పాఠకుల స్థాయి పట్ల వారి కొక అవగాహన ఏర్పడబట్టే! శ్రీయుతులు "బాపు", రమణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, పరుచూరి గోపాలకృష్ణ, డి.వి. నరసరాజు , సిరివెన్నెల సీతారామశాస్త్రి, తనికెళ్ళ భరణి, - ఇలా ఎందరో అతి బిజీ కళాకారులు, తమ రచనలు మాకిస్తూ, "హాసం" గురించి ప్రస్తావించినప్పుడు గర్వంగా మరో పదిమందికి వారు చెప్పే స్థాయికి ఆరునెలల్లోనే "హాసం" ఎదిగిందంటే సరైన దారిలోనే వెళుతున్నట్టు మేం భావిస్తున్నాం.

అయితే ఇది చాలదని మాకు తెలుసు. ప్రజల్లోకి చొచ్చుకుని వెళ్ళినప్పుడే ఈ మేధావుల ఆలోచనలను జనసామాన్యానికి చేర్చే బాధ్యతను మేము సరిగ్గా నిర్వర్తించినట్లు భావిస్తాం. జిల్లాలలో "హాసం" గురించి అవగాహన పెంచడానికి బాగా డిస్ప్లే చేయించి, ఇంకా ఎక్కువ స్టాల్స్‌లో లభ్యమయ్యేట్లా ప్రయత్నాలు చేస్తున్నాం. పంపిణీవ్యవస్థలో ఏవైనా లోపాలుంటే మా దృష్టికి గాని, "ఈనాడు" వారి దృష్టికి గాని తీసుకురావలసినదిగా "హాసం" అభిమానులను కోరుతున్నాము.

చివరిగా - ఉగాది సందర్భంగా మా తరపున మీరో తీర్మానం చేసుకోవాలని కోరుతున్నాం. ఉగాదినాడు మీరు పలకరించి శుభాకాంక్షలు చెప్పబోయే వారిలో కనీసం పదిమందికి "హాసం అనే పత్రిక ఒకటి వచ్చింది. చూసావా?" అని చెప్పండి. చాలు....



**ఫంక్షన్స్‌లోగాని, నలుగురు కూర్చుని సరదాగా నవ్వుకునే సమయాల్లోగాని సులభంగా ప్రదర్శించడానికి పనికొచ్చేలా 'హాసం' సమర్పిస్తున్న కామెడీ స్కిట్ ఇది.**



# భైరవదోషం

- రాజా

సీన్ ఓపెన్ అయ్యేసరికి ఓ రెండు
చేతులు గోడమీద
ఓ పేపర్‌ని ఉంచాయి. ఎడం చెయ్యి పేపర్
ఎగిరిపోకుండా పట్టుకుని ఉంటే,
కుడి చెయ్యి మార్కింగ్ ఇంక్ పెన్‌తో ఎంట్రీ
'ఉగాది శుభాకాంక్షలు' అని రాసింది.
రెండు చేతులూ పేపర్ని
చకచకా మడత పెట్టాయి.
ఓ రాకెట్‌లా చేశాయి.
పక్కన మరో రెండు రాకెట్లు ఆల్రెడీ
తయారు చేసి ఉన్నాయి.
శుభాకాంక్షల రాకెట్‌ని అందుకుని
ఫ్రేమ్‌లోకి సుందరం ఎంట్రీ
పిల్లిలా అడుగులు వేసుకుంటూ
కిటికీ దగ్గరకి వచ్చాడు సుందరం.
కిటికీలోంచి చూశాడు.

ఎదురుగా వంటింట్లో కమల...!

రాకెట్ విసిరాడు. కమల ముందు పడింది. రాకెట్ విప్పి చూసి నవ్వుకుంది. ఆ కాగితం మీదున్న మేటర్ 'సేమ్ టు యు' అన్న పద్ధతిలో అభినయించి చూపింది. సుందరం 'థ్యాంక్యూ' అన్నట్టు సలాంచేసి మరో రాకెట్ పంపించాడు. 'సాయంత్రం ఐదు గంటలకి హోటల్ సరోవర్ గార్డెన్‌లో ఎదురు చూస్తూ ఉంటాను' అని ఉంటుందా లెటర్‌లో. 'అమ్మో... ఎలా?' అన్నట్టు ముందురూమ్ వైపు చూపిస్తుంది కమల. ముందు రూమ్‌లో కోదండం పేపర్ చదువుకుంటూ ఉంటాడు. మరో రాకెట్ పడుతుంది కమల దగ్గర. 'ఎలాగైనా సరే వచ్చి తీరాలి' అని ఉంటుంది. 'అలాగే. ప్రస్తుతానికి దయచేయండి' అన్న పద్ధతిలో మైమ్ చేస్తుంది కమల.

సుందరం సరేనని ఫ్రేమ్ అవుట్ అయిపోతాడు. రాకెట్లన్నీ చించేసి గుప్పెట్లో పెట్టుకొని వేస్ట్ పేపర్ బాస్కెట్లో పారెయ్యడానికి కమల దొంగలా వస్తుండగా 'ఫట్' మని కొట్టిందో చెయ్యి. తుళ్ళిపడింది కమల.

ఫ్రేమ్‌లోకి కోదండం ఎంట్రీ (నవ్వుతూ).

కోదండం :ఓ కుక్క మనిషిని కరిచిందట. మనిషి బాగానే ఉన్నాడట. ఆకుక్క ఫట్ అని చచ్చి ఊరుకుందట - ఖలునకు నిలువెల్లా విషమని ఊరికే అన్నారా మరి?

కమల :మీరు చెప్పిన మాట బాగుంది బాబాయ్‌గారూ! కొట్టిన దెబ్బే బాగుండలేదు.

కోదండం : అది నా బలహీనతమ్మా! ఏం చెయ్యమంటావ్ చెప్పు. నా నోటికి నవ్వొస్తే చేతికి ఊపొస్తుంది. ఎక్కడో ఓ చోట దెబ్బ పడిపోతుంది - అవునూ, అలా పిల్లిలా మెల్లిమెల్లిగా నడిచొస్తున్నావేమిటి?

కమల :ఏం లేదు బాబాయ్‌గారూ! వీలైనప్పుడల్లా ఇలా మెల్లిగా నడుస్తూ ఉంటే బీపీ, షుగరూ, ఇంక లైఫ్‌లో మనం బొట్టుపెట్టి పిలిచినా సరే రావట.

కోదండం :ఎవరు చెప్పేరు?

కమల :టీవీ... టీవీలో...

కోదండం :(మళ్ళీ చరుస్తూ) ఓహ్ టీవీలోనా... ఇంతకీ సుందరం ఎక్కడా? పొద్దున్నుంచీ కనిపించడంలేదు?

కమల :వేప్పువ్వు తేవటానికనీ...

కోదండం :(వాళ్ళిద్దరి వెనకనుంచి సుందరం వెళ్ళిపోబోతుంటే) వార్నీ... నువ్వుకూడా ఈ నడకే మొదలెట్టావ్? మంచిదేలే. ఆరోగ్యం అంటే ఆ మాత్రం శ్రద్ధుండాల్లే... ఇంతకీ తెచ్చావా వేప్పువ్వు?

సుందరం :చచ్చా... ఆ ఆ ఆ ... తెచ్చా...

కోదండం :ఇంకేం... త్వరగా చేసి తీసుకురామ్మా ఉగాది పచ్చడి... పండగనాడు నాలికమీద మొట్టమొదట అది పడితేగానీ ఇంకేం ముట్టడానికి వీల్లేదు.

కమల :(లోపలికి పరిగెత్తింది)ఇదిగో బాబాయ్ ఒక్క క్షణం.

కోదండం :ఊ... సుందరం... ఉగాది లక్ష్మి ఎక్కడుంటుందంటావ్?

సుందరం :నాకేం తెలుసు బాబాబ్‌గారూ? ఇంతకీ ఆవిడెవరూ... డ్రామా ఆర్టిస్టా?

కోదండం :వారి నీ అమ్మ కడుపు నీతో బంగారం కాను. పొద్దున్నే ఎంత ఛండాలం చచ్చు జోకు వేశావయ్యా... (పెద్దగా నవ్వుతూ సుందరాన్ని కొట్టాడు) ఉగాది లక్ష్మి తాండవించేది ఇంటి మహాలక్ష్మి ముఖంలోనేనయ్యా.

సుందరం :హ హ హ... కదా బాబాయ్‌గారూ... అదేంటో నేను అదే చెబ్దామనుకున్నాను కానీ అదేంటో ఇలా వచ్చేసింది.

కోదండం :సుందరం నువ్వోపని చెయ్యాలయ్యా

సుందరం :చెప్పండి బాబాయ్‌గారూ

కోదండం :బంగాళా దుంపలు సన్నగా తరిగి వేయించి పాకెట్లలో పెట్టి అమ్ముతుంటారూ ఏంటదీ...

సుందరం :చిప్సు

కోదండం :ఆ...చిప్సు... అలా... జంతికలు, చేగోడీలు, వేయించిన వేరుశనక్కాయలు ప్యాకెట్లలో పెట్టి అమ్ముతున్నారటయ్యా.

సుందరం :అవునండీ. నేనూ చూశాను.

కోదండం :అవి తెచ్చి పడేశావనుకో మధ్యాహ్నం భోంచేసి పడుకుని నిద్రలేచింతర్వాత సాయంత్రం నువ్వొచ్చే వరకూ ఏదో నాక్కాలక్షేపంలా తోడుంటాయి. రేపాఫీసునుంచొస్తున్నప్పుడు తలా ఓ హార్లిక్స్ సీసాడు పట్రా. ఓ రెండ్రోజులు నిష్పూచిగా ఉంటుంది.

సుందరం :(ఏడవలేక నవ్వుతూ...) తలా హార్లిక్స్ సీసాడు... రెండు రోజులు... నిష్పూచీ... అలాగే బాబాయ్‌గారూ అలాగే.

కమల :(కమల ఓ చిన్న గిన్నెతో, చిన్న స్పూన్‌తో ఉగాది పచ్చడి తెస్తుంది) ఇదిగోండి బాబాయ్‌గారూ ఉగాది పచ్చడి.





కోదండం :ఇదేంటమ్మా ఇంత చిన్న గిన్నెతోనా? జరగబోయే సంవత్సరం తీపిగా ఉంటుందో, పుల్లగా ఉంటుందో, వగరుగా ఉంటుందో మనకు తెలియ జేస్తుందమ్మా ఈ ఉగాది పచ్చడి. అలా మూడువందల అరవై అయిదు రోజులకు సరిపడే సమాచారాన్నిచ్చే ఈ పచ్చడిని మరీ గుళ్ళో తీర్థం తెచ్చినట్టు తెస్తే ఎలాగమ్మా? చేసిందింతేనా...

కమల :ఇంకా ఓ పెద్ద గిన్నెడుంది బాబాయ్‌గారూ. ఎవరైనా స్నేహితులొస్తే ఇవ్వడానికి అట్టేపెట్టాను.

కోదండం :ఫర్వాలేత్తల్లీ... పట్టుకురా... పట్టుకురా... చెప్తా...

(సుందరం నోరు తెరుచుకుని చూస్తుంటాడు. కమల లోపలికెళ్ళి పెద్ద గిన్నెతో ఉగాది పచ్చడి తెస్తుంది. కోదండం ఆ గిన్నెను చేతిలోకి తీసుకుని చిన్న స్పూన్‌తో మిగిలిన ఇద్దరి చేతుల్లోనూ వేస్తూ...)

కోదండం :పెద్దవాణ్ణి... నేనాశీర్వదిస్తూ వేస్తున్నాన్రా... తినండి... తియ్యగా ఉందా?

సుందరం :(ఇబ్బందిగా) ఉంది బాబాయ్‌గారూ ఉంది

కోదండం :ఏమ్మా నీకు?

కమల :నాకింకా తియ్యగా ఉందండి

కోదండం : మరే! పిల్లల జీవితాలు తియ్యగా ఉండడానికే కద్రా పరమశివుడు హాలాహలాన్ని దిగమింగినట్టు ఈ పెద్దవాళ్ళు ఎంత చేదునైనా భరించేది!?

(అంటూ ఓ ఫిలాసఫికల్ నవ్వు నవ్వి గిన్నె ఎత్తి మొత్తం ఉగాది పచ్చడిని ఘటోత్కచుడు పాయసంగిన్నెని ఊదిపారేసినట్టు గటగటమని మింగేసి)

కోదండం :ఎంత ఇరుగు పొరుగైనా, స్నేహితులైనా ఎదరింట్లో వాళ్ళు ఉగాది పచ్చడి తినకుండా బైటికి రార్లేమ్మా! మరీ ఇంతంత చేసి దుబారా చెయ్యకూడదు... అదది పొదుపుగా ఉంటేనే సంసారాలు నిలబడతాయి. (గిన్నె ఒకరికి స్పూన్ ఒకరికి ఇచ్చేసి ఇద్దర్నీ ఒకేసారి చరుస్తూ) ఏవంటారు? త్వరగా టిఫిన్‌కేర్పాట్లు చెయ్యమ్మా ఆత్మారాముడు ఆవురావుమంటున్నాడు.

(ఖాళీ అయిన గిన్నె, స్పూన్‌ని కమల, సుందరం నిశ్చేష్టులై చూస్తూ ఉండగా)

--- కట్ ---

(టీపాయ్‌మీద ఇడ్లీ ప్లేటుతోపాటు గిన్నెలో ఉన్న ఉగాది పచ్చడి చూసి గావుకేక పెట్టాడు సుందరం. సర్వర్ అదిరి పడ్డాడు. చుట్టూ ఉన్న వాళ్ళు వింతగా చూస్తున్నారు.

సర్వర్ : సార్... ఏమయింది సార్?

సుందరం : (టీపాయ్‌మీద అతి చిన్న గిన్నెతో ఉగాది పచ్చడి ఉంది) పచ్చడి...! ఈ పచ్చడి చూస్తే నన్ను పచ్చడి చేస్తున్న పరమ కిరాతకుడు గుర్తొస్తున్నాడు.

సర్వర్ :ఇవాళ ఉగాది కదానని ప్రతి ఐటమ్‌తో ఉగాది పచ్చడి కూడా సర్వ్ చేస్తున్నాం. ఫ్రీయేసార్... దీనికి ఛార్జ్ లేదు.

సుందరం :(తేరుకున్నాడు) హ హ హ... నాకు తెలీదనుకున్నావా... పిచ్చివాడా... ఇలా మీరు ఉగాది పచ్చడి కూడా ఇస్తున్నారని బి.బి.సి. వార్తల్లో చెప్పుంటేవిని నమ్మలేకే ఇలా వచ్చా...

సర్వర్ :అందుకా అంత కేక పెట్టారు?

సుందరం :మరేం అనుకున్నావ్? పిచ్చెక్కిందనుకున్నావా? పిచ్చివాడా...

కమల :ష్... చాల్లెండి... ఇంక ఊర్కోండి.

(సర్వర్ వింతగా చూస్తూ వెళ్ళిపోయాడు)

సుందరం :నిజం కమలా! ఒక్క రెండు నిముషాలపాటు మైండ్ పనిచేయడం మానేసిందంటే నమ్ము!

కమల :ఇలాగే ఉంటే మరికొన్నాళ్ళలో మీతో నాకు పిచ్చెక్కడం ఖాయం.

సుందరం :నన్నేంచెయ్యమంటావ్ కమలా? ఇప్పటికే పి.యఫ్. లోన్‌తో పాటు ఆఫీసులో ఉన్న అన్ని లోన్లూ వాడేశా ఈ బాబాయ్‌ని మేపడంకోసం.

కమల :అయినా అదేం తిండండీ బాబూ. రోజూ గుండిగలగ్గుండిగలు వండి వారుస్తున్నా ఒక్కసారైనా 'ఇక చాల్లే' అనడే!?

సుందరం :(వైరాగ్యంగా) అనడు కమలా అనడు. బకాసురుడి ముని మనువడు ఆయన ఇంకచాలు అంటే అతను కోదండం బాబాయ్ ఎందుకవుతాడు?

కమల :ఏం కోదండం బాబాయో ఏమిటో మనచేత మాత్రం 'నీకో దండం బాబోయ్' అనిపించేస్తున్నాడు. అరె... తింటే తిన్నాడు... ఏ జన్మ ఋణమో అనుకోవచ్చు... ఆడా మగా తేడా లేకుండా ఆ కొట్టడం అలవాటేంటండీ?

సుందరం :అవును కమలా అది మాత్రం ఋణం కాదు దారుణమే! కానీ ఏం చెయ్యమంటావు చెప్పు కమలా! ఆ బాబాయ్‌గాడు ఓ మాట

చెప్పటంవల్లే నాకీ ఉద్యోగం వచ్చిందని నీకు తెలుసు కదా... అందుకే ఆయన్ని ఏమీ అనలేక పోతున్నాను.

కమల :ఇది మరీ బావుంది... వస్తే... ఏంటంట? ఇక జీవితాంతం ఆయన అడుగులకు మడుగులొత్తేసి దాసోహం అయిపోవడమేనా? అసలాయన మీకెలా బాబాయో సరిగ్గా చెప్పగలరా మీరు?

సుందరం :చెప్పలేకేం? మా అమ్మమ్మ ఆడపడుచు తోటికోడలు పెద్దత్తగారి మనవడికి వేలువిడిచిన మేనమామ కొడుకో, బావో మొత్తానికి ఏదో ఒకటి ఖచ్చితంగా అవుతాడు.

కమల :ఆ ఆ ఏదో అవుతాడు - ఖచ్చితంగా? ఏమవుతాడో మాత్రం కరెక్టుగా తెలీదు. అంతేనా?

సుందరం :అందుకేకదా సేఫ్‌సైడ్ బాబాయ్ అనేస్తున్నా.

కమల :మీరేకాదు నేను కూడా అలానే అంటున్నా ఖర్మకాలి. ఆ మహానుభావుడు మన కొంపలో ఎప్పుడు దిగబడ్డాడో గుర్తుందా...?

సుందరం :దీపావళికి దిగాడు.

కమల :ఏదో ఒకటి రెండు రోజులుండి వెళతాడ్లే అనుకున్నాం. అవునా?

సుందరం :ఊ...

కమల :సంక్రాంతి వెళ్ళిపోయింది. ఇదిగో ఉగాది కూడా అయిపోవస్తోంది. ఈ లెక్కన ఎక్కడ తేల్తాం ఎప్పుడు తేల్తాం మీరే చెప్పండి?

సుందరం :నాకు మాత్రం బాధగా లేదనుకున్నావా... ఆయన గారెంతతిన్నా, ఎంత కొట్టినా తెలుగువాణ్ణే కనుక సర్దుకుపోగలను కానీ భార్యభర్తలుగా మన మధ్యదూరం ఎంత పెరిగిపోతోంది... ముద్దూ ముచ్చటల సంగతి దేవుడెరుగు, మాటామంతీకూడా కరువైపోతున్నాయ్. చిన్న ముక్క మాట్లాడుకుందామన్నా అడ్డుగా కూచుంటాడు. బొత్తిగా ప్రైవసీ అన్నదే లేకుండా పోతోంది.

కమల :ఓహో ఇప్పుడు గుర్తొచ్చిందన్నమాట ఆ విషయం

సుందరం :ఏం నువ్వు మాత్రం ఫీలవట్లేదా?

కమల :ఎందుకవనూ? కాకపోతే ఆ మాట నేను బైటికంటే బాగోదు కనుక అనలేకపోతున్నా.

సుందరం :లాభం లేదు కమలా ఎలాగోలా బాబాయ్‌కి ఉద్వాసన చెప్పెయ్యాలి.

కమల :మీ వల్లకాదు లెండి. ఎందుకొచ్చిన గొడవ? ఇంటికి పదండి. రాత్రి భోజనానికి ఓ గుండిగ వార్చాలి.

సుందరం :నన్ను రెచ్చగొట్టకు కమలా... తిక్క రేగిందంటే అయిడియా




తెచ్చేసుకోగలను.

కమల :ఎందుకండీ అనవసరంగా శ్రమ... ఆయన ఓ పెద్ద ఆశయంతోనే మనింట్లో తిష్ఠ వేశాడు. ఆయన ఆశయం ముందు మీ అయిడియాలన్నీ వేస్టే.

సుందరం :ఆ... ఆశయమా... ఏవిటబ్బా ఆయనకున్న అంత గొప్ప ఆశయం?

కమల :జీర్ణాశయం

సుందరం :కమలా... రెచ్చగొట్టేశావు... నన్ను పూర్తిగా రెచ్చగొట్టేశావు... అయిడియా చెప్తున్నా విను... రేపు నేను ఆఫీసుకెళ్ళి మనింటికో టెలిగ్రాం కొడతా

కమల :ఏమని?

సుందరం :మీ వాళ్ళెవరో పోయారని

కమల :ఏం మావాళ్ళెందుకు పోవాలి? మీ వాళ్ళనే పొమ్మనండి

సుందరం :పొమ్మనచ్చు కానీ వాళ్ళ లిస్టంతా బాబాయ్‌కి కంఠోపాఠం కదా అందుచేత ఆ రూట్లో బాబాయ్‌ని కదిలించలేం... మీ వాళ్ళే బెస్టు.

కమల :సరే కానివ్వండి... మీ బాబాయ్ పుణ్యమా అని మీ చేతిలో పోవల్సిన ఖర్మ పట్టింది మా వాళ్ళకి.

సుందరం :చెప్పేది విను. ఆ టెలిగ్రాం రాగానే నువ్వు ఓ ఏడుపు సీను యాక్టుచేసేసి మీ ఊరెళ్ళిపో.

కమల :నేవెడితే మరి మీ భోజనం అదీ...

సుందరం :భోజనమే మన తురుపుముక్క. నేనేదో 'ఫ్రెండ్ రూంలో ఉంటాను. బైట తింటాను' అంటాను. దెబ్బతో బాబాయ్‌కి పుడ్డు ప్రాబ్లెమ్. దాంతో ఇంకో ఇల్లు చూసుకుంటాడు. ఏమంటావ్?

కమల :బాగుందండోయ్. ఎన్నాళ్ళకి మీ బుర్ర పనిచెయ్యడం మొదలెట్టిందండీ...!

సుందరం :జాగ్రత్త కమలా... టెలిగ్రాం రాగానే ఏడవాలి. బాబాయ్ అద్దిరిపోవాలి.

కమల :చూస్తారుగా నా యాక్టింగు? 500 తెలుగు సినిమాలు చూసిన అనుభవం! అదరగొట్టెయ్యనూ...

xxx కట్ xxxx

(కమల భోల్లున ఏడుస్తూ ఉంటుంది.)

కమల :ఎంతపని చేశావురా భగవంతుడా! కనీసం నా కుడికన్నైనా అదరలేదు. దేవుడిదగ్గర దీపం గుప్‌మని ఆరిపోలేదు. ఇలా ఏమాత్రం హింట్ ఇవ్వకుండా ఇంత ఘోరం చెయ్యడానికి నీకు మనసెలా ఒప్పిందిరా దేవుడా... నీ మనసెలా ఒప్పిందిరా!

కోదండం :(కోదండం ఆదుర్దాగా పరుగెత్తుకుంటూ వస్తాడు) ఏవయింది తల్లీ... ఏవయిందమ్మా.

కమల :అయిపోయింది బాబాయ్‌గారూ అయిపోయింది అంతా అయిపోయింది మొత్తం అయిపోయింది బాబాయ్‌గారూ టోటల్‌గా అయిపోయింది. మొత్తం అయిపోయింది బాబాయ్‌గారూ - టోటల్‌గా అయిపోయింది.

కోదండం :ఒకే విషయాన్ని అన్నిరకాలుగా చెప్తావేమిటమ్మా - నువ్విలా టెన్షన్ పెట్టేస్తే నాకు బీపీ పెరిగిపోయి కిందపడిపోతాను తల్లీ దయచేసి త్వరగా చెప్పు.

కమల :అమ్మో ఇప్పుడు మీరు కిందపడిపోకండి బాబాయ్‌గారూ కిందపడిపోకండి.

కోదండం :(ఓ చరుపు చరుస్తూ) ఊరుకోమ్మా... ఊరుకో...

కమల :కొట్టకండి బాబాయ్‌గారూ కొట్టకండి

కోదండం :ఇది సానుభూతి తల్లీ.. ఓదారుస్తున్నా...

కమల :మీ ఒక్కో సానుభూతి ఓ మణుగు బరువుంది బాబాయ్‌గారూ

మణుగు బరువుంది.

కోదండం :ప్రతి వాక్యాన్ని రెండుసార్లు అంటున్నావెందుకమ్మా!

కమల :సినిమాల్లో ఏడుపుగొట్టు సీనుల్లో ఇలాగే అంటారు బాబాయ్‌గారూ ఇలాగే అంటారు.

కోదండం :విషయమేమిటో చెప్పమ్మా, విషయమేమిటో చెప్పు, ఛీ ఛీ నాకూ వచ్చేసిందా అలవాటు.

కమల :మా మేనత్త... మా మేనత్త బాబాయ్‌గారూ!

కోదండం :మీ మేనత్త మీ మేనత్త కాకపోతే నా మేనత్త అవుతుందా! ఏమయింది ఆవిడకి?

కమల :అవడానికేం ఉంది బాబాయ్‌గారూ... చచ్చిపోయింది.

కోదండం :అయ్యోపాపం! పెళ్ళయిన తర్వాత ఇంటిపేరు మారిపోతుంది కాబట్టి నీకు పదిరోజుల మైల ఉండదులేమ్మా! ఓ చెంబుడు నీళ్ళు నెత్తిన దిమ్మరించేసుకుని పెసరపప్పు వండు. పెసరపప్పు, నెయ్యి, ఆవకాయ కాంబినేషన్ బావుంటుంది. పదోరోజున నేతిగారెలు చెయ్యి.

కమల :అయ్యో బాబాయ్‌గారూ... మా మేనత్త పోయిందని నేనేడుస్తుంటే పెసరపప్పు, గారెలూ, పక్షిణీ అంటారేవిటండీ? నన్ను కళ్లలో పెట్టుకుని పెంచిందండీ ఆవిడ...

కోదండం :అదేంటమ్మా ఒళ్ళో పెట్టుకుని కదా పెంచుతారు పిల్లల్ని!

కమల :ఆవిడ ఒళ్ళో ఆవిడ సొంత పిల్లలుండేవారండీ అందుకే అక్కడ ఖాళీ లేక నన్ను కళ్ళల్లో పెట్టుకు పెంచింది.

కోదండం :కళ్ళంటే గుర్తొచ్చింది - రోజూ బాదంపాలు తాగితే కళ్ళకి మంచిదట, ఇందాక ఎవరో బజార్లో చెప్పారు - ఇంట్లో బాదంపప్పులున్నాయామ్మా?

కమల :నా బాధనర్థం చేసుకోకుండా బాదం అంటారేమిటి బాబాయ్‌గారూ? నేనిప్పుడు ఊరెళ్ళాలండీ - నేను వెడితేనే గానీ మా అత్తయ్య ఆత్మ శాంతించదు.
(ఏడుస్తోంది పెద్దగా...) అత్తయ్యా...

కోదండం :ఊరుకోమ్మా
(కోదండం చెయ్యెత్తాడు. కమల చూసింది)

కమల :చెయ్యెత్తుతున్నారు. మళ్ళీ సానుభూతా?

కోదండం :అవునమ్మా లైట్‌గా

కమల :(దూరంగా జరిగింది) వద్దు బాబాయ్‌గారూ. మీ బరువైన సానుభూతి నాకొద్దు నేను బయల్దేరతాను.

కోదండం :వెళ్ళిరామ్మా... అన్నట్టు అబ్బాయికి తెలుసా ఈ విషయం?

కమల :ఫోన్‌చేసి చెప్పానండీ... నన్ను వెళ్ళమన్నారు. నేనొచ్చేవరకూ తను వాళ్ళ ఫ్రెండింట్లో అడ్జస్ట్ అవుతానన్నారు.

కోదండం :ఓహో

కమల :మరి మీ సంగతెలా బాబాయ్‌గారూ? నా బెంగంతా మీ గురించే...

కోదండం :నేనూ అదే చెప్పబోతున్నానమ్మా... అబ్బాయ్‌కి మళ్ళీ ఫోన్‌చెయ్యి. వాళ్ళింట్లోనూ, వీళ్ళింట్లోనూ ఉండాల్సిన ఖర్మేంటి అతనికి? పెద్దముండావాణ్ణి నేను లేనూ! ఆ మాత్రం నేను చూసుకోలేనూ?

కమల :అంటే మీకు వంట చెయ్యడం వచ్చా బాబాయ్‌గారూ?

కోదండం :చెయ్యడం రాదమ్మా చేయించడం వచ్చు. చక్కగా అబ్బాయిచేత అన్నీ దగ్గరుండి మరీ చేయిస్తాను. అలా వాళ్ళిళ్ళలోను. వీళ్ళిళ్ళలోను చెయ్యి కడిగితే గౌరవం ఎలా ఉంటుందీ నా పిండాకూడు! ఆ సంగతి అబ్బాయొచ్చాక బాగా తెలిసొచ్చేట్లు చెప్తాలే నువ్వు బయల్దేరమ్మా బయల్దేరు. నువ్వెడితేగాని అక్కడ ఆవిడ ఆత్మకి, నా ఆత్మారాముడికి శాంతి లభించదు.



బయల్దేరు చెప్తా!
(కమల నిస్సహాయంగా చూస్తూ ఉండగా...)

××× కట్ ×××

(వంటింట్లో కోదండం బాబాయ్ సుందరంతో వంట చేయిస్తూ ఉంటాడు. సుందరం మొహం పొగచూరిపోయి - పరమ నీచంగా ఉంటాడు)

కోదండం :ఆ... అదీ... ఆ నెయ్యి మరికొంచెం పొయ్యి.

సుందరం :ఇప్పటికే ఓ పావుకేజీ వేసుంటానండీ

కోదండం :ఆ వేశావులేవయ్యా... మహా! ఇంకొంచెం వెయ్యి నే చెప్తున్నాగా వెయ్.
(మూకుట్లో సుందరం మరికొంత నెయ్యి పోశాడు)
ఇందులో ఆ కేజీడు జీడిపప్పూ వెయ్యి.

సుందరం :కేజీడు జీడిపప్పా!

కోదండం :ఆ... మరి.. జీడిపప్పు వేపుడు అంటే మాటలనుకుంటున్నావటయ్యా... సంపాదించగానే సరికాదయ్యా అనుభవించే అదృష్టంకూడా ఉండాలి... అసలెప్పుడైనా విన్నావయ్యా జీడిపప్పు వేపుడు గురించి...

సుందరం :లేదండి

కోదండం :(పెద్దగా నవ్వుతూ సుందరాన్ని కొట్టాడు) చాలా విచిత్రమైన మనిషివయ్యా సుందరం - ఇన్నేళ్ళొచ్చినా జీడిపప్పు వేపుడు గురించి తెలీదంటే - ఏం జోక్ చేశావయ్యా
(మళ్ళీ కొట్టాడు. సుందరం జబ్బమీద రాసుకుంటున్నాడు)
అందుకే పెద్దవాళ్ళద్వారా కొన్ని కొన్ని తారకమంత్రాలు తెలుసుకుంటూ ఉండాలన్నారు.

సుందరం : ఎవరన్నారు?

కోదండం :పెద్దవాళ్ళే అన్నార్లే... ఇంకా చూడు జీడిపప్పు ఎంతుందో...

సుందరం : ఇంకేంలేదు బాబాయ్‌గారూ మొత్తం అయిపోయింది ఒక్క పలుకుంటే ఒట్టు!

కోదండం : అలా దాచేస్తావేమిటయ్యా! ఇలా ఇయ్యి... ఓహో... ఈజీగా ఉంటుంది మరో కేజీ!

సుందరం : అది కమల దాచిందండీ ఎందుకో ఏవిటో

కోదండం : ఎందుకైతే ఏంటీ... మళ్ళీ సాయంత్రానికల్లా తీసుకొచ్చి పడెయ్యవా ఏంటి? ఇప్పుడు ఆ కేజీడు పప్పూ మూకుళ్ళో వెయ్యి.
(సుందరం వేశాడు)

కోదండం: ఆ చేత్తోనే ఈ కేజీడు పప్పు కూడా పొయ్యిమీద మరుగుతున్న

పాలల్లో పడెయ్.

సుందరం :బాబాయ్‌గారూ ఇదేంటి?

కోదండం :ఏమయిందయ్యా...

సుందరం :మీరు పొయ్యమన్నారని మూడు లీటర్ల పాలు పోశాను. ఇప్పుడవి లీటరు కూడా లేవు.

కోదండం :దాన్నే బాగా మరగ కాచడం అంటారయ్యా. జీడిపప్పు త్వరగా వెయ్యి - ఆలస్యం చేస్తే ఆ లీటరు పాలూ స్పూనుడైపోతాయి.

సుందరం :కేజీడు జీడిపప్పు... లీటరు పాలు... ఏంటి బాబాయ్‌గారూ ఇది?

కోదండం :దీన్నే జీడిపప్పు పాయసం అంటారు.

సుందరం :జీడిపప్పు బదులు సేమ్యా వెయ్యాలనుకుంటానండీ

కోదండం :అది పీనాసివెధవల టేస్ట్... ఆ తల్లి... శాకాంబరీ దేవి దయ వలన అరిగించుకునే ఆరోగ్యం, అంతకుమించిన అభిరుచి అన్నీ సమకూరేయి కదయ్యా మనకి... శుభ్రంగా బ్రతికున్న నాలుగు రోజులూ హాయిగా తినకుండా ఎందుకయ్యా అంత నీచంగా దరిద్రంగా, ఛండాలంగా ఆలోచిస్తావ్, మురుగ్గుంటలో రాగిముక్కలు ఏరుకునే మురికి వెధవలాగా!

సుందరం :మురుగ్గుంటలో రాగిముక్కలు ఏరుకునే మురికి వెధవ! - హా! నన్నెంత గొప్పగా వర్ణించారు బాబాయ్‌గారూ! ఇంక నేను మీకు ఎదురు చెప్పనుగాక చెప్పను. నన్నేం చెయ్యమంటారో చెప్పండి.

(ఆ పక్కన పెద్ద వంకాయలు గుండ్రనివి ఉంటాయి)

కోదండం :అలా అన్నావూ బావుంది. ఆ వంకాయలు అందుకో.

సుందరం :ఎందుకండీ... కూర బదులు జీడిపప్పు వేపుడు చేసుకున్నాంగా...

కోదండం :అవి మధ్యాహ్నం పంటికిందకి. ఈ వంకాయలు కాస్త తరిగి మసాలా కూరి ఆ కాయలపాళంగానే శనగపిండిలో ముంచి నూనెలో వేయిస్తే ఉంటుంది ఆ బజ్జీల రుచీ... నా రాజా... సాయంత్రం నిద్రలేచేసరికి అంగుట్లోకి అల్పాహారంగా ఉంటాయయ్యా...

సుందరం :ఇంతంత కాయలు... కాయలప్పాళంగా బజ్జీలు... అంగుట్లోకి అల్పాహారం... మిమ్మల్ని పోషించడానికి మహరాజులు కూడా సరిపోరు బాబాయ్‌గారూ చక్రవర్తులు కావాల్సిందే ! (అన్నాడు బాధగా)

(ఆ పక్కనే అప్పుడే ఊర్నించి వచ్చిన కమల కూడా షాక్ అయి చూస్తూండిపోయింది.)

కమల :కేజీ జీడిపప్పు వేపుడు కేజీ జీడిపప్పూ, మూడు లీటర్ల పాల పాయసం! గుత్తొంకాయ బజ్జీలు! మై గాడ్!

--- కట్ ---

**(ఇంకావుంది)**

జస్ట్‌ఫర్ ఫన్

# గోల్డెన్ జూబ్లీ కోరిక

అనుకోకుండా నలుగురు మిత్రులు వైజాగ్‌లోని ఓ మేరేజ్ హాల్లో కలుసుకున్నారు. ఒకళ్ళు నొకళ్ళు చూసి గుర్తుపట్టడానికి కొంత టైం పట్టింది. ఎందుకంటే వాళ్ళు ఒకొర్నకరు చూసుకుని చాలాకాలం అయింది - యాభై ఏళ్ళు

తాము కాలేజీలో చదువుకునే రోజుల్లో క్లాస్‌మేట్స్‌గా గుర్తించాక వాళ్ళు ఉత్సాహంగా పాత విషయాలు మాట్లాడుకోసాగారు. క్రమేపీ వాళ్ళ మాటలు వాళ్ళు ఆరోజుల్లో ప్రేమించిన యువతుల మీదకి మళ్ళింది. అక్కడ నించి వాళ్ళ భార్యల మీదకి మళ్ళింది. ప్రతీవారు తాము తమ భార్యని ఎంతగా ప్రేమిస్తున్నారో పోటీ పడి చెప్పకోసాగారు.

వాళ్ళల్లో ఒకరైన రామేశం చెప్పాడు.

"నేను ప్రేమించిన గోదాదేవిని పెళ్ళి చేసుకోలేదు. మా పెద్దలు కుదిర్చిన సంబంధమే చేసుకున్నాను. సుఖ పడ్డాను. మా పెళ్ళయి ఏభై ఏళ్ళయినా ఇంత దాకా నేను నా భార్యని పల్లెత్తుమాటని ఎరగను. మా ఫిఫ్టీయత్ మేరేజ్ ఏనివర్సరీకి ఏం కావాలని అడిగితే మొదట మేము హనీమూన్‌కి వెళ్ళిన హోటల్‌కి వెళ్ళి అప్పుడు మేం వున్న గదిలోనే దిగుదామంది. సరేనని ఆ ఏర్పాటు చేశాను.



"ఏం హోటల్ అది?" అడిగాడు కామేశం.

"బందరులో రాధాకృష్ణ లాడ్జి"

కామేశం తన కేల్‌కులేటర్ మీద టకటక కేలిక్యులేట్ చేసి పెదవి విరిచి చెప్పాడు.

"ఓస్! మీ ప్రేమకి నిదర్శనంగా నువ్వు ఖర్చు చేసేది ఇంతేనా? నేనైతే నా భార్య కోసం ఇంకా ఎక్కువ ఖర్చు చేస్తున్నాను."

"ఏం చేస్తావు?" మిగిలిన ముగ్గురు ఆసక్తిగా అడిగారు.

"మా పెళ్ళి రోజు నేను మా ఆవిడకి ఓ వడ్డాణం కొనిచ్చాను. మా గోల్డెన్ జూబ్లీ ఏనివర్సరికీ సరిగ్గా అలాంటిదే చేయించి పెట్టమని అడిగింది. పెళ్ళయి పిల్లలు పుట్టాక దాని నడుం ఎంత లావైనా సరేనని అదే మోడల్ చేయించి మా ఆవిడకి ప్రెజెంట్ చేస్తున్నాను."

అది విన్న మాజీ మిత్రుడు మహేశం చెప్పాడు.

"నేను మా ఆవిడని మీ ఇద్దరి కన్నా ఇంకా ఎక్కువగా ప్రేమిస్తున్నాననుకుంటున్నాను"

"అలాగా! ఎలా?" అడిగారు రామేశం, కామేశం వెంటనే.

"మా పెళ్ళి రోజున నేను, నా భార్య కలిసి మా స్వంత ఇంట్లోకి గృహప్రవేశం చేసాం. మా గోల్డెన్ జూబ్లీ రోజున సరిగ్గా అలాంటి ఇంకో ఇల్లు కావాలంది దాంతో ఓ కొత్త ఇల్లు కట్టింది ఆ రోజున మేం ఇద్దరం అందులోకి గృహప్రవేశం చేస్తున్నాం"

అది విన్న కాసేపు మౌనంగా వున్న రామేశం, కామేశం ఓటమిని అంగీకరిస్తూ, తమ నాలుగో మిత్రుడు సుబ్బయ్యని అడిగారు.

"నువ్వేం మాట్లాడవే?"

"ప్రతీ భర్త తన భార్యని ప్రేమించడం సహజం. ఇందులో బయటికి చెప్పుకోడానికే వుంది?" ఎదురు ప్రశ్నవేసాడు సుబ్బయ్య.

"మీ ఆవిడ గోల్డెన్ జూబ్లీకి ఏం కోరనే లేదా?" ప్రశ్నించాడు కామేశం.

"కోరింది".

"ఆ కోరిక తీరుస్తున్నావా?" ఈసారి రామేశం ప్రశ్నించాడు.

తలవూపాడు సుబ్బయ్య .

"ఏమిటా కోరిక?" అడిగాడు మహేశం ఆసక్తిగా.

"మా హనీమూన్‌కి నేను, మా ఆవిడ కలిసి కలకత్తా వెళ్ళాం" ఆలోచనగా ఆగాడతను.

"మీ గోల్డెన్ జూబ్లికి మళ్ళీ కలకత్తా తీసుకెళ్ళమందా" అడిగాడు మహేశం.

"కాదు. ఈ గోల్డెన్ జూబ్లికైనా కలకత్తాకి వచ్చి తనని తిరిగి మా ఇంటికి తీసుకుపొమ్మని ప్రాధేయపడుతోంది. సరేనన్నాను" చెప్పాడు సుబ్బయ్య.

-రచన : మల్లాది వెంకటకృష్ణమూర్తి.

# ఆస్కార్ గెలుచుకున్న మ్యూజికల్ - ములాన్‌రూజ్

ఈ సారి ఆస్కార్ బహుమతుల్లో ఒక విశేషం ఉంది. చాలా సంవత్సరాల తర్వాత ఒక మ్యూజికల్ సినిమా - 'ములాన్ రూజ్'కు సంగీతానికై బహుమతి దక్కింది. ఇక్కడ మ్యూజికల్‌ను కాస్త నిర్వచించవలసిన అవసరం ఉంది. పాటల విషయంలో మన సినిమాలకు, హాలీవుడ్ సినిమా లకు తేడా ఉంది. మన సినిమాలలో అవసరం ఉన్నా లేకపోయినా తప్పదురా అన్నట్టు పాటలు పెట్టడం జరుగుతుంది. వాళ్ళ సినిమాలలో సాధారణంగా పాటలుండవు. పాటలకోసం వేరే సినిమాలు తీస్తారు. వాటిని మ్యూజికల్స్ అంటారు. మన తెలుగునాట కూడా బాగా తెలిసున్న మ్యూజికల్స్‌లో "సౌండ్ ఆఫ్ మ్యూజిక్", "మై ఫెయిర్ లేడీ", "ఫిడ్లర్" ఆన్ ది రూఫ్"లను పేర్కొనవచ్చు.




+++

అమెరికన్ మ్యూజికల్ అనే ధోరణి చిత్రాలు 1930 ప్రాంతంలో రూపు దిద్దుకున్నాయి. న్యూయార్క్‌లోని బ్రాడ్వే నాటకశాలయే వీటికి స్ఫూర్తినిచ్చింది. 1927వ సంవత్సరంలోనే "షోబోట్" అనే సంగీత నాటకం, వార్నర్ బ్రదర్స్ వారి "జాజ్ సింగర్" అనే మొట్టమొదటి మ్యూజికల్ చిత్రం తయారయ్యేయి. రెండూ విజయవంత మయి, తరువాత సంవత్సరం "ది సింగింగ్ ఫూల్'' అనే సినిమా వెలువడడానికి దోహదం చేశాయి. 1929లో వెలుగుచూసిన ఎమ్.జి.ఎమ్. వారి "బ్రాడ్వే మెలడీ'' మ్యూజికల్స్ భవిష్యత్తును నిర్దేశించింది. దీని విజయానికి కారణాలలో ముఖ్యంగా చెప్ప వలసినది - సంగీతానికి కథను జోడించ డం. మన సినిమాలలోలా కాకుండా పాటలు పెట్టవలసిన అవసరం ఉండేట్లా కథనం మలిచేవారు. ఆ లెక్కలో మన "జయభేరి"ని మ్యూజికల్‌గా పేర్కొన వచ్చు. కానీ ఆంగ్లచిత్రాలలో ఎక్కువగా మ్యూజికల్ కామెడీలు తీశారు.




+++

ఇప్పుడీ ములాన్ రూజ్ కథ కూడా 1899వ సంవత్సరానికి చెందిన ఒక కళాకారిణి చుట్టూ అల్లుకున్నదే. ఫ్రాన్సులో ఉన్న ములాన్ రూజ్ క్లబ్‌లో డాన్స్ చేసే సాటిన్ అనే అమ్మాయి చుట్టూ ఈ కథ తిరుగుతుంది. ఆమెను ఇవన్‌మెక్‌గ్రెగర్ అనే యువకవి ప్రేమిస్తుంటాడు. అతనికి పూటగడవడం కష్టం. డాన్సర్ అంటే ఒక డ్యూక్‌కి మహా వ్యామోహం. మధ్యలో క్లబ్ ఓనర్‌కి ఒక ఆశ - హీరోయిన్‌ను ఆశపెట్టి ఆ డ్యూక్‌నుండి తన కొత్త ప్రాజెక్టుకి నిధులు సంపాదిద్దామని అతని ప్లాను. తన కవి, డాన్సర్ తమ ప్రేమ వ్యవహారం బయటపడకుండా చూసుకోకపోతే డ్యూక్‌కి కోపం వచ్చి క్లబ్ నడవడమే సంకటంలో పడి పోతుందన్న భయం. అందుచేత పాటలు, ఆటలతో పాటు కథలో కావలసినంత 'డ్రామా' ఉంది. సాటిన్‌గా నికోల్ కిడ్‌మన్ చేసింది.



ములాన్‌రూజ్ చిత్రంలో నికోల్



ములాన్ రూజ్ చిత్రంలో

+++

ములాన్ రూజ్ కథానాయి కగా నికోల్ కిడ్‌మన్‌కి చాలా పేరు వచ్చింది. 1967 జూన్ 20న హవాయి ద్వీపాలలోని హోనోలూలూ లో పుట్టిన నికోల్ కిడ్‌మన్ ఆస్ట్రేలియాలో పెరిగింది. అక్కడే ఒక యాక్టింగ్ స్కూల్లో చేరింది. తన 14వ యేట "బుష్ క్రిస్‌మస్" అనే సినిమాతో తెరకెక్కింది. 1989లో 'డెడ్‌కామ్' చిత్రం ద్వారా హాలీవుడ్‌లో ఆరంగ్రేటం చేసిన ఆమె 1990లో ప్రసిద్ధ నటుడు టామ్ క్రూసీను రహస్యంగా పెళ్ళిచేసుకుంది. వీరిద్దరూ కలిసి చేసిన"డేస్ ఆఫ్ థండర్'' సంచలన విజయం సాధించింది. ఆ తర్వాత "ఫార్ అండ్ ఎవే", "టు డై ఫర్", "ఐస్ వైడ్ షట్" సినిమాలలో నటనకు మంచి పేరు తెచ్చుకుంది. టామ్ క్రూసీతో విడిపోయాక ఈ మధ్య తనను, తన పిల్లలను ఒక వీరాభిమాని వెంటాడి వేధిస్తున్నాడని ఫిర్యాదు చేసి వార్తల్లోకి ఎక్కింది కూడా.



నికోల్ కిడ్‌మన్

+++

ఈ సందర్భంగా ఆస్కార్ బహుమతులు గెలుచుకున్న కొన్ని ప్రఖ్యాత మ్యూజికల్స్‌ను గుర్తుకు తెచ్చుకోవడం సబబు. - బ్రాడ్వే మెలడీ (1929), ది గ్రేట్ జిగ్‌ఫీల్డ్ (1936) గోయింగ్ మై వే (1944) ఏన్ అమెరికన్ ఇన్ పారిస్ (1951) గీ గీ (1956) మై ఫెయిర్ లేడీ (1964) ది సౌండ్ ఆఫ్ మ్యూజిక్ (1965) ఎమాడియస్ (1984).




అదే విధంగా ఆస్కార్ గెలుచుకున్న కొందరు మ్యూజికల్స్ స్టార్స్‌ను కూడా... లూసీ రైనర్ - బెస్ట్ యాక్ట్రస్ - ది గ్రేట్ జిగ్‌ఫీల్డ్ (1936), జేమ్స్ కాగ్నీ - బెస్ట్ యాక్టర్ - యాంకీ డూడుల్ (1942) బింగ్ క్రాస్‌బీ - బెస్ట్ యాక్టర్ - గోయింగ్ మై వే (1944) యూల్ బ్రైనర్ - బెస్ట్ యాక్టర్ - ది కింగ్ అండ్ ఐ (1956) రెక్స్ హారిసన్ - బెస్ట్ యాక్టర్ - మై ఫెయిర్ లేడీ (1964) జూలీ ఆండ్రూ - బెస్ట్ యాక్ట్రస్ - మేరీ పాపిన్స్ (1964) ముర్రే అబ్రహామ్ - బెస్ట్ యాక్టర్ - ఎమాడియస్ (1984).

# ఐక్యూలు



పొట్టిగా.... పొదుపుగా....
రాయడానికి, చదవడానికి,
ముఖ్యంగా గుర్తుంచుకోడానికి,
రాసుకున్నాను - ఎంతో ఇష్టపడి

****

రెండేళ్ల క్రితం- కొన్ని చదివిన
'రాజా'గారు.... 'బాగున్నాయి' అని
వార్త పత్రికలో ప్రింట్ చేశారు.
('ఐక్యూ' అనే శీర్షికగా)

వాటికొచ్చిన స్పందనకి పొంగిపోయి, మరికొన్ని రాశాను.
మొత్తం 'వంద' దాకా ఉంటాయి ఎంతో ఫీల్ అయి రాశాను - కాబట్టే...
దానికి **"ఫీలింగ్స్"** అని పేరు పెట్టి, అతి త్వరలో పుస్తకం రూపంలోకి
తీసుకురావాలనే ప్రయత్నంలో ఉన్నాను. అదేమాట రాజాగారితో
అన్నప్పుడు.... ఆయన కొన్నింటిని 'హాసం' లో ప్రింట్ చేద్దామన్నారు.
అంత పెద్ద సాహితీ సాయం చేస్తున్నప్పుడు ఇంకేం కావాలి...!?

****

ఇవి చదివి మీరంతా పాస్ మార్కులేస్తే నా పుస్తకానికి కొంత పబ్లిసిటీ
వస్తుందనే దురాశతో ... చదివాక మీరేం ఫీలయారో నాకు తెలియజేస్తే
పుస్తకం వచ్చే లోపే పొరపాట్లు దిద్దుకోవాలని ఆశతో

...మీ....


**జనార్ధన మహర్షి**
**జి-2, కృష్ణా అపార్ట్‌మెంట్స్, అమీర్‌పేట్ క్రాస్‌రోడ్స్**
**యల్లారెడ్డిగూడా, హైదరాబాద్**


కృష్ణుడి తలమీద
నెమలి పింఛం చూశాకే
అర్థమయ్యింది
కన్ను నెత్తికెక్కడం
అంటే ఏంటో



---

శివధనస్సు
విరిగితేనే
రాముడు సీతకి
మొగుడయ్యాడు
చేపపిల్లని
చంపాకే
అర్జునుడికి ద్రౌపది
పెళ్ళామయ్యింది
విధ్వంసాలే
వివాహానికి పునాదులా?



ఏకలవ్యుడు
బొటన వేలు ఇచ్చాడు
ఏక 'లవ్వు'డు
చిటికెన వేలు ఇచ్చాడు
రెంటికీ తేడాలేదు
ఇద్దరూ బలయ్యారు



---

ప్రేయసిని
ప్రేమించటానికి
పార్క్‌లో 'చోటు' దొరకాలి
పెళ్ళాం చేత
ప్రేమించబడటానికి
గుండెల్లో 'చోటు' దొరకాలి



---

'సైతాను' మొగుడ్ని
కట్టుకుంది
'ఖైతాను' ఫ్యానుకు
'నైలాను' చీరని
కట్టుకుంది



---




వారానికోసారి
వెయింగ్ మిషన్‌లో
చూసుకుని
బరువు తగ్గించుకొంది
శరీరం తేలికైంది
మనసు తేలికయ్యే
మిషన్ ఉంటే ఎంత బాగుణ్ణు

---



నానా చావు
చచ్చి బతుకుతున్నాం
ఇంత బతుకూ బతికేది
చివరికి చావటానికా?

కోట్లు ఖర్చుపెడితే
అక్కడ.... రాకెట్ లేస్తుంది
రూపాయి ఉంటే
ఇక్కడ.... విస్తరిలేస్తుంది





ఆకాశంలో
అరుంధతిని
చూపిస్తారు
సవతిపోరు
అప్పట్నుంచే ప్రారంభం

దేవతలు
రాక్షసులు
మధించగా
పుట్టిందే
మా అమ్మచేతి ముద్ద





మా ఊరెళ్ళాను
బాగా డెవలప్ అయ్యింది.
ఒకప్పుడు కొండ ఉండేది - ఫ్యాక్టరీ వచ్చింది
చెఱువుండేది - కాలనీ వచ్చింది
సత్రం ఉండేది - స్టార్ హోటలొచ్చింది
మనుషులుండేవారు - కొమ్ములొచ్చాయి

అబద్ధం
ఎంత అందమైన
పదం
అది చెబితేనే
ఆడ పిల్లలు
పుడతారు.



అతనికి గూని
ఎందరి కష్టాల్నో
భుజాలమీద మోసాడు



కుటుంబ నియంత్రణ
ఒకరు లేక ఇద్దరు
.........
పిల్లలా?.... పెళ్ళాలా?






సినిమా
నచ్చితే.... 'షోలే'
నచ్చకపోతే -
'షో'-లే...!?



మా ఇంటిచుట్టూ
అపార్ట్‌మెంట్స్....!
వారికి కనబడకూడనివి
కనబడుతున్నాయి
మాకు కనబడాల్సిన
సూర్యచంద్రులు
కనబడటం మానేశారు.

ఆమె అంది
నన్ను ముట్టుకోకు
గొంగళి పురుగు
పాకుతున్నట్టుందని...!
అతను అన్నాడు
ఎప్పటికైనా ... అదే
సీతాకోక చిలక
అవుతుందని....!



నాలోని
బొక్కలు వెతక్కండి
అవే
వెదురుబొంగుని
మురళిగా చేసినది.






# నామీదేనర్రోయ్!



కార్టూనిస్టులు లోకాన్నంతా వెక్కిరించగలరు కానీ తమను తాము వెక్కిరించుకోగలరా? సినీ పరిశ్రమకు చెందిన వారిలో ఎంతమంది తమ సినిమా జయాపజయాల గురించి నిజాయితీగా చెప్పగలరు?

బాపు గారి 'నామీదేనర్రోయ్' క్విజ్ చూస్తే ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. బాపు హాస్యస్ఫోరతనూ, నిజాయితీనీ, చిత్తశుద్ధినీ ఆదర్శప్రాయంగా ఎందుకు పేర్కొంటారో జవాబు దొరుకుతుంది. బొమ్మలు చూడండి. బాపు తీసిన సినిమా టైటిల్సు గుర్తొస్తాయి. వాటితోబాటు బాక్సాఫీసు వద్ద ఆ చిత్రాల పరిస్థితి ఏమిటో అదనపు సమాచారంగా దొరుకుతుంది.

ఏ బొమ్మ ఏ సినిమాదో జతపరిచి చివరి పేజీలలోని సమాధానాలతో సరిచూసుకోండి.

ఆంధ్రజ్యోతి వీక్లీ కోసం - 1989లో ఈ క్విజ్ దరిమిలా 'హాస్యప్రియ'లో, 'బాపూరమణీయం' మళ్ళీ కనబడింది. ఇపుడు బాపూ "హాసం"కై ప్రత్యేకంగా వేసి ఇచ్చిన -రివైజ్డ్ అండ్ అప్‌డేటెడ్ వెర్షన్.

-ఎడిటర్












## సినిమా పేరేంట్రోయ్!



## నామూవేనక్రోయ్!




1. సాక్షి '67
2 బంగారు పిచుక '68
3 బుద్ధిమంతుడు '69
4 బాలరాజు కథ '70
5 ఇంటి గౌరవం '70
6 సంపూర్ణ రామాయణం '72
7 అందాల రాముడు '73
8 శ్రీరామాంజనేయ యుద్ధం '74
9 ఏది ధర్మం ఏది న్యాయం? '82
10. ముత్యాల ముగ్గు '75
11. భక్త కన్నప్ప '76
12 సీతా కళ్యాణం '76
13 మనవూరి పాండవులు '78
14 స్నేహం '77
15 తూర్పు వెళ్ళే రైలు '79
16 కలియుగ రావణాసురుడు '80
17 గోరంత దీపం '78
18 వంశవృక్షం '81
19 రాజాధిరాజు '80
20 కృష్ణావతారం '82
21. రాధా కళ్యాణం '81
22. త్యాగయ్య '81
23 జాకీ '85
24 మంత్రిగారి వియ్యంకుడు '84
25. సీతమ్మ పెళ్ళి '85
26 బుల్లెట్ '85
27 కళ్యాణ తాంబూలం '87
28 పెళ్ళీడు పిల్లలు '82
29 పెళ్ళిపుస్తకం '91
30 శ్రీనాథ కవిసార్వభౌముడు '92
31. మిస్టర్ పెళ్ళాం '93
32 పెళ్ళికొడుకు '94
33. రాంబంటు '95

ఆంధ్రప్రేక్షక మహాశయులు - 'ఇహ చాలక్కడ' అన్నారు

మధ్య కొన్ని సంవత్సరాలు
ఖాళీలొచ్చాయి ఎందుకనగా
:-
80లో హంపాంచ్
81లో బేజుబాన్,
83లో ఓసాత్ దిన్,
85లో మొహబ్బత్, ప్యారీ బెహనా,
87లో మేరా ధరం,
88లో దిల్‌జలా,
89లో ప్రేం ప్రతిగ్యా,
94లో పరమాత్మా- అన్న హిందీవి,
82లో నీతి దేవన్ మయంగిగిరాన్ అనే
తమిళ సినిమా వెలిగించాను.
వీటిలో అంటుకున్నవి ఆరు
మిగతావి ఆరిపోయాయి.
85-95 ఓ అయిదేళ్ళు వీడియో పాఠాలు
తీశాం.

- బాపు



# ఇన్ని ప్రసాదించిన దేవుడు నాకిలా శాపమిచ్చాడా..!?



ఘోరతపస్సు చేసినా దేవుడు ప్రత్యక్షం కాని రోజుల్లో అడగకనే నాకు వరమిచ్చిన వేలుపు శ్రీకోదండపాణి. ఈ బాల సుబ్రహ్మణ్యం శారీరం, శరీరం, ఆత్మ అన్నీ కోదండపాణే. 1962లో గూడూరు కాళిదాస కళానికేతన్ పాటల పోటీల్లో పాల్గొన్నప్పుడు శ్రీమతి జానకి గారు - నేను సినిమాకు పాడడానికి పనికొస్తానని మొదటి నమ్మకం బీజాన్ని నాటారు. అంతవరకు నేను సరదాగా పాడడమే గాని భవిష్యత్తులో గానం బోనం పెడుతుందనుకోలేదు. ఆవిడ ఆశయం మేరకు మద్రాసులో చదువుతూనే సినిమాలో అవకాశం కోసం దాదాపు రెండేళ్లు పాటల పాట్లు పడ్డాను. సర్వశ్రీ మాస్టర్ వేణు, చలపతిరావ్, రాజేశ్వరరావు గార్ల దగ్గర ఆశీస్సులు పొందినా అవకాశం రాలేదు - 64లో మద్రాస్ సోషల్ అండ్ కల్చర్ క్లబ్‌లో (ఆంధ్రా క్లబ్) జరిగిన పోటీల్లో పాడుతున్నప్పుడు విన్న కోదండపాణిగారు బహుమతి ప్రకటించకముందే నా దగ్గరికొచ్చి ఆడిన మొదటిమాట 'ఏవయ్యా సినిమాల్లో పాడతావా' - అని. ఆయనెవరో నాకు తెలీదు - అల్లరి చేస్తున్నారనుకుని "పాడను గాక పాడను" అన్నా. "హన్నా అదేమి?" అన్నారాయన. నా విఫలప్రయత్నాలూ, నా మీద నాకు లేని నమ్మకాలూ ఆయనకు చెప్పా. "సక్రమంగా సాధన చేసి ప్రయత్నిస్తే కనీసం 40 ఏళ్లు ఏలుతావు సినిమాని" అన్నారు. ఆయన దీర్ఘదృష్టికి, ఆయనకున్న నమ్మకానికీ బాలు ఆనాడే ఆయన బానిసయ్యాడు. పక్క రోజు ఎస్.భావనారాయణగారి ఆఫీసులో నాకు గాత్ర పరీక్ష, 'దోస్తీ'లోని 'జానేవాలో జరా', రఫీగారి పాటను స్వకపోలకల్పితాలతో (అప్పట్నించీ అధిక ప్రసంగం అలవాటే) పాడేను. అందరూ బ్రహ్మాండం అన్నారు. 'బచ్చా' బాలు 'బడా' బాలు ఐతే గాత్రం బరువవుతుంది. (అప్పటి బాలుది 'గాత్రం' బరువు 60 కిలోలే) అప్పుడు చూద్దాం - అన్నారు. కోదండపాణి గారు నొచ్చుకున్నారు. - మైక్‌లో పాడగా వింటే బావుంటుందని వాపోయారు. 'వా వా' అన్న వారంతా 'అప్పరం వావా' అన్నారు. 'కష్టపడి పాఠాలు చదువుకోమని కష్టపడి నాన్న పంపితే పాటలు పాడ్తానంటావా వెధవాయ్' అని నన్ను నేను తిట్టుకుని సినిమా వాళ్లున్న వీధిక్కూడా వెళ్లడం మానేసి బుద్ధిగా బుర్రను డ్రాయింగ్ బోర్డు, టీ స్క్వేర్‌లు, కాలుక్లస్‌లకప్పగించాను. కోదండపాణి గారికి ఎడ్రస్ కూడా ఇవ్వలేదు. 'నీ రాత మరోలా ఉంటే డ్రాయింగు గీతలెందుకురా'న్నట్టు కోదండపాణి పట్టు వదలకుండా ప్రయత్నించి నన్ను మరీ పట్టుకున్నారు. 1966 తర్వాత మీకు తెలిసిన కథే... శ్రీ పద్మనాభం గారు, శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న, ఏమి ఈ వింత మోహం, శోభన్‌బాబు, సుశీల, రఘురామయ్య, పి.బి.ఎస్‌ల కలయికలో పాటల ప్రయాణానికి నాంది-

ఎంతటి గాడ్‌ఫాదరైనా అవకాశం ఇచ్చి, 'పిల్లి మెళ్లో గంటకట్టా, మ్రోగిస్తూ మియావ్ అనుకోమని వదిలేస్తారు - కోదండపాణి కోరిక అదికాదు - నాతో గాత్ర కసరత్తులు చేయించాలి, కళలు పలికించాలి, కలలు పండించాలి. సినిమా పాటల రేసులో తన గుర్రం ఎప్పుడు ముందే వుండాలి అని. మహానుభావులు, మహాగాయకులు, మకుటంలేని మారాజుల్లా ఉన్న ఆ రోజుల్లో ఈ కూనకూతలు వినేదెవరు?

ఆయన తన సంగీత దర్శకత్వపు అవకాశాలకు ఎన్ని గడపలెక్కిదిగారో తెలీయదు కానీ, నా చేత మాత్రం ప్రతి సంగీత దర్శకుడి ఇంటి ముంగిట పాటల పందిళ్లు వేయించారు. విజయా గార్డెన్స్ స్వామినాథన్ గార్ని నా మొదటి పాట 'ఎరేస్' చేయకుండా, ప్రతి సంగీత దర్శకుడికీ వినిపించమనే వారు. - ఎండలో సైకిల్ మీద వెళ్తుంటే కాళ్లు విరగ్గొడతానన్నారు. టిప్ టాప్‌గా ఉండాలని తనతోపాటు కొత్తబట్టలు కుట్టించారు. తన దగ్గర సింగింగ్ అసిస్టెంట్‌గా ఉంచుకుని డబ్బులిప్పించారు. అడపాదడపా జేబులో నోట్లు నాకు తెలియకుండా ఉంచారు - 'నా వోడి కెదురు లేదు 40 ఏళ్లు కనీసం ఇండస్ట్రీని ఏలుతా'డని నిస్సంకోచంగా వాదించారు-ఘంటసాల దివంగతులైనప్పుడు జనంలో ఎక్కడో ఉన్న నన్నులాక్కొచ్చి, పెద్దాయన వారసుడు తను, అయన పార్థివ శరీరానికి భుజం మోపాలని పోట్లాడారు. పవిత్రమైన ఆ అవకాశాన్ని కల్పించారు.

ఇంకా చెప్పలేనివీ, రాయలేనివీ ఎన్నెన్నో.. పరమ నాస్తికుడైన కోదండపాణి ఆస్పత్రిలో నిర్యాణానికి ముందు రామకోటి రాయడం చూసి పొంగి పోయాను. ఇంటికొచ్చిన మూడు రోజుల్లో తిరగబెట్టిన జబ్బుతో మళ్లీ హాస్పిటల్‌కు తీస్కెళ్తూ కుంగిపోయాను. ఆయన అడిగినప్పుడు నా కాల్‌షీట్ లేదంటే పొంగిపోయి నవ్వే వారు. "నువ్వెప్పుడిస్తావో చెప్పు కాల్‌షీట్, అప్పుడే రికార్డ్ చేస్తాన"నేవారు.

ప్రతి అవార్డ్‌నూ అందుకుంటూ, ప్రతి బిరుదునూ, సన్మానాన్ని భరిస్తూ మొహం మీద 'నా' అంత నవ్వు పులుముకునే నా గుండెల్లో మాత్రం, ఇవన్నీ ప్రసాదించిన దేవుడేడీ, ఇన్ని వరాలనిచ్చి, నా సంతోషాన్ని, నా విజయాన్ని పంచుకునేందుకు మొహమాట పడి అంతర్థానమయ్యాడా? లేక నేను తెలియక చేసిన ఏదైనా తప్పకు నాకిలా శాపమిచ్చాడా?

అర్థం కాని, బదులు లేని ప్రశ్నలు..

ఇన్ని సుస్వరాలు పాడిన గళం ఈ ఒక్క అపశృతితో అప్పుడప్పుడు అయ తప్పే నా గుండెకు స్వాంతనము చెబుతుంది.

అందుకే కోదండపాణి ఆడియో ల్యాబ్ నా దేవుడి గుడి-

నా కుటుంబంలోని ప్రతి వ్యక్తి కణకణం, అణువణువూ కోదండ పాణికి ఋణగ్రస్తులే - మరో జన్మంటూ ఉండి మళ్లీ ఇద్దరమూ గురు శిష్యులైతే తప్ప ఆయన ఋణం నేను తీర్చుకోలేను.

**- బాలు**



# ట్రావెల్ స్పెషల్






"ఈ మధ్య నువ్వు లండన్ వెళ్ళావట కదా.... వచ్చీరాని నీ ఇంగ్లీషు వల్ల అక్కడి వాళ్ళతో నీకు యిబ్బంది కలిగిందా?"

"నాకేమీ యిబ్బంది ఉంటుంది? మహాఅయితే వినేవాడికి ఉంటే ఉండొచ్చు."



"మీరు రోజూ ఇదే ట్రెయిన్‌లో ప్రయాణం చేస్తుంటారా అంకుల్...!?" అడిగిందో పాప టికెట్ కలెక్టర్ని.

"పన్నెండేళ్ళ నుంచి ఇదే కదమ్మా నా డ్యూటీ"

"పన్నెండేళ్ళ నుంచీనా? ఇంతకీ మీరు ఎక్కడికి వెళుతున్నారు అంకుల్!?"



"ఏంటి... అందరూ చెవుల్లోంచి ఏదో బయటకు తీస్తున్నారు?" అని ఒక వ్యక్తి మరోవ్యక్తిని ప్రశ్నించాడు విమానాశ్రయంలో.

"అబ్బే... ఏం లేదులే... విమానం కిందికి దిగేటప్పుడు చెవుల మీద వత్తిడిని తగ్గించేందుకు బబుల్‌గమ్ తీసుకోమంటే అందరూ దాన్ని చెవుల్లో పెట్టుకున్నారట...'



నగరం నుంచి మరో పట్టణానికి కార్లో బయలుదేరింది ఓ జంట. ఓ పల్లెటూరి ప్రాంతంలో దారి తప్పిపోయామన్న అనుమానంతో...

"బాబూ మళ్ళీ రోడ్డు మీదకు చేరాలంటే ఏ త్రోవన వెళ్ళాలి?" అని పల్లెటూరి బైతుని ప్రశ్నించారు.

అతగాడు బుర్రగోక్కుంటూ...."ఈ దారినవెడితే బహుశా చేరరేమో..." అన్నాడు.

"వీడిని అడిగి లాభం లేదండీ.... వట్టి వెర్రిబాగులోడిలా వున్నాడు" అన్నది భార్య.

"ఏంటమ్మో.... మాటలు సరిగ్గా రానివ్వండి... నేను వెర్రోడినా? దారి తప్పింది నేనొక్కడినే కాదమ్మా... మీ యిద్దరూ కూడా.... ఆ సంగతి గుర్తుంచుకోండి" అనుకుంటూ వెళ్ళిపోయాడు పల్లెటూరోడు.



మొట్టమొదటి సారిగా లాంచీ మీద గోదావరి నదిలో ప్రయాణం చేస్తున్నాడు ఓ వ్యక్తి.

"బాబూ.... బాబూ.... నాకు చాలా భయం వేస్తోంది. లాంచీలో ప్రయాణం చేయడం యిదే మొదటిసారి. నాకుతెలియక అడుగుతా. ఇంత పెద్ద లాంచీలు కూడా తరచుగా మునిగిపోతూ వుంటాయా?"

"ఎప్పుడూ మునగవు సార్... ఏమీ తెలియనివాళ్ళు ఎక్కినప్పుడే మునిగిపోతూ వుంటాయి....".



సిటీబస్‌లో జనాలు తోసుకుంటూ ఎక్కుతున్నారు. లోపల విపరీతమైన రద్దీగా వుంది. "నా గుండెల మీంచి మీ మోచెయ్యి కొంచెం తీస్తారా?" తోటి ప్రయాణికుడిని అడిగేడు మరో ప్రయాణికుడు.

"ఓ తప్పకుండా... నా నోట్లో వున్న మీ సిగరెట్ తీసేసుకోండి మరి".



తను పంపించమని అడిగిన కారు సరైన సమయానికి రాలేదని ఫిర్యాదు చేయటానికి ట్రావెల్ ఏజెన్సీకి ఫోన్ చేస్తున్నాడు గోపాలం.

"నేను ముందే చెప్పాను కదా... ఐదు గంటలకల్లా నేను రైల్వే స్టేషనులో ఉండాలని, లేకపోతే చాలా ప్రాబ్లెమ్స్" కోపంగా అన్నాడు గోపాలం.

"వెంటనే కారు పంపిస్తున్నాం సార్... అయినా ఏం గాభరాపడకండి.... నేను పుట్టి బుద్దెరిగిన దగ్గర్నించి చూస్తున్నాను ఆ ఎక్స్‌ప్రెస్ ఇప్పటి దాకా ఒక్కరోజు కూడా సరైన సమయానికి బయల్దేరి చావలేదు. అరగంట లేటయినా పర్లేద్సార్" అంటూ చెప్పబోయాడు ట్రావెల్ ఏజెన్సీ అతను.

"చాలు.... చాలు యిక ఆపవయ్యా.... నేనే ఆ రైలు డ్రైవర్ని" అన్నాడు డ్రైవర్ గోపాలం కోపంగా.



# ట్రావెల్ స్పెషల్





మొదటిసారిగా విమాన ప్రయాణం చేస్తున్న వ్యక్తి "భగవంతుడా... నన్ను క్షేమంగా కిందికి చేర్చావంటే నా దగ్గర వున్న డబ్బులో సగం నీకు యిచ్చు కుంటాను...." అంటూ దేవుణ్ణి ప్రార్థించాడు గట్టిగా...

వెనక సీట్లో కూర్చుని అవన్నీ విన్న మతబోధకుడు విమానం కిందకు దిగగానే "నీ మొర ఆలకించానయ్యా... నేను దేవుడి మనిషినే.

నీ వద్ద వున్న ధనంలో సగభాగం నువ్వు చెప్పిన ప్రకారం యిచ్చావంటే నేను ప్రార్థనా మందిరం కట్టిస్తాను..." అని చెప్పాడు ప్రయాణికుడితో

"అరెరే.... విమానం కిందకి దిగగానే నేను దేవుడిని మళ్ళీ ప్రార్థించి ఈసారి యింకా ఘనంగా మొక్కుకున్నానండీ.... ఇలానే ఎప్పుడైనా నన్ను మళ్ళీ విమానంలో కలుసుకోవట మంటూ జరిగితే మొత్తం నా ఆస్తి అంతా రాసి యిచ్చేస్తానని...." అంటూ బదులు చెప్పాడా ప్రయాణికుడు.



"హైదరా బాద్ అంటే నాకు చాలా యిష్టం...." చెబుతున్నాడు పుట్టి బుద్దెరిగేక ఒకసారి కూడా హైద్రాబాద్ మొహమే చూడని ఓ పెద్ద మనిషి.

"సాలార్‌జంగ్ మ్యూజియం, బిర్లా టెంపుల్, పబ్లిక్ గార్డెన్స్... ఇంకా యిలాంటివి ఎన్నో హైదరాబాద్‌లో వున్నాయి...." చెప్పుకు పోతున్నాడు.

"మరి చార్మినార్ "ఏందుకు లేదు"

"ఎక్కడ పడితే అక్కడే దొరుకుతుంది. పైగా నేను కాల్చాను కూడా...." ఇంకా గొప్పగా చెప్పాడు ఆ మహానుభావుడు.



"మీలో దైవ ప్రార్థన ఎలా చేయాలో తెలిసిన వాళ్ళు ఉన్నారా?" అడిగేడు పైలట్.

"నేను భక్తుణ్ణి... నాకు తెల్సు..." అన్నాడు ఓ ప్రయాణికుడు.

"అయితే తమరు హాయిగా కళ్ళు మూసు కుని ప్రార్థన చేసుకోండి. పారాచ్యూట్స్‌లో ఒకటి తక్కువయింది" అన్నాడు పైలట్.



"అదేంటి బాబూ... 'అనకాపల్లికి దారి' అని వున్న బోర్డుని అలా మోసుకుని పోతున్నావ్?" ఆశ్చర్యంగా అడిగేడు ఓ వ్యక్తి.

"లేకుంటే నాకు దారి ఎట్టా తెలుస్తుంది సార్..." ఎదురు ప్రశ్నవేశాడు ఆ వ్యక్తి.



"ఏంటయ్యా కండక్టర్ యింత లేట్‌గా చేరిందిక్క డికి? మీ డ్రైవర్ ఇంతకు ముందు రోడ్ రోలర్ నడిపే వాడా ఏంటి?" అని బస్సు దిగుతూ వెటకారంగా అడిగింది ఓ లావుపాటి స్త్రీ.

"నువ్వు దిగిపోతున్నావుగా ఇంక స్పీడ్ అందుకుంటుంది లేమ్మా...." వేళాకోళంగానే బదులిచ్చాడు కండక్టర్.



"విజయ వాడ నుంచి విశాఖ వెళ్ళటానికి ఎంత టైమ్ పడు తుందండీ...." ఫోన్లో అడిగింది ఒకావిడ.

"ఒక్క నిమిషమమ్మా..." అన్నాడు ఎంక్వయిరీ క్లర్క్ చార్టు చూసి చెబుదామని"

"థాంక్సండీ...." అని ఫోను పెట్టేసింది ఆవిడ.




## నువ్వు లేక నేను లేను



'నువ్వులేక నేను లేను'లో తనకు నచ్చిన పాట గురించి గేయ రచయిత సుద్దాల అశోక్‌తేజ అందంగా తన భావాన్ని ఇలా ఆవిష్కరించారు. 'నువ్వంటే నాకిష్టం' పాటలో 'నువ్వంటే నా కిష్టం - నాకన్నా నువ్విష్టం' అనే లైను చాలా బాగా నచ్చింది. ఈ ప్రపంచంలో ప్రతి మనిషికీ అత్యంత ఇష్టమైన పదం తన పేరే, అలాగే అత్యంత ఇష్టమైన ఫేస్ కూడా తనదే. ఆ కోణంలో 'నేనంటే నా కిష్టం' అని పాటలో అన్నారు. అది చాలా వాస్తవమైన విషయం. ఆ తర్వాత 'నా కన్నా నువ్విష్టం' అని అనడం చాలా డెప్త్‌తో వుంది. అందుకే ఈ పాట తెగ నచ్చేసింది".

## నీ ప్రేమకై



ముప్పలనేని శివ దర్శకత్వంలో డా. డి.రామానాయుడు నిర్మించిన 'నీ ప్రేమకై' చిత్రం ఇటీవలే విడుదలైంది. ఈ చిత్రంలోని మూడు పాటలు తనని బాగా ఆకట్టుకున్నాయని యువ సంగీత దర్శకుడు చక్రి పేర్కొన్నారు.

"భాస్కరభట్ల రవికుమార్ రచించిన 'ఓ ప్రేమా స్వాగతం నీతోనే జీవితం' పాట అన్ని కోణాల్లోనూ బాగుంది. ట్యూన్ పరంగా, ఎక్స్‌ప్రెషన్ పరంగా, లిరిక్ పరంగా స్పెషల్‌గా అనిపించింది. భువనచంద్ర రాసిన 'మందాకినీ... మందాకినీ' పాట లిరిక్ స్మూత్‌గా వుంది. మాస్‌కి కూడా నచ్చేట్టుగా వుంది. ఈజీ ట్యూన్. ఒక్కసారి వినగానే అర్థమవుతుంది. అలాగే శ్రీలేఖ, సంజయ్‌ల పాడిన 'కలలు కన్నా నీకై' పాట కూడా బాగుంది" అని వివరించారు చక్రి.

## లాహిరి లాహిరి లాహిరిలో



కీరవాణి సంగీతంలో స్వచ్ఛమైన తెలుగుదనం, చిలిపితనం, గడుసుదనం సమ్మిళితమై ప్రవహిస్తూ వుంటుంది. 'లాహిరి లాహిరి లాహిరిలో' ఆడియోతో మరోసారి 'దటీజ్ కీరవాణి' అనిపించుకుంటున్నారు. ఈ చిత్రంలో మీకు నచ్చిన పాట ఏదని అడిగితే ఆయన అందంగా చిరుకోపగించారు. నాకు అన్నీ నచ్చితేనే కదా చేసేది అని ఎదురు ప్రశ్నించారు. "దర్శకుడు వైవిఎస్ చౌదరికి మంచి మ్యూజిక్ టేస్ట్ వుంది. ఇందులో పాటలన్నీ బాగున్నాయి' అని చెప్పారు. నచ్చిన పాట గురించి మళ్ళీ పట్టుబడితే చాలాసేపు ఆలోచించి ఇలా చెప్పారు. "ఓహోహో చిలకమ్మా" పాట పర్సనల్‌గా నాకు బాగా నచ్చింది. పాత పాటల పరిమళం ఈ పాటలో వుంది. రకరకాల పాత పాటల్ని గుర్తు చేస్తుంది పాట. నాకు పాత పాటలంటే బాగా ఇష్టం. ఆ మూడ్‌తో చేసాని పాట. శాస్త్రి గారి సాహిత్యం కూడా బాగా కుదిరింది. రేపు సినిమా విడుదలయ్యాక ఈ పాటలన్నీ ఇంకా నచ్చుతాయి".

## నీ తోడు కావాలి



భీమనేని స్వీయ దర్శకత్వంలో తనే నిర్మాతగా మారి 'నీ తోడు కావాలి' చిత్రం చేసారు. ఈ చిత్రం ద్వారా నలుగురు కొత్త కుర్రాళ్ళని సంగీత దర్శకులుగా పరిచయం చేస్తున్నారు. ఈ ఆల్బమ్‌లో తన మనసు దోచుకున్న పాట గురించి ఉత్తేజభరితంగా ఇలా వివరించారు. "ఈ సినిమాలో క్లయిమాక్స్ సాంగ్‌గా వచ్చే 'శ్వాసల్లో శ్వాసల్లే' సాంగ్ ట్యూన్ పరంగా గానీ, పిక్చరైజేషన్ పరంగా గానీ ఎక్స్‌ట్రార్డినరీ. సినిమాకే హైలెట్ అనదగ్గ పాట ఇది. సాధారణంగా క్లయిమాక్స్‌లో ఎమోషన్స్‌ని పీక్ స్టేజికి తీసుకు వెళ్ళడానికి యాక్షన్ పార్ట్‌ని ఎక్కువ ఉపయోగిస్తారు. ఇది క్లాస్ సినిమా కాబట్టి స్మూత్‌గా పొయిట్రీలా చెప్పే ఉద్దేశ్యంతో పాటలోనే అన్ని ఎమోషన్స్‌ని పీక్‌కి తీసుకెళ్ళడం జరిగింది. ఖచ్చితంగా ఇది ఒక ప్రయోగం. ఓ మైలు రాయిలా నిలిచి పోయినా ఆశ్చర్యపోనవసరం లేదు. అలాగే దర్శకుడిగా చెప్పడానికి మంచి స్కోప్ లభించింది ఈ పాటలో" అని తెలిపారు భీమనేని.

## ఓ చినదాన



'ఓ చినదాన'లో శ్రీకాంత్‌తోపాటు హీరోగా నటించిన కొత్త కుర్రాడు రాజా ఆంధ్రుడే గానీ ముంబైలో స్థిరపడిపోయాడు. కథా నాయికల అన్వేషణ నిమిత్తమై ముంబై వెళ్ళిన దర్శకుడు సత్తిబాబుకి రాజా తారసపడి అనుకోకుండా హీరో అయిపోయాడు. ఈ చిత్రంలో రాజాకు నచ్చిన పాటలు ఏంటో తెలుసుకుందాం. "టైటిల్‌సాంగ్, ధిందింతార పాటలు చాలా బాగా నచ్చాయి. ముఖ్యంగా టైటిల్ సాంగ్‌లో చక్కటి రిథమ్ వుంది. ఇప్పటి ట్రెండ్‌లో యూత్‌కి ఏమేం కావాలో అన్నీ ఈ పాటలో వున్నాయి. వినగానే అందరికీ నచ్చే పాట ఇది. ట్యూన్‌కి తగ్గట్టుగా సాహిత్యం, అలాగే చిత్రీకరణ బాగా కుదిరింది" అని చెప్పారు రాజా.

## నీతో చెప్పాలని



నటుడుగానే కాకుండా, గాయకుడుగా కూడా మంచి పేరు తెచ్చుకుంటున్నారు రఘుకుంచె. 'నీతో చెప్పాలని' చిత్రంలో రఘు పాడిన పాట 'ఛమక్కురో ఛమక్కురో' బాగా ఆకట్టుకుంది. "గాయకుడిగా నాకిది 45వ పాట. సంగీత దర్శకులు కోటిగారు 'డార్లింగ్ డార్లింగ్' సినిమాలో శ్రీకాంత్ ఇంట్రడక్షన్ సాంగ్ కోసం నన్ను పిలిపించారు. ఆ ఫాస్ట్ బీట్ నేను బాగా పాడటం చూసి ఇమ్మీడియట్‌గా కోటిగారు 'నీతో చెప్పాలని'లో ఈ ఫాస్ట్ బీట్ పాడే అవకాశమిచ్చారు. కోటిగారు రెగ్యులర్‌గా తన సినిమాల్లో పాడిస్తూ బాగా ప్రోత్సహిస్తున్నారు. ఈ మధ్యకాలంలో ఈ పాటకి ఘంచి ప్రమోషన్ లభించింది. నా ఫ్రెండ్సందరూ ఫోన్ చేసి మరీ మెచ్చుకున్నారు" అని చెప్పారు రఘుకుంచె.

## మౌనమేల నోయి



'మౌనమేల నోయి' చిత్రం ద్వారా దర్శకునిగా పరిచయమవుతున్నారు శ్యామ్. ఈ చిత్రం తనకొక అద్భుతమైన అనుభవమని అంటున్నారు. 'ఈ చిత్రంలో మీకు నచ్చిన పాట గురించి చెప్పండి' అని అడిగితే "దర్శకుడిని కాబట్టి నాకు అన్నీ నచ్చుతాయి. నచ్చితేనే కదా సినిమాలో పెట్టేది. ముఖ్యంగా చెప్పాలంటే మాత్రం 'ఓ మధుబాల' పాటలో లవ్లీఫీలింగ్ వుంది. పాట వింటుంటే మనసుకి మంచి మూడ్‌ని క్రియేట్ చేస్తుంది. పిక్చరైజేషన్ పరంగా కూడా ఎక్సలెంట్‌గా వచ్చింది. నాకు, సంగీత దర్శకుడు రమణ గోగుల ఇద్దరికీ వేటూరి గారంటే ప్రాణం. అందుకే ఈ సినిమాలో అన్ని పాటలు ఆయనతోనే రాయించుకున్నాం. వేటూరి గారి సాహిత్యం గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిందేమి వుంటుంది" అని వివరించారు శ్యామ్.

## అమృత



మణిరత్నం సినిమా అంటేనే అందరికీ ఓ స్పెషల్ క్రేజ్. జయాపజయాలతో సంబంధం లేకుండా మణిరత్నం టేకింగ్‌ని ఆస్వాదించాలని రసజ్ఞుడైన ప్రతి ప్రేక్షకుడు ఆకాంక్షిస్తాడు. 'అమృత' సినిమాలో నచ్చిన పాట గురించి యంగ్ హీరో రవితేజను అడిగితే "సినిమా అంతా ఒక ఎత్తయితే, 'జంట తోకల సుందరి' పాట మరొక ఎత్తు, సినిమాకన్నా నాకు పాటే ఎక్కువ నచ్చింది. ఏం టేకింగ్, ఏం ఫొటోగ్రఫీ! 'అమృత' పాప పాత్రని ఈ పాటలో బాగా ఆవిష్కరించారు మణిరత్నం" అని తన అభిప్రాయం చెప్పారు

## సవ్వడి



తొలి తెలుగు డిజిటల్ ఫిలిం 'సవ్వడి'లో సంగీత దర్శకుడిగా పరిచయమవుతున్న యువకుడు రఘు కౌశిక్‌కు సంగీత పరంగా మంచి నేపథ్యమే వుంది. 1997లో ఏకధాటిగా 36 గంటలు నట్టువాంగం చేసి రికార్డు సృష్టించిన రఘుకౌశిక్ మ్యూజిక్‌లో మాస్టర్స్ చేసారు. ప్రస్తుతం తాను శాస్త్రీయ సంగీతంలో నట్టువాంగం ప్రాధాన్యత గురించి పరిశోధన చేస్తున్నారు. "కజిన్ ద్వారా దర్శకుడు శివ పరిచయమయ్యారు. లిరిక్ యిస్తే ఫుల్ ప్రొఫెషనల్‌గా సాంగ్ చేసి యిస్తే, శివ ఇంప్రెస్ అయ్యి సంగీత దర్శకునిగా నాకు అవకాశమిచ్చారు. ఇందులో మొత్తం ఏడు పాటలున్నాయి" అని తన వివరాలు తెలిపారు. రఘుకౌశిక్ ఈ ఏడింటిలో మీకు నచ్చిన పాట ఏదని అడిగితే - "తెగుతున్న బంధం' పాట మనిషిలోని సున్నితమైన అనుభూతికి నిదర్శనంగా నిలుస్తుంది. ఈ పాట వింటున్నప్పుడు ఇళయరాజా చేసిన పాటలా ఫీలవుతుంటాను. ఇళయ రాజాగారిని మనసులో పెట్టుకునే ఈ పాట చేసాను" అని చెప్పారు.

## నీలాంబరి



బాలు 'పాడుతా తీయగా' ప్రోగ్రాం ద్వారా వెలుగులో కొచ్చిన గాయని ఉష తక్కువ సమయంలోనే మంచి పేరు తెచ్చుకుంది. ఓ పక్క హైదరాబాద్ షాదన్ కాలేజీలో ఎంసిఎ చదువుతూనే, మరో పక్క గాయనిగా అనేక సినిమాల్లో పాడుతుంది. ఇటీవల విడుదలైన 'నీలాంబరి' సినిమాలో ఉష ఒక పాట పాడింది. ఈ సినిమాలో తనకు నచ్చిన పాట గురించి తను పాడిన పాటనే ప్రస్తావించింది. మీరు పాడారని నచ్చిందంటున్నారా అని సరదాగా అడిగితే - "అదేం కాదు. ట్యూన్ చాలా బాగుంది. సాహిత్యం కూడా బాగుంది. ట్యూన్‌కి తగిన సాహిత్యం జత కుదిరింది. 'మల్లియల మనసింక పలికించరా' అంటూ సాగే ఈ పాట మళ్ళీమళ్ళీ వినాలనిపిస్తుంది. అందుకనే నాకు బాగా నచ్చిందని చెబుతున్నాను" అని చెప్పింది ఉష.

హాస్యావధానిగా పేరుగాంచిన శ్రీ శంకరనారాయణ 'హాసం' కోరిక మేరకు ప్రత్యేకంగా రాసిన వ్యాసమిది.

# అందరి ఆరోగ్యం - హాస్యావధాన సౌభాగ్యం



'హాస్య ప్రపంచం హాస్య ప్రపంచం
హాస్య ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు
నవ్వుల విందుకు
పోదాం పోదాం పైపైకి
బి.పి. సుగర్ కొలెస్టరాల్‌లు
నవ్వుల ముందొక అడ్డంకా?'

అంటూ నరసులయిన తెలుగు ప్రజల్ని హాస్యావధానంలోకి ఆహ్వానిస్తున్నాను. 'బి.పి. లేనివాడు బిర్లా, షుగర్ లేని వాడు టాటా' అనే నినాదమిస్తున్నాను. 'నవ్వవు జంతువుల్ నరుడు నవ్వును' అన్నాడు మహాకవి గుర్రం జాషువా. మనిషికి జంతువుకు తేడా నవ్వడమేనట. నవ్వు మనిషికన్నా ముందుపుట్టిందన్నది నా వాదన. డార్విన్ సిద్ధాంతం నరుడు వానరుడినుంచి పుట్టాడని చెబుతున్నది. కోతి హాస్యానికి మూలవిరాట్టు. కిచకిచలు వింటే నవ్వు రాకుంటే వారిలో డిఫెక్టు ఉన్నట్టే. ఆంజనేయస్వామి హను'మ్యాన్'. ఆ వారసత్వాన్ని మనిషి మరిచిపోయి మూతి బిగించుకుంటుంటే కోతి నవ్వుకుంటున్నది. రామాయణంలో సుందరకాండ అందరికీ తెలుసు. అక్కడ సుందరుడు హనుమంతుడు. హనుమాన్ సుందరః అంటారు. నవ్వితే అందం పెరుగుతుంది. ఆరోగ్యం పెరుగుతుంది. 'నవ్ ఏ డేస్' అన్నీ నవ్వే డేస్ కావాలి. శైశవం నుంచి శవంగా మారేవరకు నవ్వుతుండే వాడు గొప్పవాడు. నవ్వడంలో వేదాంతం ఉంది మంచి మనస్సులేనివాడు నవ్వలేడు, నవ్వించలేడు. 'నవ్వడం ఒక భోగం, నవ్వించడం ఒక యోగం, నవ్వలేకపోవడం ఒక రోగం' అన్నాడు జంధ్యాల. నవ్వలేక మనిషి బిగుసుకు పోయాడంటే అతగాడికి తక్షణం ఆసుపత్రిలోనో 'హాస'పత్రి(క)లోనో ట్రీట్‌మెంట్ ఇప్పించడం మంచిది.

'హాసం' జీవితంలో ముఖ్యభాగం, 'ముఖ'భాగం.

'హాసం' దేవుడు మనిషికి ఇచ్చిన 'రాజా'లాంటి 'ప్రసాద'ం. తెలుగువాడు ఆవకాయను, అవధానాలను విడిచిపెట్టి ఉండలేడు. అవధానాలనగానే అష్టావధానాలు, శతావధానాలు, సహస్రావధానాలు గుర్తుకువస్తాయి. అవధానాల్లో అప్రస్తుత ప్రసంగాల రూపంలో హాస్యం వెల్లివిరుస్తుంటుంది. స్వతహాగా అష్టావధానిని అయిన నేను, 1974 నుంచి కొన్ని సంవత్సరాలపాటు అష్టావధానాలు చేసి ఆ తర్వాత వదిలివేశాను. దాదాపురెండు దశాబ్దాల విరామంతర్వాత అవధానాల్లో అప్రస్తుత ప్రసంగిపాత్ర ధరించడం మొదలుపెట్టాను. మాడుగుల నాగఫణిశర్మ ద్విశతావధానం, మహా సహస్రావధానం, బృహత్ ద్విసహస్రావధానాల్లో అప్రస్తుత ప్రసంగిగా నాకు పేరు వచ్చింది. మహా సహస్రావధానం, ద్విసహస్రావధానాల్లో నేను అప్రస్తుత ప్రసంగం చేసిన రోజులన్నీ... నాకు మధురానుభూతులమయం...! నాగఫణిశర్మగారు ఎన్ని రోజులు అవధానం చేస్తే, అన్నిరోజులూ నేనూ అప్రస్తుత ప్రసంగం చేశాను. సాయంత్రంపూట నేను పనిచేసే ఆంధ్రప్రభ ఆఫీసులో అనుమతి తీసుకుని 5గంటలకు అవధానం జరిగే తెలుగు లలితకళా తోరణానికి వచ్చేవాణ్ణి. నేను ప్రాంగణంలోకి అడుగుపెట్టి వేదిక మీదకు వచ్చి కూర్చునేవరకు చప్పట్లవర్షం కురిసేది. మహాసహస్రావధానం జరిగిన 24 రోజులు, ద్విసహస్రావధానం జరిగిన 37 రోజులూ ఇది జరిగింది. ఇది నేను నా జీవితంలో మరిచిపోలేని అనుభూతి.

నాగఫణిశర్మగారి అవధానాల్లో ప్రముఖ సినీ కమెడియన్లయిన బ్రహ్మానందం, తనికెళ్ళభరణి, బాబూమోహన్, గొల్లపూడి మారుతీరావు, ఎ.వి.ఎస్., వంటి వారి సరసన అప్రస్తుత ప్రసంగం చేసే భాగ్యం నాకు కలిగింది. వన్ 'ఫైన్' మార్నింగ్ 'శంకరనారాయణ మైకును మారణాయుధం చేస్తున్నాడు' అన్నాడు తనికెళ్ళ భరణి. ఇంకో ఫైన్ ఈవినింగ్ బ్రహ్మానందం గారు "శంకరనారాయణ' మీరు మా 'కిష్కింధ' (ఫిల్మ్‌నగర్) లో హాస్యావధానం చేయాలి" అన్నారు. .నేను 'ఓ.కె.' అన్నాను. హాస్యావధానం అంటే బ్రహ్మానందం ఉద్దేశం ఏమిటోనాకు తెలియదు. ఇది 1997 డిసెంబర్ మొదటివారంలో జరిగింది. అదే సంవత్సరం డిసెంబర్ 30వ తేదీన తనికెళ్ళ భరణిగారు నాగఫణిశర్మగారి అవధానంలో కలిసి 'శంకరనారాయణగారూ రేపు సాయంత్రం 6 గంటలకు మీరు ఫిల్మ్‌నగర్‌లో హాస్యావధానం చేయాలి' అన్నారు నేను మళ్ళీ 'ఓ.కె.' అన్నాను". హాస్యావధానమంటే ఏమిటో నాకు తెలియదు. నేను ఏం చేయాలో నాకు తెలియదు అయినా ఒప్పుకున్నాను- ఇందుకు కారణం - 'పోవడానికి ప్రి'స్టేజీ' లేదు ఏదో ఓరకంగా స్టేజీమాత్రం వస్తుంది' అనుకున్నాను. అనుకున్న టైమ్‌కు నన్ను ఫిల్మ్‌నగర్ తీసుకువెళ్ళారు.

సుప్రసిద్ధ సినీదర్శకులు ఇ.వి.వి. సత్యనారాయణగారి ఆధ్వర్యంలో ఆ కార్యక్రమం జరిగింది. నవ్వులకు వెండి'తెరతీస్తున్న' హాస్యరసపండితులు తనికెళ్ళ భరణి, ఎ.వి.యస్., బాబూమోహన్, చలపతిరావు, మల్లికార్జునరావు, శివాజీరాజా, ఉత్తేజ్ , సినీరచయితలు పరుచూరి బ్రదర్స్ పృచ్ఛకులుగా వ్యవహరించారు... 'ఏ' క్లాస్ 'టైపు' ప్రశ్నలకు అదే స్పీడులో 'ఏ' క్లాసు జవాబులు 'కంప్యూటర్' లెవెల్లో ఇచ్చాను. తలపండిన సినిమా నిర్మాత, ఫిల్మ్‌డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఛైర్మన్ డి.వి.ఎస్. రాజు నన్ను సత్కరించారు. చిత్రమేమిటంటే ప్రేక్షకులంతా చిత్రసీమవారే కావడం. ఈ కార్యక్రమం ఆసాంతం ఒక వినాయకచవితి రోజున సిటీకేబుల్‌లో ప్రసారమైంది. హాస్యవధానానికి కూడా 'జన్మభూమి' సినిమారంగం కావడం నా మనస్సును పులకరింపజేసింది. ఆ తర్వాత 1999 అక్టోబర్ 24న చెన్నయ్‌లో సుప్రసిద్ధ సినీ హాస్యనటుడు పద్మశ్రీ అల్లురామలింగయ్య గారి అధ్యక్షతన జరిగిన మరో హాస్యావధాన కార్యక్రమంలో వంకాయల సత్యనారాయణ, వేలు, జి. ఆనంద్, మురారి, ఓంకార్ మొదలైనవారు పృచ్ఛకులుగా వ్యవహరించారు.

అలా మొదలైన హాస్యావధాన ప్రస్థానంలో ఇప్పటికి 77 మజిలీలయ్యాయి. 2001వ సంవత్సరం మార్చి 18న హైదరాబాద్‌లోని త్యాగరాయగాన సభలో ప్రపంచరికార్డుకోసం 12గంటల నిర్విరామ హాస్యావధానం చేశాను. రాజకీయాల్లో ఒక పార్టీ అంటే ఇంకో పార్టీకి పడదు.

అటువంటి అన్నిపార్టీలనాయకులను పృచ్ఛకులుగా చేసి రాజకీయ హాస్యానికి పెద్దపీట వేసి 2001 అక్టోబర్ 31వ తేదీన అఖిలపక్ష హాస్యావధానం చేశాను. వెకిలితనం, బూతుతో హాస్యపు ముసుగు వేసుకుంటున్న ఈ రోజుల్లో మహిళలు సైతం ఆనందించడానికి వివిధరంగాలలో రాణిస్తున్న మహిళలను పృచ్ఛకులుగా చేసి విశిష్టమహిళా హాస్యావధానాన్ని నిర్వహించాను. మానసిక బలహీనతలను, ఇంద్రియలోలత్వాన్ని రెచ్చగొడుతూ హాస్యంగా చలామణి చేస్తున్న బాణికి విరుద్ధంగా ఇది సాగింది.

ఇంతకీ హాస్యావధానానికి ఇతర అవధానాలకు తేడా ఏమిటి? అన్న ప్రశ్న సహజంగానే ఉదయిస్తుంది. అవధానమంటే చిత్తైకాగ్రత. ఒక విషయం మీద మనస్సును లగ్నం చేయడం. అష్టావధానాలు 8 అంశాలమీద దృష్టిలగ్నం చేస్తామని, శతావధానులు 100 అంశాలమీద దృష్టిలగ్నం చేస్తామని అంటారు. నిజానికి అది చెల్లదు. ఒకే ఒక్క విషయం మీద దృష్టిలగ్నం చేయాలి. నేను హాస్యంమీద దృష్టిలగ్నం చేస్తాను. సభలో అందరూ హాస్యం మీద దృష్టిలగ్నం చేస్తారు. అదే హాస్యావధానం. మామూలు అవధానాల్లో పృచ్ఛకుల సంఖ్యనుబట్టి అష్టావధానమని, శతావధానమని, సహస్రావధానమని అంటారు. కానీ హాస్యావధానానిది 'అగణిత'వైభవం. ఒక రసంమీద ఆధారపడ్డ అవధానమిది. ఇందులో ప్రేక్షకులంతా పృచ్ఛకులే అవధానమనగానే పద్యాలు గుర్తొస్తాయి. అసలు అవధానం వేదాధ్యయనం చేసేవారికి సంబంధించినది. కవులు అవధానాన్ని కవిత్వంలోకి హైజాక్ చేశారు. పద్యాలు వింటేనే అవధానమనే స్థితికి తెచ్చారు. నిజానికి అవధానానికి పద్యాలకు ఎటువంటి సంబంధమూ లేదు. అయినా కవిత్వం పద్యాల్లోనే ఉంటుందన్న అభిప్రాయం సబబు కాదు. వచనంలోకూడా కవిత్వపు విలువలుంటాయి. గద్యం పద్య కవులకు ఒరిపిడిరాయి వంటిది. అందుకే 'గద్యం కవీనాం నికషంవదన్తి' అన్నారు. పద్యమైనా, గద్యమైనా, వచనమైనా అందులో రసం ప్రధానం. 'వాక్యం రసాత్మకం కావ్యం' అనీ, రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం' అన్నారు తప్ప పద్యాలే కవిత్వం అని ఎవరూ అనలేదు. అన్నా చెల్లదు.

కావ్యం బ్రహ్మానంద సబ్రహ్మచారి అన్నారు పెద్దలు... హాస్యం అటువంటి బ్రహ్మానందాన్ని కలిగిస్తుంది. అది ఆరోగ్యానికి దివ్యౌషధం. ఆ ఔషధాన్ని అందరికీ అందించడమే హాస్యావధాన లక్ష్యం. అందుకే హాస్యావధానానికి నిబంధనల బంధనాలు పెట్టలేదు. నవ్వేందుకు షరతులేల? అందరి ఆరోగ్యమే హాస్యావధాన సౌభాగ్యం.

**-శంకరనారాయణ**

## శంకరనారాయణ నిర్వహించిన వివిధ హాస్యావధానాల్లోని కొన్ని రసగుళికలు:

**✶ ఢిల్లీ రాజేశ్వరి (సినీనటి)**

ప్ర: బిన్‌లాడెన్ గుండుకొట్టించుకుని తిరుపతిలో తిరుగుతుంటే అతణ్ణి పట్టుకోవడం ఎలా?

జ: ఇందుకు గుండు హనుమంతరావుసాయం తీసుకోవాలి. ఒక గుండును ఇంకో గుండు మాత్రమే తేలిగ్గా గుర్తుపట్టగలదు.

**✶ బాబూమోహన్ (సినీనటుడు)**

ప్ర: స్వర్గలోక రంభ, చిత్రలోక రంభ మీ వెంటపడితే మీరూ వెంటపడతారా?

జ: స్వర్గలోక రంభకోసం చచ్చినా పైకి పోలేను. చిత్రలోక రంభకోసం కిందికి దిగజారలేను.

**✶ అన్నమయ్య పదకోకిల శోభారాజు**

ప్ర: నవ్వితే పొట్ట చెక్కలవుతుంది అంటారుకదా, అది విషాదమవుతుంది కానీ హాస్యమెలా అవుతుంది?

జ: నవ్వలేక చచ్చామంటారుకదా... చావు విషాదమవుతుంది గానీ వినోదమెలా అవుతుందో ఇదీ అలాగే. అయినా నవ్వించి నా పొట్టగొట్టకండి.

**✶ డాక్టర్ నటరాజరామకృష్ణ (సుప్రసిద్ధ నాట్యాచార్యులు)**

ప్ర: సినిమాల్లో ఆడవాళ్ళ దుస్తులు పైకి పోతున్నాయి. మగాళ్ళ దుస్తులు కిందికి పోతున్నాయి.

జ: అందుకే సినిమా డైరెక్టర్లు షూటింగ్‌లో 'కట్ కట్' అంటుంటారు. బట్టలు సరిగ్గా కట్టు, అనేది అందులో ఉద్దేశం.

**✶ ఒక ప్రేక్షకుడు -**

ప్ర: మృదంగ విద్వాంసులు లుంగీలే ఎందుకు కడతారు?

జ: వాయించడానికి తేలిగ్గా ఉంటుందని!

ఆ మాటకు ఎల్లా వెంకటేశ్వరరావు (సుప్రసిద్ధ మృదంగవిద్వాంసులు) లేచి "మరి నేనెప్పుడూ పంచెనే కట్టుకుంటాను" అన్నారు.

జ: మీ విషయం వేరు మీరు 'పంచె' బాణులు 'ఎల్లా' అయినా వాయించగలరు.

**✶ మర్రి రమేష్ (ప్రముఖ మెజీషియన్):**

ప్ర: సరసమయిన ధరలకు వస్తువులు లభించును అని షాపుల్లో రాసి ఉంటుంది. షాపుల్లో సరసమేమిటండీ?

జ: మీరు ఏ షాపుకు వెళ్ళారో ఏమో. ఎందుకైనా మంచిది ఈ మధ్య కొన్ని షాపులకు ఫారిన్ నుంచి ఎయిడ్స్ వస్తోంది. సరుకు చీప్‌గా వస్తుందని తొందరపడకండి.

**✶ సి. ఆనందారామం (ప్రముఖ రచయిత్రి)**

ప్ర: కళల పరమార్థం ఏమిటి?

జ: ఆనంద ఆరామాన్ని చేరుకోవడమె!

**✶ ఒక ప్రేక్షకుడు**

ప్ర: అన్ని రసాల్లోకి ఏ రసం గొప్పది?

జ: నీరసం...! అన్ని రసాలకూ పరాకాష్ట నీరసం. ఎందుకంటే ఏ రసం బాగా అనుభవించినా చివరికి వచ్చేది నీరసమే కదా!

**✶ డాక్టర్ మంగళగిరి ప్రమీలాదేవి (ప్రముఖ రచయిత్రి)**

ప్ర: పెళ్లిలో అమ్మాయి ఏడుస్తూ ఉంటుంది. అబ్బాయి నవ్వుతూ ఉంటాడు ఎందుకు?

జ: అమ్మాయికి అది ఆఖరి ఏడుపు. అబ్బాయికి అది ఆఖరినవ్వు. (ఇది జంధ్యాలగారు పేల్చిన జోకు)

**✶ విజయదుర్గ (టి.వి.ఆర్టిస్టు)**

ప్ర: ఆడవాళ్ళతో షాపింగ్‌కి వెళ్తే మగాళ్ళుపడే బాధలు ఎలా ఉంటాయి?

జ: అవన్నీ 'శారీ'రక బాధలు

**✶ దుర్గాభాస్కర్ (ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రం స్టేషన్ డైరెక్టర్)**

ప్ర: మీ మీద మీ శ్రీమతిగారు జోకువేస్తే?

జ: "అచ్చం నీ మొహంలా ఉందం'టాను. 'అయితే బావులేదా' అని చస్తే అనలేదు. ఈ 'లా-కిక్' జగత్తులో హాయిగా తప్పుకోవటానికి ఇంతకన్నా గొప్పసూత్రం మరొకటి లేదు.

**✶ ఎల్. సుకన్య (సుకన్య ఆర్ట్ థియేటర్స్)**

ప్ర: తెల్లవాడిది రవి అస్తమించని సామ్రాజ్యం. తెలుగువాడిది!?

జ: 'కవి' అస్తమించని సామ్రాజ్యం.

**✶ ఎన్. ఉషారాణి (ప్రముఖ నర్తకీమణి)**

ప్ర: హాస్యరసాన్ని భక్తిరసాన్ని ఏక కాలంలో పండించాలంటే...?

జ: నవ్వుతూ భజనచేయాలి.

**✶ ఆవుల మంజులత (తెలుగు అకాడెమీ డైరెక్టర్)**

ప్ర: మీకు శబ్దాశ్రయ హాస్యం ఇష్టమా?

జ: నేను అంత 'సౌండ్' పార్టీని కానండీ.

**✶ డాక్టర్ బి.నాగలక్ష్మి (ఎస్.ఆర్.సి. అధికారి)**

ప్ర: మీ మీద ఎవరైనా జోకువేస్తే మీకు కోపం వస్తుందా?

జ: వేసిన జోకులో నిజం ఉంటే కోపం వస్తుంది. అబద్ధం ఉంటే ఆనందం ఉంటుంది.

సీరియల్

5

# సద్దాం ఆంటీ ఇంటి కథ

-మల్లాది వెంకట కృష్ణమూర్తి



### జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. వయసుతో సంబంధం లేని కుర్ర మనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పులలోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బ్యాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్‌కి ప్రతిరోజూ కట్ చేసిన ఫోటో భాగాలు వెనక 'ఐ లవ్ యూ' రాసి, పోస్ట్‌లో వస్తుంటాయి. నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని, అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. 'నీకు అక్క చెల్లెళ్ళు ఉన్నారా' అన్న అనన్య ప్రశ్నకు జవాబుగా జాంబవతి గురించి బామ్మ చెప్పడం మొదలు పెడుతుంది. జాంబవతికి పాముల్ని పెంచే అలవాటు ఉండటం వలన ఆమెకు వచ్చిన పెళ్ళిసంబంధాలన్నీ తప్పిపోతూ ఉంటాయి. అలా బామ్మ తరపు బంధువులలో అనన్య తప్ప వేరే వారసులెవరూ లేకపోవటం జరుగుతూ ఉంటుంది. ఈ కథంతా బామ్మ చెబుతుండగా వచ్చిన లింగమయ్య చూడగానే బామ్మ అనారోగ్యం నటిస్తుంది. అనన్య ఎంత అడిగినా వివరాలు చెప్పకుండా దాటవేస్తుందామె.

మురళీధర హరే మోహన కృష్ణా
మురళీధర హరే మోహన కృష్ణా
మొరవినవా రావా కరుణించ రావా
మురళీధర హరే మోహన కృష్ణా...

యధావిధిగా ఆ ఉదయం ఆరున్నరకి ఆ ఇంటి బయట వినిపించే ఆ గొంతు అనన్యదే. మాయాబజార్‌లోని కృష్ణుడి వాల్ పోస్టర్‌కి పూలతో పూజ చేస్తూ అనన్య, భక్తిగా పూజ

**ముగించింది. చూసేవాళ్ళలో కొందరికి ఆ పోస్టర్‌లో ఎన్.టి.ఆర్. కనిపిస్తే, మరి కొందరికి శ్రీకృష్ణుడు కనిపించవచ్చు. కానని అనన్యకి మాత్రం ఎప్పుడూ శ్రీకృష్ణుడే ఆ పోస్టర్‌లో దర్శనమిస్తాడు.**

**కొబ్బరికాయ కొట్టి హారతి ఇచ్చి లేచాక ప్రసాదంతో అనన్య టి.వి. రూంలోకి నడిచింది... బామ్మ రిమోట్‌తో టి.వి. లోని అన్ని ఛానెళ్ళని మార్చి మార్చి చూస్తోంది. వేటిలో ఏం వస్తున్నాయా అని.**

"ఇంద బామ్మా" ప్రసాదం పెడుతూ చెప్పింది అనన్య.

"గుడ్ మార్నింగోయ్. ప్రతీ ఛానెల్ వాళ్ళూ స్వామీజీలు లేదా బాబాలు లేదా మతాధిపతులు చెప్పేదే ఈ టైంలో ప్రసారం చేస్తే పోలా? ఆ ఛానెల్‌కి వ్యూయర్ షిప్ పెరుగుతుంది కదా" చెప్పింది బామ్మ విసుగ్గా.

"వాళ్ళకి లెటర్ రాయి బామ్మ"

"పిచ్చి పిల్లా... మనం ఒక్కరం రాస్తే సరిపోదే. ఆంధ్రదేశంలోని మొత్తం వాళ్ళు రాస్తే కాని వాళ్ళు పట్టించుకోరు. పూజయిందా?"

"అయింది. నీకెలా వుంది బామ్మా ఇవాళ వంట్లో?"

"మామూలే, తింటే ఆయాసం, తినకపోతే నీరసం"

ఆ గది బయట కిటికీముందు ఓ ఆరేళ్ళ కుర్రాడు వచ్చి ఆగాడు.

"బామ్మోయ్" అరిచాడు.

"ఏమిటోయ్ రాజూ?" అడిగింది బామ్మ.

"ఇదిగో అద్దె. మానాన్న ఇవ్వమన్నాడు" కిటికీలోంచి నోట్ల కాగితాలున్న చేతిని లోపలకి చాపాడు.

అనన్య ఆ డబ్బు తీసుకుంది.

"మా అమ్మ మిమ్మల్ని లెక్కపెట్టుకోమంది ఆంటీ" చెప్పాడు రాజు అనన్యకి.

"ఇడియెట్. నన్ను ఆంటీ అనద్దన్లా! ఎన్నిసార్లు చెప్పాలి నీకు? పెళ్ళయిన వాళ్ళనే ఆంటీ అనాలి" కోపంగా అరిచింది అనన్య.

"బామ్మ కనబడక పోతే, ఆంటీకిచ్చిరా అంది మా అమ్మ. మా అమ్మ కూడా ఇడియట్టేనా?" ఎదురు ప్రశ్న వేసాడు రాజు.

అనన్యచేత డబ్బు సరిపోయింది అనిపించుకుని కాని కదల్లేదు రాజు. ఇంటి పక్కనున్న మెట్లెక్కి పై పోర్షన్‌లోకి వెళ్ళాడు.

"డబ్బిచ్చావా?" భర్త షూస్ పాలిష్ చేస్తున్న రాజు తల్లి వాసవి అడిగింది.

"ఇచ్చానమ్మా. సరిపోయిందంది ఆంటీ"

"వెరీగుడ్" చెప్పింది వాసవి.

"రాత్రికి నేను కేంప్‌కి వెళ్ళాలి. బట్టలు సర్దివుంచు. ఆఫీస్‌నించి వచ్చి వెంటనే బస్ డిపోకి వెళ్తాను" చెప్పాడు రాజు తండ్రి రామ్మూర్తి భార్యతో.

చిన్నగా నిట్టూర్చింది వాసవి.

"ఏ వూరికి?" అడిగింది.

"వరంగల్"

"ఎన్ని రోజులు?"

"రెండు రోజులు. అట్నించి ఖమ్మం వెళ్ళి నాలుగైదు రోజుల్లో వస్తాను"

"నెల్లో ఇరవై అయిదు రోజులు మీరు కేంపుల్లో వుండడటం బాలేదండి" చెప్పింది వాసవి.

"ఉద్యోగధర్మం. ఏం చేద్దాం"

ఆమె రాజు వంక చూసి సన్నగా చెప్పింది.

"వీడికి ఆరేళ్ళు రాగానే వాడు విడిగా ఇంకో గదిలో పడుకునే అలవాటు చేయడానికి నాకు తలప్రాణం తోక్కొచ్చింది. కాని ఏం ప్రయోజనం?"

"ఏం చేద్దాం. ఉద్యోగధర్మం అన్నానా?"

"అనన్యకి పెళ్ళి కాక, నాకు అయి మా ఇద్దరికీ రాత్రిళ్ళు తేడా లేకుండా పోతోందండి".

అతను ఏం మాట్లాడలేదు.

"ఆ టి.ఏ., డి.ఏ., డబ్బులకి కక్కుర్తి పడక వేరే ఎవర్నయినా కేంప్‌కి వెళ్ళమనరాదుటండీ?" ప్రశ్నించింది భర్తని.

"ఉద్యోగంలో ఉండగానే కాస్తంత వెనకేసుకోవాలి... రిటైరయ్యాక హాయిగా జీవించాలంటే ఇప్పట్నించి కూడబెట్టాలికదా. అందుకే కామోసు కేంప్‌కి వెళ్ళడానికి పోటీ పెరుగుతోంది".

బదులుగా మరోసారి నిట్టూర్చిందామె.

"డేడీ. ఇవాళ రాత్రి నాకో కలొచ్చింది తెలుసా?" చెప్పాడు రాజు ఉత్సాహంగా.

"ఇవాళ రాత్రి కాదు. నిన్న రాత్రి అనాలి"

"ఇవాళ రాత్రే డేడీ ఆ కల వచ్చింది"

"ఇవాళ రాత్రి అంటే, ఈ రాత్రి పడుకుంటావే అది. సరే. ఏం కల వచ్చింది?" అడిగాడు రామ్మూర్తి.

"దేవుడి కల! కల్లో దేవుడు కనపడ్డాడు. అచ్చం షిరిడి సాయిబాబా లాగానే వున్నాడనుకో"

"సరే. అనుకున్నాను. ఇంతకీ షిరిడీ సాయిబాబా ఏమన్నాడేంటీ?" నవ్వుతూ అడిగాడు రామ్మూర్తి.

"స్కూల్‌కి వెళ్ళివచ్చేలోగా ఇవాళ నాకో పదిరూపాయలు దొరుకుతాయని చెప్పాడు".

"మంచిది. దొరికితే కొబ్బరికాయ కొని సాయిబాబా కేలండర్‌కి కొట్టు"

ఆ సంగతి ఆ కుర్రాడి తల్లితండ్రులిద్దరూ పట్టించుకోలేదు. అంతటితో మర్చిపోయారు.

xxxxx

ఆ రోజు సోమవారం.

ఆరోజు కూడా నిరుపమ్ ఎదురు చూసినట్లుగా పోస్ట్‌లో అతని పేర ఓ కవర్ వచ్చింది. కంప్యూటర్ ప్రింటవుట్ తీసిన చిరునామా అతికించిన కాగితంవుంది ఆ కవరు మీద.

దాన్ని ఆత్రంగా చింపాడు... లోపలనించి ఓ ముక్కని బయటకి తీసాడు. ఫోటోలోంచి చింపబడ్డ ఆ చిన్న ముక్కలో నడుం ముందున్న చీర భాగం వుంది. వెనక్కి తిప్పి చూసాడు. దానిమీద కూడా "ఐలవ్‌యూ"



అని రాసివుంది.

"ఎక్స్‌క్యూజ్ మి. దీని మీద మీ సంతకం లేదు"

అతను తలెత్తి చూస్తే అనన్య నిలబడి వుంది. ఆమె అందించిన కాగితం అందుకుని చూసి 'ఓ! సారీ' అని దాని మీద సంతకం చేసిచ్చాడు. ఎప్పటిలా నిరుపమ్ చూపుల్లో తనమీద ఆరాధనాభావం తొంగిచూడడం గమనించింది అనన్య. మనసులో కొద్దిగా గర్వంగా ఫీలయింది.

"మీకో ఐక్యు టెస్ట్. మా ఇంటి యజమాని కొడుకు వయసు ఆరు. అతని తండ్రి వయసెంత?" అడిగాడు. కొద్ది క్షణాలు ఆలోచించింది అనన్య.

"తర్టి ప్లస్ అయి వుండచ్చు"

"తప్పు. తేలికైన జవాబు"

అనన్య మరికాసేపు ఆలోచించి చెప్పింది.

"ఇలాంటి ప్రశ్నలకి జవాబు తెలిస్తే ఇంతేనా అనిపిస్తుంది. తెలియనంతవరకు ఆ ఏంగిల్‌లో ఆలోచించం. మీరే చెప్పండి. ఎంత ఆ ఆరేళ్ల కుర్రాడి తండ్రి వయసు?"

"ఆరేళ్ళే"

"అదెలా సాధ్యం?"

"అతను తండ్రి అయింది ఈ కుర్రాడు పుట్టిన క్షణంలోనేగా? కాబట్టి అతని వయసూ ఆరేళ్ళే. అంతకు మునుపు మొగుడు తప్ప తండ్రికాడుగా" అనన్య చిన్నగా నవ్వి చెప్పింది. "లాజికల్‌గా కరెక్టే"

"ఎందుకంటే లాజికల్‌గా కరెక్ట్ అయిన జవాబులే వుండేలా ఇలాంటి ప్రశ్నలు తయారవుతాయి. గోవా విస్తీర్ణం ఎంత? అనడిగాననుకోండి మూడువేల ఏడువందల రెండు స్క్వేర్ కిలో మీటర్లన్న ఒకే ఒక్క జవాబు దానికి. బైది బై గోవా వెళ్ళారా ఎప్పుడైనా?"

"లేదు. గోకర్ణం వెళ్ళినప్పుడు గోవా కూడా చూడాలి" చెప్పింది అనన్య.

"మీరీ కాలం అమ్మాయి కారండి"

అదేం? "గోవా వెళ్ళినప్పుడు గోకర్ణం చూడాలనుకోనా? ఏం చేస్తాం! నాకు చిన్నప్పట్నించి దైవభక్తి... మా బామ్మ పెంపకం అలాంటిది".

"నాకు మీ బామ్మనోసారి చూపించండి"

సన్నగా నవ్వింది అనన్య. తనింటికి అతనికి రావాలని వుందని తెలుసు అనన్యకి. డైరెక్ట్‌గా మీ ఇంటికి వస్తాననకుండా ఇలా ఏదో దానికి లింక్ పెట్టి ఇంటికి ఆహ్వానించమనే అర్థం వచ్చేలా మాట్లాడడం నిరుపమ్‌లో ఈమధ్య గమనిస్తోంది అనన్య. ఇలాగే ఓసారి మాటల్లో 'మా ఇంట్లో ఓ స్విచ్ వేస్తే ఇంకోలైటు వెలుగుతోంది. వైరింగ్‌లో ఏదో ప్రాబ్లం వచ్చినట్లుంది' అని అనన్య అంటే, 'అయితే ఆదివారం మా కజిన్‌ని తీసుకురానా? వాడుమంచి ఎలక్ట్రీషియన్' అన్నాడు.

మరోసారి 'మా ఇల్లుకొని అపార్ట్‌మెంట్స్ కట్టాలని ఓ రియల్ ఎస్టేట్ ఏజెంట్ వచ్చాడు. మా బామ్మ 'నో' చెప్పింది 'కోటి రూపాయలపైనే వస్తుంటే, ఎందుకు బామ్మా ఇచ్చేద్దాం' అనంటే వింటేనా? పైగా అమ్మితే కొబ్బరి, బొప్పాయి, అరటి చెట్లు నరికేస్తాడు వెధవ అన్నది' అని చెప్పింది అనన్య. వెంటనే నిరుపమ్ 'నాకు బొప్పాయిలిష్టం. మిమ్మల్ని కోసుకురమ్మనడం భావ్యంకాదుకాని ఓ ఆదివారం నే వచ్చి కోసుకోనా 'అన్నాడు.

అయితే అనన్యకి తమ పరిచయం ఇంటికి వచ్చేదాకా చేయడం ఇష్టంలేదు. అందుకే ఎప్పటిలా చిన్నగా నవ్వేసి వెనక్కితిరిగింది.

"మీకు మీ బామ్మంటే చాలా ఇష్టం అనుకుంటా?"

"అవును" అని చెప్పింది.

"మీ అమ్మా నాన్నా..." అర్థోక్తిగా ఆగాడు.

"లేరు" అని కొద్దిగా బాధగా చెప్పి అంతలోనే సర్దుకుని చిన్నగా నవ్వి చెప్పింది అనన్య.

"నేను ఫోర్త్‌క్లాస్‌లో వుండగా మా టీచర్ మర్నాడు మా కిష్టమైనవి తీసుకురమ్మన్నారు. అంతా టెడ్డీ బేర్స్, టాయ్ కార్స్, ఆట బొమ్మలు తెచ్చారు. నేను మా బామ్మని తీసుకెళ్ళాను. ఆవిడంటే నాకంత ఇష్టం"

అనన్య తన సీట్లోకి వెళ్ళిపోయింది.

నిరుపమ్ చిన్నగా నిట్టూర్చాడు.

'చేసుకుంటే, అనన్య లాంటి అమ్మాయినే పెళ్ళిచేసుకోవాలి' అనుకున్నాడు మనసులో. చక్కటి పర్సనాలిటి, మంచి అందం, తనతో సమానమైన జీతం. పైగా ఓ స్వంత పెద్దిల్లు. తమ పెళ్ళయితే కారు మెయిన్ టెయిన్ చేయచ్చు. కారులో అనన్యని తను పనిచేసే బ్రాంచిలో వదిలి తను తన బ్రాంచ్‌కి వెళ్ళొచ్చు. తమకి పెళ్ళయితే ఇద్దరూ ఒకే బ్రాంచ్‌లో పని చేయడానికి బేంక్ రూల్స్ వప్పుకోవు... నిరుపమ్‌కి అనన్యంటే ఎంతో ఇష్టం. కాని ఆ సంగతి డైరెక్ట్‌గా ఆమెకి చెప్పలేక పోతున్నాడు.

కంప్యూటర్ కీ బోర్డ్ ముందు కూర్చోగానే అతను పనిలో పడిపోయాడు.

×××××

అనన్య తమ ఇంటి అమ్మకం గురించి చెప్పిన సమయంలో ఆ రియల్ ఎస్టేట్ వ్యక్తి వాళ్ళింట్లో బామ్మ ముందు కూర్చుని వున్నాడు.

"నమస్కారమమ్మా. ఎలావుంది ఆరోగ్యం? ఆ మధ్య మీకు బావుళ్ళేదనుకుంటా?" వినయంగా అడిగాడు.

"నా ఆరోగ్యం గురించి నీకేంపనయ్యా చెప్పు. ఇల్లు అమ్మమనడానికే వచ్చావుకదా?" డైరెక్ట్‌గా అడిగేసింది బామ్మ.

"అవునండమ్మ. అందుకూ ప్లస్ మీ ఆరోగ్యం ఎలా వుందోకూడా కనుక్కుందామ నే... నాకు మీ లాంటి ఓ బామ్మ వుందమ్మా. అయితే మీకున్న వయసు లేదులెండి. మిమ్మల్ని చూస్తే ఊళ్ళోని మా బామ్మ జ్ఞాపకం వస్తూంటుంది".

"నేను సెంటిమెంటల్ కాదు సుబ్బారావ్. నువ్వెన్ని కబుర్లు చెప్పినా ఈ ఇల్లు అమ్మకానికి లేదు... సరా?"

"బామ్మగారూ మీరూ చూస్తూనే వున్నారుకదా?



ఈ చుట్టుపక్కల అన్నీ అపార్ట్‌మెంట్సే. అవునంటారా. కాదంటారా?''

"అవును. అందరూ ఏడువందలు, ఎనిమిది వందల అడుగులలోతుకి బోర్లు వేయించుకోవడంతో మాకు బోర్ ఎండి పోయాకకూడా వాటిని చూడకుండా వుంటానా నాయనా?''

"ఒక్క మీ స్థలంలోనే ఇల్లు... దీంట్లో ఎంత లేదన్నా నాలుగు ఫ్లోర్లకి ముప్ఫై రెండు ఫ్లాట్లు పడతాయమ్మా...''

"ఒక్కో ఫ్లాట్‌కి రెండు లక్షల చొప్పున నీకు ముప్ఫై రెండు రెళ్ళు అరవై నాలుగు లక్షలు లాభం వస్తున్నప్పుడు ఊరుకుంటావా? కొన్ని ఫ్లాట్లు ఫ్రీగా ఇస్తానంటావు. కొంత డబ్బు కేష్‌గా ఇస్తానంటావు. నాకు అదేదో పెంట్‌హౌస్ కట్టిస్తానంటావు. దానికి సెపరేట్ లిఫ్ట్ పెడతానంటావు. ఇంతేగా ప్రతీసారి నీ టేప్‌రికార్డర్‌లో వచ్చేది?'' విసుక్కుంది బామ్మ.

ఆమె విసుగుని గమనించినా, గమనించనట్లే చెప్పసాగాడు సుబ్బారావు. వ్యాపారం అనేది వాళ్ళ వంశంలో, వాళ్ళ రక్తంలో నిండిపోయి ప్రవహించేస్తోంది కాబట్టి పనికావడం, లాభం రావడం వాళ్ళకి ముఖ్యం.

"మీరు చాలా నిక్కచ్చి మనిషి బామ్మగారూ. అన్నీ గుర్తుపెట్టుకున్నారు. కాని ఒక్కటి మరిచిపోయారు. మీకు సెపరేట్‌గా కారు గేరేజ్ కట్టించి ఇచ్చి ఫోర్డుకారు కూడా కొనిస్తానన్నాను. ఈ ఆఖరి జీవితం మీరు దర్జాగా బ్రతకాలన్నది నా కోరిక. దానికీ నా వ్యాపారానికి మీరు లింక్ పెట్టకండి బామ్మగారూ.''

"చెప్పాకదా సుబ్బారావ్. నేను సెంటిమెంట్‌కి బారెడు దూరమని. ఈ ఇల్లు అమ్మకానికి లేదు''.

"ఈ పాత ఇంట్లో మీ ఇద్దరే వుండడం ఈ రోజుల్లో బాలేదు బామ్మగారూ. దొడ్డంతా ఊడ్చకుండా రాలిన ఆకులతో ఎలావుందో చూడండి. పాములు చేరినా చేరగలవు''

"ఈ మధ్య తొండలు చేరాయి. నువ్వుకాని వాటిని తోలావా?'' అనుమానంగా అడిగింది బామ్మ.

"అబ్బే లేదండి''

"నువ్వు నన్ను బెదిరించడానికి పాముల్ని తెచ్చి మా కాంపౌండ్‌లో వదిలినా నాకేం భయంలేదు. ఎంచక్కా అందంగా వున్న దాన్ని చూసి పెంచుకుంటాను. నీకు చెప్పానా మా జాంబవతి పూర్వం పాముల్ని పెంచుకునేదని? వాటి ఆలనా పాలనా ఎలా చూడాలో నాకు తెలుసయ్యా. ఈ వయసులో కాలక్షేపానికి కాలక్షేపం 'పాము వున్నది జాగ్రత్త' బోర్డు పెడితే డోర్ టు డోర్ సేల్స్‌మెన్ మాట అటుంచి, దొంగలు కూడా రావడానికి జంకుతారు''.

"ఏమి ఆలోచనా రీతి? ఏమి వాగ్ధాటి బామ్మగారూ మీది''.

"కాదు మరీ''.

"మీ మనవరాలు బేంక్ ఉద్యోగం చేయక్కర్లా... టాటా లేదా బిర్లా కంపెనీలో పనిచేసే టాప్ ఎగ్జిక్యూటివ్‌ని చేసుకోవచ్చు. మీరంతా ఏటా ఏ సింగపూర్‌కో షికారుకి వెళ్ళిరావచ్చు''.

"నా ప్రిఫరెన్స్ హవాయ్ దీవులు. ఎంచక్కా బేతింగ్ డ్రస్‌లో వాటర్ స్కీయింగ్ చేయచ్చుకాని ఈ ఇల్లు అమ్మకానికి లేదయ్యా...''

"మీ తదనంతరం మీ మనవరాలు ఎటూ అమ్మి తీరుతుంది''

"అది దానిష్టం''.

"ఆ పని మీరే ఎందుకు చేయకూడదు? నే నిచ్చే అడ్వాన్స్‌తో హవాయ్ దీవులకి వెళ్ళి ఆర్నెల్లుండి రావచ్చు. మీ పెంట్‌హౌస్ తయారయ్యే దాకా నేను మీకు జూబ్లీహిల్స్‌లో మంచి ఇల్లు అద్దెకి తీసి వుంచుతాను''

"సరిగ్గా చిరంజీవి ఇంటిపక్కనే ఇల్లు అద్దెకి తీసిచ్చినా సరే. సారీ సుబ్బారావ్''

"అన్ని సార్లూ ఇదే మాటా బామ్మగారూ! మీ మనసు ఏదోనాడు మారుతుంది. అప్పుడు యస్ సుబ్బారావ్ అంటారు'' ఎంతో నమ్మకంగా చెప్పాడు సుబ్బారావు.

"నాకందుకే నిన్ను చూస్తే, ముచ్చట వేస్తుంది సుబ్బారావ్. నీ అంత ఆశాజీవిని నేను ఇంతదాకా చూడలేదు''.

"నాకన్నా గొప్ప ఆశాజీవి మీరే కదా బామ్మగారూ''

"పొగడ్త కుదర్లేదు సుబ్బారావ్''

"పొగడ్త కాదు కాబట్టి కుదర్లేదు. మీ వయసు తొంభైకి చేరుకుంటోంది కదా. అయినా మీకు ఇంకా ఏ నూటపదిదాకానో నూట ఇరవై దాకానో జీవిస్తామన్న ధైర్యం వుంది చూసారు. అదీ ఆశాజీవి లక్షణం. ఇంత వృద్ధాప్యంలో కూడా మీరు ఎంత ఆరోగ్యంగా వున్నారో''.

"నాకు అప్పుడే వృద్ధాప్యం ఏమిటి చెప్పు? వంద దాటితే అనుకోవాలి కాని... నేను పక్క మీద, నా పళ్ళు పక్కనే స్టూల్ మీద నిద్రిస్తే వృద్ధాప్యం వచ్చిందనుకోవాలి. టైరవడానికన్నా, రెస్ట్ తీసుకోవడానికి ఎక్కువ సమయం అవుతూంటే, వృద్ధాప్యంలోకి వచ్చామనుకోవాలి. డాక్టర్లు, మందుల షాపువాళ్ళు బెస్ట్ ఫ్రెండ్స్ అయితే వృద్ధాప్యం వచ్చిందనుకోవాలి. మునుపటి కన్నా సగం అందంగా కనపడటానికి, ఇదివరకటికన్నా రెట్టింపు టైం మేకప్‌కి ఖర్చుచేస్తే వృద్ధాప్యం వచ్చిందనుకోవాలి. మంచం మీంచి దిగ్గున దిగలేక నాలుగైదుసార్లు ప్రయత్నించాకే దిగితే వృద్ధాప్యంలోకి వచ్చామనుకోవాలి. చెరుకుగడ కొరికితే పళ్ళుదానికి అతుక్కునే వుంటే వృద్ధాప్యం మీద పడినట్లయ్యా. అరగంటసేపు కళ్ళజోడు ఎక్కడ పెట్టానా అని వెదికాక అది నుదుటిమీదకి లాక్కున్నామని తెలిస్తే, ముసలి పీనుగ అయినట్లు. నాకలాంటి స్థితులేం ఇంకా రాలేదు కదయ్యా''.

"మీ ఆరోగ్య రహస్యం ఏంటి బామ్మగారూ?''

"ఈ రోజు బాధలు నిన్నటి తప్పులు. నిన్న తప్పులే చేయకపోతే, ఈరోజు బాధలేవుండవు కదా. అప్పుడంతా ఆరోగ్యమే''.

"బాగా చెప్పారు'.

- (ఇంకావుంది)






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరు తెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు,
నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# సినిమా తొలినాటి వింతలు, విశేషాలూ

సీరియస్‌నెస్ నుంచి హ్యూమరొస్తుందనీ, హ్యూమరు నుంచి సీరియస్‌నెస్ పుట్టాలని - చాప్లిన్ మహాశయుడు చెప్పాడు. అలా, తొలినాళ్ళలో సినిమాలు తీసినప్పుడు వాళ్లు 'సీరియస్'గానే ఆలోచిస్తూ తీసినా, ఇవాళ అవి తలుచుకుంటే నవ్వు వస్తుంది. స్తబ్దుగా వుండవలసిన బొమ్మ తెరమీద కదుల్తున్నప్పుడు నాటి ప్రేక్షకుడు సంభ్రమాశ్చర్యాలతో చూశాడు. గొప్ప వింత! మూకీ చిత్రాలు కథా చిత్రాలై జనాకర్షణ పొందుతున్నప్పుడు కూడా స్త్రీలు, స్త్రీ పాత్రలు ధరించడానికి ముందుకు రాలేదు. కెమెరా ముందు, దీపాల వెలుగులో నిలుచుంటే తమ 'అందం' అంతరిస్తుందని మూఢ విశ్వాసంలో వుండేవారుట! అంచేతనే మన దేశంలో తయారైన మొదటి శబ్దరహిత చిత్రం 'రాజాహరిశ్చంద్ర' (విడుదల 1913)లో కూడా స్త్రీ పాత్రల్ని పురుషులే ధరించారు. శబ్దం లేదు గనుక, గొంతులు మగ గొంతులే అయి వుండాలి!

అంతకు ముందు, విదేశాలు నుంచి మూకీ చిత్రాలు వచ్చేవి. నవ్వు కాదు గాని, ఓ గొప్ప విశేషం గమనించాలి. 'హరిశ్చంద్ర' తీసిన దాదాఫాల్కే అటు తర్వాత కూడా చాలా చిత్రాలు తీశాడు. అప్పట్లో దిగుమతయిన ముడి ఫిల్ముకి పక్కన స్ప్రాకెట్స్ (ప్రొజెక్టర్లో తిరగడానికి ఫిల్మ్ పక్కన చిల్లులు) వుండేవి కాదు. ఫాల్కే, డార్క్‌రూమ్‌లో కూచుని, వేలాది అడుగుల ఫిల్ముకి సమానదూరంలో చేత్తో చిల్లులు పొడిచే వాడు! ఇవాళ, ఇలా విజృంభించిన సినిమాకి ఆదిలో అలా విశేష శ్రమనీ, కష్టానికీ లోనయ్యారు పెద్దలు.

ప్రసిద్ధ కమెడియన్ కస్తూరి శివరావు మొదట్లో సినిమా ఆపరేటరు. ఆయన కొన్ని జోక్స్ చెబుతూ వుండే వారు. తాను పని చేస్తున్న పెండాలు (అప్పట్లో సినిమా థియేటరుని అలా అనేవారు) ప్రొప్రయిటరు ఓరోజు తనని చెడామడా తిట్టి ఉద్యోగం పీకేశాట్ట. "దానికి కారణం - ఆ మూకీ సినిమా అమెరికన్ సినిమా. అందులో ఒక అమ్మాయి దుస్తులు మార్చుకుంటూ ఉంటుంది. మనకి మొత్తం బాక్‌షాట్‌లోనే కనిపిస్తుంది. ఆ దృశ్యం రాగానే మా ప్రొప్రయిటరుగారు తెరవెనక్కి వెళ్ళి నించునేవాడు. అక్కడా అలాగే కనిపిస్తుందని ఆయనకి తెలీదు! దాంతో ఉగ్రుడై "నేను ఎన్నిసార్లు వెనక్కి వెళ్లినా, నువ్వు బొమ్మ మార్చేస్తున్నావు. నాకు వీపు మాత్రమే కనిపిస్తోంది. నీ పొగరు భరించలేను - డిస్మిస్" అని నేనెంత చెబుతున్నా వినిపించుకోకుండా ఉద్యోగం ఊడగొట్టాడు" అని చెప్పారు శివరావు.

"అలాగే, ఒకాయన రోజూ వచ్చి ఒక సినిమా చూసేవాడు. ఎందుకు రోజూ వస్తున్నాడు? ఆ సినిమాలో రైలు వచ్చి ఆగే దృశ్యం వుంది. "రోజూ అది కరెక్ట్ టైముకే వస్తోంది. ఏ రోజైనా ఆలస్యంగా రాదా అని అతని ఉద్దేశంట!" అని ఇంకో జోక్ చెప్పేవాడు శివరావు. మూకీ సినిమాలు వచ్చిన తొలిరోజుల్లో సినిమా ప్రారంభానికి ముందు హాల్లో దీపాలు ఆర్పితే, జనం "దీపాలు ఆర్పకండి బాబోయ్, మాకు భయం" అని అరిచే వారట. కొన్నాళ్ళకి గాను అది సర్దుకోలేదు. అమెరికాలో మొదటిసారి సినిమా చూసిన వాళ్లు, హీరోయిన్ క్లోజప్ రాగానే "దగా! మోసం! ఆవిడ నడుమూ కాళ్లు ఏవీ?" అని గట్టిగా అరిచారట. అలాగే మన తెలుగు సినిమా మాట నేర్చుకున్న కొత్తల్లో, ఒక పాత్ర పద్యం చదువుతూ వుంటే ఇంకో పాత్ర 'రియాక్షన్' షాటు వేస్తే ఒప్పుకునే వారు కాదుట. పద్యమో, పాటో పాడుతున్న పాత్రే కనిపించాలి!




ఈ మాటలు ఆంధ్రదేశంలో మొదట సినిమా థియేటరు కట్టించిన పోతిన శ్రీనివాసరావు గారు చెప్పేవారు. ఆయన చాలా మూకీలు తెప్పించి, ఆంధ్రలో ఆడించారు. "ఒక పౌరాణిక మూకీ చిత్రంలో భీముడికి మధ్యలో మీసం ఊడిపోతుంది. అది ఆ సినిమా తీసిన వాళ్లు గమనించలేదు కానీ, ప్రేక్షకులు గమనించారు. "మీసం ఊడిన భీముడు, మీసం జారిపోయిన భీముడు" అని గోల చేశారు. ఊరంతా ప్రచారం కూడా చేశారు. "ఆ ప్రచారాన్ని ఖండిస్తూ, నేను ఇంకొక ప్రకటన చేయించాను. "ఇవాళ

భీముడికి మీసం ఊడదు. దయచేసి రండి" అని మేళతాళాలతో చెప్పించాను. నేను ఆపరేటరుతో చెప్పి మీసం ఊడిన భాగాన్ని కత్తిరించేసి అతికేయమన్నాను. అంతే! అది ఎవరికీ తెలియలేదు గనుక, అందరూ సంతోషించారు" అని చెప్పారు శ్రీనివాసరావు. ఐతే, 'కదిలే బొమ్మ' జనానికి వింత కలిగించినా, జనం ఎక్కువగా వచ్చేవారు కాదుట. ఎదురుగా పాత్రలు కనిపిస్తూ పాటలూ పద్యాలూ పాడుతున్న నాటకాలకే ఎగబడే వారుట.




"అంచేత మేము సినిమా మధ్యలో ఉచితంగా సోడాలు, కిళ్లీలూ ఇస్తామని ప్రకటనలు వేసే వాళ్లం. వాటికోసమైనా జనం వస్తారేమోనని. ఊళ్లో నాటక ప్రదర్శనలు లేకపోతే వచ్చేవారు. మొత్తానికి మూకీ చిత్రాల ప్రదర్శన నష్టాలతోనే నడిచింది" అని శ్రీనివాసరావు చెబుతూ వుండేవారు.

దాదాఫాల్కే కూడా ఇలాంటి అవస్థలే ఎదుర్కొన్నాడు. 'లంకా దహనం' తీసినప్పుడు "నిజంగానే లంకా దహనం కనిపిస్తుంది - రండి" అన్నట్టుగా ప్రకటనలు చేయించాడు. హనుమంతుడు లంకను దహనం చేస్తున్న దృశ్యం రాగానే, ప్రొజెక్టర్ ముందు ఎర్రని అద్దం ముక్క పెట్టి చూపించగానే, బొమ్మ ఎర్రబారింది. నిజం గానే మండుతున్న భ్రాంతి కలిగింది. మొదటి రోజున ప్రేక్షకుల్లో



కొందరు "నీళ్లు! నీళ్లు" అని కేకలు కూడా పెట్టారట. ఇలాంటి ట్రిక్కే తెలుగులో వచ్చిన 'సతీసావిత్రి'కీ చేశారు. యమలోకం దృశ్యం రాగానే ఎర్రరంగు అద్దం ముక్క ప్రొజెక్టర్ ముందు పెట్టి - ఆ దృశ్యం అంతా ఎర్రగా చూపించేవారు.

1936లో వచ్చిన 'సంపూర్ణ రామాయణం' రాజమండ్రిలో తీశారు. రావణుడు సీతను ఎత్తుకుపోయిన తర్వాత, రామలక్ష్మణులిద్దరూ గోదావరి ఒడ్డున సీతకోసం గాలిస్తూ వుంటే - వెనకాల బ్రిడ్జిమీద రైలు వెళ్లిపోతూ వుంటుంది! ఎవరూ చూసుకోలేదు. తీసిన చిత్రాన్ని వెంటవెంటనే, డెవలప్ చేసి చూసుకోడానికి సౌకర్యాలు లేని రోజులు! అలాగే, తర్వాత వచ్చిన ఎన్నో పౌరాణిక చిత్రాల్లో ఎలక్ట్రిక్ స్తంభాలు, వైర్లు, తారు రోడ్లు కనిపిస్తాయి. పూర్వం



రోజుల్లో పాటలు, పద్యాలూ అక్కడి కక్కడే రికార్డయ్యేవి. నటీనటులు పాడుతూ నడుస్తూ వుంటే ఆర్కెస్ట్రా వారిని ట్రాలీమీద కూచోపెట్టి, నటీనటులతో పాటే నడిపించేవారు. 1935లో వచ్చిన 'అనసూయ' (అరోరా ఫిలింస్) లోనో, 'కుచేల'లోనో - ఒక చోట వాద్యాలు వాయిస్తున్న వారు, ఒక షాటులో కనిపించారని, ఆ సినిమా ఏదో సరిగా తనకి జ్ఞాపకం లేదని - సాలూరు రాజేశ్వరరావు చెప్పారొకసారి.

మన దేశంలోని తొలిటాకీ 'ఆలంఆరా' 1931లో విడుదలైంది. సినిమాకి మాటొచ్చిన సంవత్సరం అది. మాట్లాడని బొమ్మ మూకీ - మాట్లాడుతుంది గనుక టాకీ. అప్పట్లో అందరూ టాకీ అనే వారు. ఇప్పుడు "సినిమాకి వెళదామా? సినిమా చూదామా?" అన్నట్టు అప్పుడు "టాకీకి వెళదామా?" అనే వారు. కొందరు 'బైస్కోప్' అనే వారు. ఇప్పటికీ గ్రామాల్లోని పెద్ద వయసు వాళ్లు "బయస్కోపు" అనే అంటూ వుంటారు. "ఆలంఆరా"ని తొలిసారిగా మద్రాసు తీసుకొచ్చినప్పుడు - రైల్వేస్టేషన్ జనంతో కిటకిట లాడిందట! "టాకీకి స్వాగతం!" పలికారట. ఆ ప్రింటు తెచ్చిన వారిని పూల మాలలతో స్వాగతించారట.

అయితే వాళ్లూ కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నారు. వాళ్లు ఊరూరూ తిరుగుతూ, కాంజీవరం వెళ్తే జనం రాలేదట. ఎంచేత? అంతకుముందు ఒకాయన టాకీ అని చెప్పి మూకీ సినిమాయే వేసి, వెనకాల మనుషుల్ని నిలబెట్టి పాటలు పాడించాట్ట. అది తెలుసుకొన్న ప్రేక్షకులు మక్కెలు విరగొట్టారు. "ఇది అలాంటి మోసం కాదు - నిజం టాకీ! రండి, చూడండి" అని విశేషంగా పబ్లిసిటీ ఇస్తేగాని, జనం రాలేదు!

సింహళ దేశం వెళ్లి జాఫ్నాలో 'ఆలం ఆరా' వేస్తే "హిందీ మాకొద్దు - సింహళ భాషలో వెయ్యండి" అని గోల చేశారు ప్రేక్షకులు. అలా కుదరదని, శబ్దం బొమ్మతో పాటే వుంటుందని ఎంత చెప్పినా వాళ్లకి అర్థం కాలేదు. 'అంతకు ముందు స్పీకర్లో సింహళం పాటలు వేశారు గదా, అదే స్పీకర్లో సింహళభాష రావడానికి ఏం రోగం?" అన్నది వాళ్ల పాయింటు.

నెల్లూరులో 'ఆలంఆరా' వేసినప్పుడు ఇంటర్వెల్లో ఒక లాయరుగారి టాకీ మనుషుల్ని కలిసి "టెక్నిక్ బాగా పెరిగింది. బొమ్మ కదలడం, మాట్లాడ్డం బాగుంది. మీరు ఉత్తర హిందూ దేశంలో హిందీ మాట్లాడించండి. ఇక్కడ మాత్రం తెలుగులో మాట్లాడించండి. ఇంత టెక్నిక్ తెలిసిన వాళ్లు - మీకు అదేమంత కష్టం కాదు. కనీసం మా నెల్లూరులో నయినా, మీ సినిమా చేత తెలుగు మాట్లాడించండి" అన్నది ఆ లాయరుగారి రిక్వెస్టు. ఇలాంటివే ఇంకా ఎన్నో తొలినాళ్ల విశేషాలు, వింతలూ!



# రాంపండు లీలలు

## రాంపండూ - హెడ్‌మాష్టర్లూ

**ఆటల పోటీల పందాల్లో ఓడిపోయాక రాంపండు అనంత్ దగ్గరికి వచ్చి భోరుమన్నాడు. "ఆ హెడ్‌మాష్టారు పరంధామయ్య నా కొంపముంచాడ్రా. అచలపతి వెళ్లి తప్పు చేసినట్టూ, అది ఒప్పుకున్నట్టూ నటించడం ఏమిటి? ఈయన అది నమ్మేసి మొదట వచ్చిన ఐదుగురినీ డిస్‌క్వాలిఫై చేసేసి ఆరో అమ్మాయికి ప్రైజు ఇచ్చేయడమేమిటి? అటు తిరిగి, ఇటు తిరిగి నా జేబు కొల్లగొట్టేశాడు దుర్మార్గుడు. ఘోరంగా దెబ్బతినేశాను."**

**అనంత్ ఓదార్చబోయేడు. "ఈ హెడ్‌మాష్టార్ల వరస నీకు తెలియనిదేముంది?" అంటూ! రాంపండుకి ఉక్రోషం వచ్చింది. "నాకొళ్లు మండిందంటే మా పాత హెడ్‌మాష్టారు రామబ్రహ్మం గారిని నొక్కేసినట్టు నొక్కి పారేయగలను ఏమనుకుంటున్నాడో" అంటూ రంకెలేశాడు. దాంతో అనంత్‌కి గతం ఒక్కసారి కళ్లముందు తిరిగినట్టయింది.**

అప్పట్లో రాంపండు "జల్సా" అనే ఓ చిన్న పత్రికకి ఎడిటరుగా పని చేసేవాడు. అనంత్ ఓ రోజు అతన్ని చూడడానికి వెళ్లినప్పుడు రాంపండు ఓ కవయిత్రితో ప్రేమలో పడ్డట్టు తెలిసింది. అదీ అనుకోకుండా...!

అసలు ఆవేళ పొద్దున్నే అనంత్‌కి, అచలపతికి ఓపాటి మనస్పర్థ వచ్చింది. ముందురోజు ఎగ్జిబిషన్‌లో ఓ పూలకూజా కనబడితే హాల్లో పెట్ట వచ్చని అనంత్ కొని తెచ్చాడు. అది హుందాగా లేదనీ, హాల్లో పెట్టించుకునే అర్హత దానికి లేదని అచలపతి వాదం.

"ఇదిగో చూడు అచలపతీ, నువ్వు నేను వేసుకునే డ్రస్సు దగ్గర్నించి, బూట్ల దగ్గర్నుంచీ అన్నిటినీ శాసించాలని చూసినా సహించాను. కానీ ఈ ఫ్లవర్‌వేజ్ విషయంలో మాత్రం ఎవ్వరిమాటా వినదలచుకోలేదు" అంటూ అనంత్ ధాటీగా చెప్పేసి బయటకు వచ్చేసేక ఎటు వెళ్ళాలో తేల్చుకోలేక అనుకోకుండా రాంపండు ఆఫీసువైపు నడక సాగించేడు.

ఓ పత్రిక ఎడిటరు దగ్గరికి వెళితే వచ్చే సహజమైన ప్రశ్న "మా లేటెస్టు ఇష్యూ చదివేవా?" అని. హృదయమున్నవాడు, పైగా ఎడిటరుకి స్నేహితుడైనవాడు దానికి 'లేదు' అని చెప్పలేడు. అవునని చెప్పాలంటే పత్రిక చదవాలి. లేకపోతే "అది బాగుందా? ఇది బాగుందా? దానికంటె ఇది బాగుందా? లేక దీనికంటె అది బాగుందా?" అని ఎదురయ్యే సవాలక్ష ప్రశ్నలకు జవాబు చెప్పడం కష్టం. "జల్సా" పత్రిక చదివి ఆరోగ్యం పాడు చేసుకోవడం కంటె ఫ్రెండైనా రాంపండుని తప్పించుకు తిరగడమే మంచిదన్న అభిప్రాయంతో అనంత్ అతని ఆఫీసుకి వెళ్లడమే మానుకున్నాడు.

కానీ ఆవేళ అచలపతి గొడవతో మతిపోయిన అనంత్ కాస్సేపటికి "జల్సా" ఎడిటర్ గుమ్మం దగ్గర తేలేడు. అది "ప్రైవేట్" అని రాసి ఉన్న గుమ్మం. ఎడిటర్‌కి అత్యంత సన్నిహితులు మాత్రమే రాదగిన ద్వారం. తక్కినవాళ్లందరూ దానికి ఎదురుగా ఉన్న ఆఫీసులోకి వెళ్లి వేరే ద్వారం ద్వారా ఆ రూమ్‌లోకి రావాలి. అనంత్ ఎడిటర్ ఫ్రెండు కాబట్టి ఈ ద్వారం ద్వారా వెళ్లడానికి ఎవరూ అభ్యంతరపెట్టరు. కానీ అసలు అభ్యంతరం ఎడిటరు దగ్గర్నుంచే వస్తుంది - వచ్చినవాడు అతని పత్రిక చదవకుండా చేతులూపుకుంటూ వచ్చేడంటే!

అందుకే అనంత్ వెళుతూనే రాంపండుని కంగ్రాట్యులేట్ చేసేశాడు. "నీ లేటెస్టు ఇష్యూ బ్రహ్మాండంగా ఉందోయ్! అవునుగానీ మీ బాబాయ్ ఎలా వున్నాడు? నీ పాకెట్‌మనీ ఏమైనా పెంచాడా? లేక ఉద్యోగం చేస్తున్నావు కాబట్టి అక్కర్లేదన్నాడా...?"

మాటమార్చడానికి రాంపండు ఒప్పుకోలేదు. "పత్రిక నీకు నిజంగా నచ్చిందా?"

"ఆహా"

"మొత్తమంతా....?"

"ప్రతీ పేజీ...."

"ముఖ్యంగా ఆ కవిత లేదూ-"ఏకాంతం"!?"

"అక్షరం, అక్షరం ... ఆణిముత్యం"

"మాస్టర్ పీసు కదా"

"అవును బ్రహ్మాండం... ఇంతకీ ఎవర్రాసారు?" అన్నాడు అనంత్ ఇకపై ఎలా మెచ్చుకోవాలో తెలియక.

రాంపండుకి ఒళ్లు మండిపోయింది. "కింద పేరు వేశాంగా" అని విసుక్కున్నాడు.

"పేరు మర్చిపోయానులేరా..." అనంత్ సర్దుకున్నాడు.

"ఆ కవిత.... ఆ అద్భుతమైన కవిత... రాసినది" ఒక్కసారి ఆగి ఊపిరి పీల్చుకుని రాంపండు ఎనౌన్స్ చేశాడు. - "సుమనోహరి"

రాంపండు ఆ పేరు ఉచ్ఛరించిన తీరు చూస్తేనే అనంత్‌కి అనుమానం వచ్చింది. రాంపండుకి మళ్లీ ప్రేమరోగం పట్టుకుందాని. కాస్సేవట్లోనే రోగ నిర్ధారణ కూడా అయిపోయింది. రాంపండు మళ్ళీ ప్రేమలో పడ్డాడు! సుమనోహరి ఎంత మనోహరంగా ఉంటుందో పావుగంట సేపు విన్నాక అనంత్ అడిగేడు.

"ఇంతకీ నీ ప్రేమ గురించి ఆమెకు చెప్పావా?"

"లేదు. చెప్పలేదు. నాకు భయంగా వుంది".

"భయం నీకెందుకురా? నిన్ను ప్రేమించే వాళ్లకుండాలి గానీ" అని అనంత్ వాదించినా రాంపండు వినలేదు. సుమనోహరి ఒక దేవతట. ఆమె ముందు రాంపండు ఒక క్రిమిట... కాదు కీటకంట... కాదు పిపీలికంట. ఆమె చెయ్యి పట్టుకునే అర్హత లేదట. చెయ్యేమిటి? ఆమె ఎదుట నిలబడే అర్హత కూడా లేదని రాంపండు ఎనౌన్స్ చేసాడు.

"నువ్వు సన్నాసివే కానీ మరీ అంత సన్నాసివి కావ"ని అనంత్ చెప్తూండగానే ఒక పెద్దాయన తలుపు తోసుకుని జబర్దస్తీగా వచ్చాడు. భారీ మనిషి, పంచె లాల్చీ, పైమీద కండువా, చేతిలో చేతికర్ర, కంచుకంఠంతో "ఒరే రాంపండూ" అంటూ రాగానే రాంపండు ఠపీమని లేచి అటన్షన్‌లో లేచి నుంచున్నాడు. ఆయన బర్రుమని కుర్చీ లాక్కుని కూచుని, "ఊ కూచో" అనేదాకా రాంపండు కూచోలేదు. అదీ కుర్చీ అంచుమీదే కూచున్నాడు. ఏ క్షణంలోనైనా లేచి కుర్చీమీద నిలబడడానికి సిద్ధంగా ఉన్నట్టున్నాడు.

"ఇదిగోనోయ్, ఇంకో వ్యాసం నీ కోసం ప్రత్యేకంగా రాసి పట్టుకొచ్చా. "చోళుల కాలంలో చోళ్లు తిన్నారా? లేదా?" అని వ్యాసం పేరు. జాగ్రత్తగా చదివి అచ్చేయి. అక్కడా, ఇక్కడా పారేయక. నీకు చిన్నప్పటినుండి శ్రద్ధ తక్కువ. రెండ్రోజులకోసారి ఎక్కాలపుస్తకం పారేసుకునే వాడివి. మూడు రోజులకోసారి పలక విరక్కొట్టుకునేవాడివి. ఇది చదివేటప్పుడు కాగితాలు నలిగిపోకుండా చదువు" అని ఆర్డర్లేస్తున్నాడు ఆ వచ్చినాయన, పక్కనే ఉన్న అనంత్ అనే మానవుడి ఉనికే పట్టించుకోకుండా!

పుత్రకామేష్టి యాగం చేసాక పాయసం కుండని అందుకున్నంత భయభక్తులతో రాంపండు అది అందుకున్నాడు. కానీ వచ్చినాయన తృప్తి పడ్డట్టు లేదు. "ఇప్పుడు బాగానే తీసుకుంటావ్. తర్వాత దానికి ఇవ్వాల్సిన గౌరవం ఇవ్వవ్. కితం సంచికలో 'శాతవాహనుల కాలంలో సనాతన వాహనాలు' వ్యాసం ఎక్కడో లోపలి పేజీల్లో వేశావ్. ఇదయినా కాస్త అందంగా, అందరూ చదివేచోట వేయి. నా ఫోటో అదీ కావాలంటే ముందే అడుగు. ఆఖరి క్షణంలో వెతకాలంటే కష్టం. ఇవన్నీ చెబుతున్నానంటే సంపాదకుడిగా నీ స్వేచ్ఛను హరిస్తున్నానని అనుకోవద్దు. నీకు తెలియదు కదాని, నా స్టూడెంటువి కదాని అభిమానంతో చెబుతున్నానన్నమాట. నువ్వు కలర్‌ఫోటో వేసినా,



బ్లాక్ అండ్ వైట్ వేసినా నీ ఇష్టం. అది నిర్ణయించుకునే హక్కు నీదే! వస్తా".

ఆయన వెళ్లగానే రాంపండు జుట్టు పీక్కోవడం, తలకాయ టేబుల్‌మీద పెట్టి వెక్కి వెక్కి ఏడవటం జరిగింది. అతన్ని ఓదారుస్తూ అనంత్ సేకరించిన సమాచారం ఇదీ - వచ్చినాయన రామబ్రహ్మం. రాంపండుకి ఎలిమెంటరీ స్కూల్లో హెడ్‌మాస్టారు. ఈ పత్రికలో వాళ్ల మనవరాలి పెళ్లి సంబంధం గురించి ప్రకటన ఇవ్వడానికి వచ్చి రాంపండును చూశాడు. ఇక మనవాడే కదాని ఎస్సేల మీద ఎస్సేలు రాసి పడేస్తున్నాడు. వేయమని దండిస్తున్నాడు. "జల్సా" అని పేరుపెట్టిన పత్రికలో ఇంత సీరియస్ విషయాలేమిటని పాఠకుల గోల. ఆ ఉత్తరాలు పబ్లిషర్ కంటపడితే ఉద్యోగమే ఊడుతుందని రాంపండు గోల.

"ఇలాంటివి రాయక్కరలేదని చెప్పేయలేకపోయావా?" అడిగేడు అనంత్.

రాంపండు దెబ్బతిన్నట్టు చూశాడు. "నీ ఎలిమెంటరీ స్కూలు హెడ్‌మాష్టరు ఇప్పుడు నీ ఎదుట నిలబడితే నీకెలా అనిపిస్తుంది?".

"దెయ్యాలను నమ్మాలనిపిస్తుంది. ఆయన చచ్చిపోయి పదేళ్లయింది."

"చచ్చి మనను బతికించిన వాళ్ల సంగతి కాదురా. చావకుండా మనల్ని చంపుకుతినే రామబ్రహ్మం లాటివాళ్ల గురించి చెబుతున్నా. ఆయన నా కళ్లెదురుగా కనబడగానే నేను నాలుగోక్లాసు కుర్రాడిలా మారిపోతాను. ఆయన ఎప్పుడు బెత్తం ఝళిపిస్తాడో, నేనెప్పుడు బెంచీ ఎక్కాల్సి వస్తుందోనన్న భయం నన్ను ఆవహిస్తుంది. 'యస్సర్, యస్సర్' తప్ప నా నోట ఇంకో మాట రాదు. ఆయన జేబునిండా, సంచీనిండా చోళుల గురించి, పల్లవుల గురించి రాసుకొచ్చి అచ్చు వేయమని చంపుతాడు. వేయకపోతే వీపు బద్దలు కొడతాడేమోనని భయం. మా పబ్లిషరు ప్రస్తుతం ఫారిన్ వెళ్లాడు. వెనక్కి వచ్చి ఇవి చూశాడా, నా ఉద్యోగం పోవడం ఖాయం. ఒరే నేనేం చేయాలో తెలియటం లేదురా" అంటూ రాంపండు కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

ఇంటికి రాగానే అచలపతి కనబడడంతో పొద్దున మనస్పర్థలను పక్కకు పెట్టి రాంపండు సమస్య గురించి డిస్కస్ చేశాడు అనంత్. "ఆ సమస్యకు మూలకారణం కూడా కనిపెట్టేసేనోయ్. రాంపండుకి ఒక విధమైన కాంప్లెక్స్‌తో బాధపడుతున్నాడు. అది కలగడానికి కారణం ఆ హెడ్‌మాష్టర్. ఆ కాంప్లెక్స్ వల్లనే రాంపండు ఆ సుమనోహరికి తన ప్రేమను వెల్లడించలేకపోతున్నాడు. తనను తాను తక్కువగా అంచనా వేసుకుంటున్నాడు. ఆ కాంప్లెక్స్‌ను ఏదో అంటారయ్యా, చట్టున గుర్తుకు రావటం లేదు..."

అచలపతి అందించాడు. "ఇంగ్లీషులో ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్. తెలుగులో ఆత్మన్యూనతా భావం".

చూడగానే "కరక్టుగా చెప్పేవయ్యా. మన మానసిక బలహీనతలన్నిటికి అదే మూలకారణం. ఎవరిదాకానో ఎందుకు నా మట్టుకు నాకే ఆ కాంప్లెక్స్ ఉంది తెలుసా? మా పెద్దత్తయ్య లేదూ....? మాంకాళి అత్తయ్య. తనని చూడగానే చిన్నప్పుడు నాచేత 13వ ఎక్కం అప్ప చెప్పించుకున్నప్పుడు పిక్కపాశాలు పెట్టిన సంగతి, తన సెంటుబాటిల్ పగల కొట్టినప్పుడు నా వీపు బద్దలు కొట్టిన సంగతి, ఆముదం తాగనని మొండికేస్తే చింతబరిక పెట్టి కొడతానన్న సంగతి - ఇవన్నీ గుర్తుకు వచ్చి వణికిపోతాను. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌లో మునిగిపోతాను. "సరే అత్తయ్యా, అలాగే అత్తయ్యా" తప్ప మరోమాటే రాదు నానోటివెంట. ప్రస్తుతం రాంపండు తన హెడ్‌మాష్టారు రామబ్రహ్మం వల్ల అదే విధంగా బాధపడుతున్నాడు. ఆ కాంప్లెక్స్ పోగొడితే తప్ప రాంపండు ఓ ఇంటివాడవడు....".

అచలపతి గొంతు సవరించుకున్నాడు. "సర్, నా ఉద్దేశ్యంలో అటునుండి నరుక్కురావడం మంచిదంటాను.."

"అంటే రామబ్రహ్మంగారి సుపీరియారిటీ కాంప్లెక్స్ తగ్గించమనా నీ ఉద్దేశ్యం? అబ్బే, అది చాలా హెచ్చుమోతాదులో ఉందయ్యా. నా అంతటి వాడు పక్కన కూచున్నా పట్టించుకోలేదు తెలుసా?"

"సర్, నా ఉద్దేశ్యం అదికాదు. రాంపండుగారు

ఎంతో గొప్పగా భావించే సుమనోహరి ఒక వేళ ఆయన ప్రేమను అంగీకరించిందనుకోండి. అప్పుడు కలిగే ఉత్సాహంతో ఆయన రామబ్రహ్మంగారిని తీసి అవతల పారేయగలుగుతారు".

"ఆడదాని అంగీకారం మగవాడిలో అంత ఊపు కలిగిస్తుందని ఒప్పుకుంటాను. కానీ అసలు రాంపండు తన ప్రేమను వ్యక్తపరిస్తే కదా, సుమనోహరి అవుననడానికి, కాదనడానికి...!".

"దానికి ఎప్పటినుండో కథల్లో వాడిన ఫార్ములా ఉంది కదా సర్. రాంపండుకి ఆక్సిడెంటు అయిందని తెలియబరిస్తే సుమనోహరి పరుగు, పరుగున వచ్చి..."

'అచలపతీ, నీ బుర్ర బొత్తిగా బూజు పట్టిపోయిందోయ్. రాంపండు ఏ లారీ కిందో పడేదాకా ఆగి అప్పుడు సుమనోహరికి చెప్పి, ఆమె వచ్చి కన్నీళ్లు పెట్టుకుని 'నీతోటే నేనూ చితి నెక్కుతాన'ని అని.... నేనే పతివ్రతనయితే నాకు కట్టబోయే మంగళసూత్రం నిలిపే భారం మీదేనని దేవుళ్లను నిలదీసి... ఆ తర్వాత పెళ్లాడి.... ఆమె ఇచ్చిన ఆత్మవిశ్వాసంతో వీడెళ్లి రామబ్రహ్మంగారిని... అబ్బే.... ఇదంతా ఈ దశాబ్దంలో అయ్యే పని కాదు. కానీ నేనింకో మంచి ఐడియా చెప్తాను విను. అంత గొప్ప ఐడియా నాకు ఎలా వచ్చిందో ఆ సంఘటన కూడా చెప్తాను విను. రేపు నా జీవిత చరిత్ర రాద్దామని నీ కనిపిస్తే, విషయం అందుబాటులో ఉంటుంది".

అచలపతి తల వంచాడు. "కానీయండి సర్" అన్నాడు. అదేమంత ఎంకరేజింగ్‌గా అనిపించకపోయినా అనంత్ తన కథ కొనసాగించాడు. "చూడు అచలపతీ, నేను మా మాంకాళి అత్తయ్య గురించి చెప్పాను కదా. నాకు ఆవిడంటే భయం పోయిన ఘడియ ఒకటుంది తెలుసా? నువ్వు నమ్మవు కానీ అప్పుడు నేను "ఏమిటీవిడ గొప్ప?" అనుకున్నాను. జరిగిందేమిటంటే మేమంతా కలిసి నార్తిండియా టూరుకెళ్లి ఓ హోటల్‌లో దిగినప్పుడు మా అత్తయ్య ముత్యాల హారం పోయింది. ఆ గది తుడవడానికి వచ్చిన పనిపిల్లే తీసిందని అత్తయ్య వెళ్ళి హోటల్ మేనేజరుకి ఫిర్యాదు చేసింది. అంతా కలిసి ఆ పనిపిల్లను నానాహింస పెట్టిన తర్వాత ఆ హారం అత్తయ్య పెట్లోనే కనబడింది. అప్పుడు ఆ పనిపిల్ల, దాని కంటె ఎక్కువగా ఊరపందిలా ఉన్న ఆ హోటల్ మేనేజరూ కలిసి హిందీలో మా అత్తయ్యను తిట్టిన తిట్లు వినితీరాలి. అత్తయ్యకు హిందీ రాకపోయినా తిట్లజోరుకి అడిలిపోయింది. సగం, సగం అర్థమయి నేను ఆశ్చర్యపడ్డాను - అత్తయ్యను ఇంతలా తిట్టినా ఫర్వాలేదాని. వర్షంలో తడిసిన పిల్లిలా అత్తయ్య వణుకుతుంటే నాకు ఆవిడంటే అస్సలు భయం పోయింది...

అచలపతి కథనానికి అడ్డు వచ్చాడు. "... అంటే మీకు ఆవిడంటే ఇప్పుడు



భయం పోయిందా సర్?"

అనంత్ విసుక్కున్నాడు. "పోయిందో, లేదో నీకు తెలుసు అచలపతీ. కొంతకాలం తర్వాత మళ్లీ తిరిగివచ్చింది. కానీ కొంతకాలం పాటు ఆవిడంటే లెక్కలేకుండా తిరిగాను. ఇక్కడ పాయింటేమిటంటే ఒక మనిషిని నిస్సహాయ స్థితిలో చూసినప్పుడు మనకు వాళ్లంటే భయం పోతుంది. ఉదాహరణకి ఓ కంపెనీలో పనిచేసే వాడికి వాళ్ల జనరల్ మేనేజరంటే భయం అనుకో. కానీ ఓ జనవరి ఫస్టు నాడు ఆయన తప్ప తాగి రోడ్డు పక్కన పడి వున్నాడనుకో. అప్పణ్నుంచి ఆయనంటే భయం పోతుందా, లేదా....?"

"అంటే జనవరి 1 దాకా ఆగి.... రామబ్రహ్మం గారిని తప్పతాగించి...."

"అచలపతీ నా మాటలు నాకే అప్పగించాలని చూడకు. ఆ లోపునే రామబ్రహ్మాన్ని ఇంకోలా నిస్సహాయ స్థితిలో నెడతాను. వెళ్లి మూడు కిలోల శుభ్రమైన మైదా పిండి తీసుకురా."

"మైదానా?" అనంత్ బుర్ర ఎటుపోతుందో అంతటి మేధావి అచలపతి కూడా ఊహించలేకపోయాడు.

"అవును. నాదో బ్రహ్మాండమైన ప్లానుంది. రామబ్రహ్మం ఇవాళ మూడు గంటలకు వస్తానని చెప్పాడు. ఆ టైముకి రాంపండుని ఆఫీసులో ఉండమని ఆర్డరేశాడు. రాంపండు రూముకి డైరెక్టుగా కాకుండా ఆఫీసులోంచి వెళ్లేదారి మరోటి వుందని తెలుసుగా. ఆ వేళకు ఆ గుమ్మం పైన మైదాపిండిమూట ఏర్పాటు చేసి పెడతాను. ఆయన వచ్చి తలుపు తీయగానే ఆ పిండిమూట నెత్తిమీద పడుతుంది. ఒళ్లంతా పిండి కొట్టుకుపోయిన రామబ్రహ్మాన్ని ఒక్కసారి చూస్తే చాలు. రాంపండు భయం అంతా పటాపంచలయిపోతుంది."

*

మర్నాడు మధ్యాహ్నం రెండు నలభై అయిదు నిమిషాలకు మొదటి అంతస్తు మెట్లెక్కి అనంత్ "జల్సా" ఆఫీసుకు చేరడం, ముందు గదిలో ఉన్న ఆఫీసుబాయికి గంటదాకా రావద్దని లంచంపెట్టి అక్కడి నుండి తరిమేయడం, కుర్చీ లాక్కొని స్కూలు రోజుల్లో టీచర్లను ఏడిపించిన కళను గుర్తుకు తెచ్చుకుని పిండిమూటను జాగ్రత్తగా తలుపుమీద బ్యాలెన్స్ చేసి పెట్టడం జరిగింది.

తన ఆనవాళ్లు తుడిపేసి, ఏమీ తెలియనట్టు ఆ ప్రమాద స్థలం నుండి బయటపడి, అరగంటసేపు రోడ్డు మీద చక్కర్లు కొట్టి మూడుం పావుకి రాంపండు గదికి చేరి చూడబోతే రాంపండు లేడు. పైగా రామబ్రహ్మం మాత్రం

చి(్రుబు(్రులాడుతూ కూచున్నాడు. మూడు గంటలకు ఉండి తీరాలన్న హెడ్‌మేష్టారు మాట జవదాటగల ధైర్యం రాంపండు కెలా వచ్చిందన్న ఆశ్చర్యంతో బాటు రామ(బ్రహ్మంగారి ఒంటి మీద మైదా అవశేషాలు కూడా కనబడకపోవడం అనంత్‌ను ఆశ్చర్యపరిచింది. మంచీ, మర్యాదా లేకుండా ఆయన కూడా తనలాగే ఎడిటర్ (ప్రైవేటు ఎం(ట్రన్సులోంచి గదిలోకి దూరి ఉంటాడను కున్నాడు.

"మీరు ఆఫీసు గదిలోంచి రాలేదా?" అన్నాడు అనంత్ మాట కలుపుదామని (ప్రయత్నిస్తూ.

రామ(బ్రహ్మం చదువుతున్న పేపరులోంచి తలెత్తి చూశాడు. "మీరేదో అన్నట్టున్నారు" అన్నాడు కటువుగా. ఇక అనంత్‌కు నోరు పెగలలేదు. తనూ ఇంకో పేపరు తీసి చడామడా చదివేయడం మొదలెట్టాడు.

ఓ పావుగంట పోయాక రాంపండు విజిల్ పాట వినబడింది. కొన్ని సెకండ్లలో కనబడ్డాడు కూడా. (క్రితంసారి చూసిన రాంపండుకీ, ఈసారి చూసిన రాంపండుకీ కనబడ్డ దారుణమైన తేడా చూపి అనంత్ తెల్లబోయేడు. రామ(బ్రహ్మం కూడా. ముఖ్యంగా రాంపండు తనని పిలిచిన పిలుపు విని మరీ తెల్లబోయేడు.

"కాస్త లేటయ్యింది గురూ గారూ ఏమను కోకండి".

రామ(బ్రహ్మానికి ఒళ్లు మండిపోయింది. "కాస్తేమిట్రా రాంపండూ, నేను నిన్ను మూడు గంటలకు ముందే ఉండమన్నానా? లేదా? నాకిలాగ గంటల తరబడి వెయిట్ చేయడం అలవాటు లేదు."

రాంపండు కోపం తెచ్చుకోలేదు. "సారీ అన్నానుగా. ఇంతకీ మీకు కావల్సిందేమిటి? నిన్న పట్టుకువచ్చిన ఆర్టికల్ ఎలా వుందని అడగడానికేగా? నా సమాధానం రెడీగా ఉంది. నాకేం నచ్చలేదు. మా ప(త్రిక సరదాగా ఉండాలనుకొనేవాళ్ల కోసం పెట్టింది. ఈదురో దేవుడా అనుకునే వాళ్ల కోసం మార్చినప్పుడు కనబడం...."

"రాంపండూ, నువ్వేం మాట్లాడుతున్నావో నీకే సరిగ్గా తెలుస్తున్నట్టు లేదు. అసలలాటి ఆర్టికల్ వేసుకునే అర్హత మీ ప(త్రికకు లేకపోయినా పోనీ ఏదో శిష్యుడివి కదాని...."

"నో థాంక్స్. ఇదిగో మీ వ్యాసం. అర్హత ఉన్నచోటే ఇచ్చుకోండి. ఇక నా సలహా వినండి. ఇలాగే రాస్తూ పోతే, మీరూ కొన్నాళ్ళకి బాగా రాయగలరు. (ప్రాక్టీసు చేస్తూండండి. ప(త్రికలకు పంపుతూండండి. ఎవడైనా పొరబాటున వేసేడనుకోండి. ఇంకోటి పంపండి. తిక్కకుదురుతుంది వాడికి. తిప్పి కొట్టాడను కోండి. ఎడిటర్ని మార్చి చూడండి. రైటర్‌గా మీ భవిష్యత్తు ఎలా వుందో నేను అతి (శ్రద్ధగా గమనిస్తూంటానన్నమాట మర్చిపోకండి."

పళ్లు పటపట కొరుకుతూ రామ(బ్రహ్మం వెళ్లిపోగానే అనంత్ ఉత్సాహం పట్టలేకపోయాడు. "ఏమి(ట్రా ఇది? నీకింత ధైర్యం ఎక్కణ్నుంచి వచ్చింది? నువ్వు నువ్వేనా లేక ఏదైనా డబుల్‌రోలా?"

"అవన్నీ చెప్పే తీరికలేదు. సుమనోహరిని ఇవాళే డిన్నర్‌కి తీసుకెళుతున్నాను. తయారవ్వాలి. పెళ్లి చేసుకోడానికి ఒప్పుకుంది. కానీ పెళ్లి జూన్ తర్వాతేనట. తను రాస్తున్న పద్యకావ్యం అప్పటిదాకా పూర్తవదట. కానీ నాకు మేరేజ్ గిఫ్ట్ ఇవ్వడానికి నువ్వు అప్పటిదాకా ఆగక్కర్లేదు. ముందే ఇచ్చేసి రసీదు పుచ్చుకో."

"ఏమిటి? నువ్వు ఆ అమ్మాయితో నీ (ప్రేమ గురించి చెప్పడం.... పెళ్లి గురించి మాట్లాడ్డం... ఇవన్నీ ఎప్పుడురోయ్?"

"విపులంగా చెప్పడానికి టైము లేదు. వివరాలు కావాలంటే మీ అచలపతి నడుగు. నాతో బాటే వచ్చి రోడ్డుమీద వెయిట్ చేస్తున్నాడు. ఇక నేను (ప్రేమ గురించి చెప్పడమంటావా... తను నా మీదకు ఒంగి ఆతృతగా చూసినప్పుడు నా దగ్గరనుండి ఒకే ఒక్కమాటకై తను ఎదురుచూస్తోందని నాకు తెలిసి పోయింది. ఆ మాటే 'ఐ లవ్ యూ'! ఇంకెందుకు ఆలస్యం? అనేశా!"

"ఆగాగు. మరీ స్పీడుగా వెళ్లిపోతున్నావ్. ఆ అమ్మాయి నీ మీదకు ఒంగి ఆతృతగా చూడడమెందుకు?"

"నీకు బు(్రలేదురా. నేను నేల మీద పడివుంటే (ప్రాణం ఉందో లేదో చూడడానికి ఒంగి చూస్తారా, చూడరా? నీదో మట్టిబు(్రరా బాబూ. నీకు చెప్పడం (బ్రహ్మతరం కూడా కాదు. నా టైము వేస్టు చేయకు". రాంపండు పరుగు పెట్టుకుంటూ వెళ్ళిపోయాడు.

అనంత్ బు(్ర తిరగనారంభించింది. ఎలాగోలా మెట్లు దిగి రోడ్డు మీదకి వెళ్లే సరికి అచలపతి కనబడ్డాడు. "ఈ రాంపండు గాడు ఏడయ్యా? నిన్ను ఏదో అడగమంటాడేమిటి?" అని అడిగాడు విసుగ్గా.

"దేని గురించి అడగమన్నారు సర్? సుమనోహరి, ఆయన మనింట్లో కలుసుకున్న దృశ్యం గురించా?"

"మధ్యలో మనింట్లో కలుసుకోవడమేమిటి?"

"రాంపండు గారికి మనింట్లోనే ఏక్సిడెంటయిందని మీ పేరుతో నేను సుమనోహరిగారికి ఫోన్ చేశాను కాబట్టి సుమనోహరి గారు అక్కడికే వచ్చారు".

"వచ్చి ఏక్సిడెంటు జరగలేదని తెలిసి మండిపడి తిట్టి వుండాలే...!"

"ఏక్సిడెంటు జరక్కపోవడమేం? నేను మీ హాకీ బ్యాటు పెట్టి రాంపండు గారికి ఒక్కటిచ్చు కున్నానుగా"

జరిగినదంతా అనంత్ కళ్లక్కట్టింది. "హారినీ, ఇప్పుడర్థమయింది. నువ్వు రాంపండు బు(్రబద్దలు కొట్టి సుమనోహరిని రప్పించావన్న మాట. ఆమె ఇన్నాళ్లూ దాచుకున్న (ప్రేమ సింపతీ కారణంగా బయటపడింది. మనవాడు ఆమె (ప్రేమ గెలుచుకున్న హుషారులో రామ(బ్రహ్మాన్ని కూడా లెక్కచేయడం మానేశాడు. అంతా బాగానే ఉంది కానీ, నువ్విలా హాకీ బ్యాట్ పట్టుకుని తనను కొట్టావని రాంపండుకి తెలిస్తే....?"

"తెలియడానికి అవకాశం లేదు సర్. నేను తలుపు వెనక్కాల దాక్కుని ఆయన లోపలికి రాగానే హాకీబ్యాటుకి పని చెప్పాను.."

"సర్లే, అప్పుడు చూడకపోయినా తర్వాత తలమీద బొప్పి చూసైనా తన నెత్తిమీద ఏం పడిందని అడుగుతాడుగా?"

"అడిగారు సర్. మీ ఫ్లవర్‌వేజ్ పైనుండి పడిందని చెప్పాను".

"అది నిక్షేపంలా ఉంటే కిందపడిందని ఎలా నమ్ముతాడోయ్?"

"నమ్మరు సర్. అందుకనే సాక్ష్యం కోసం దాన్ని నేనే ముక్కలు, ముక్కలుగా విరకొట్టాల్సి వచ్చింది".

అనంత్‌కి కోపం, ఏడుపు రెండూ వచ్చాయి. చివరికి అచలపతి ఫ్లవర్‌వేజ్ విషయంలో తన మాట నెగ్గించుకున్నాడన్న మాట!

అచలపతికి వినయానికి తక్కువేమీ చేయలేదు. "సర్, మీ కళ్లు ఎ(ర్రబడుతున్నాయి. ఎండక్కాబోలు. గాగుల్స్ రాంపండు గారి గదిలో మర్చిపోయినట్టున్నారు' అని గుర్తు చేశాడు.

అనంత్ వెంటనే మెట్లకేసి పరుగెట్టాడు. హడావుడిలో '(ప్రైవేటు' గుమ్మం నుండి కాకుండా, దాని కెదురుగా ఉన్న ఆఫీసు గుమ్మం తోసి లోపలికి వెళ్లాడు.

అంతలోనే వర్షం కురిసింది. మైదా పిండి వర్షం. అనంత్ జుట్టునిండా, కళ్లనిండా, నోటినిండా, బట్టలనిండా, ఒంటినిండా ఎక్కడ చూసినా మైదాయే. నడిచే మైదా బస్తాలా ఉన్న అనంత్‌ను చూసి అప్పుడే తిరిగి వచ్చిన ఆఫీసుబాయ్ కెవ్వున కేకపెట్టాడు.

**-ఎమ్బీయస్ (ప్రసాద్**

**(పి.జి.ఉడ్‌హవుస్ రాసిన**
**"ది ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ ఆఫ్ ఓల్డ్ సిప్పీ" కథ ఆధారంగా)**

# ప్రజా హక్కులకై ధ్వజమెత్తిన గాయకుడు పాల్‌రాబ్సన్



ఈ పేరు మీరు చలం "మ్యూజింగ్స్"లో విని వుండవచ్చు. ముళ్ళపూడి వెంకటరమణ "ఇద్దరమ్మాయిలు - ముగ్గురబ్బాయిలు"లో మంద్ర గంభీరస్వరానికి ఉపమానంగా వాడగా చూసి ఉండవచ్చు. "హాసం" 5 సంచిక (డిసెంబరు 1-15, 2001)లో శివశంకరీ పాట విశ్లేషణలో కె.వి. రెడ్డి సంగీతం శక్తి గురించి పెండ్యాలకు వివరిస్తూ పాల్ రాబ్సన్ గురించి అన్నమాటలు ఉటంకించినప్పుడు (నీగ్రో సింగర్ పాల్ రాబ్సన్ పాడుతూ ఒక మ్యూజికల్ నోట్ దగ్గర తన వాయిస్‌ని సెస్టెయిన్ చేస్తే ఆ పవర్‌కి గ్లాసులు పగిలిపోయేవి) తలచుకుని ఉండవచ్చు.

## ఎవరీ పాల్ రాబ్సన్?

అసమాన ప్రతిభ గల గాయకుడు. 1930 ల నాటి బ్రాడ్వే స్టార్. హాలీవుడ్ నటుడు. అంతకుముందు అతనో లాయర్. పేరు మోసిన అథ్లెట్.

## అంతేనా?... కాదు

నీగ్రోల హక్కులకై పోరాడిన ఆఫ్రో అమెరికన్.

భారత స్వాతంత్ర్యం కోసం లండన్‌లో జవహర్‌లాల్ నెహ్రూకు మద్దతుగా ఉపన్యాసాలిచ్చి, స్పెయిన్ రిపబ్లిక్‌కై బెనిఫిట్ షోలు ఇచ్చి, జమైకాలో బ్రిటన్ సాగిస్తున్న సామ్రాజ్యవాదాన్ని నిరసించి, ఇంగ్లండులో కార్మిక ఉద్యమాలు నడిపి, తాడిత, పీడిత జనుల అండ నిలిచిన స్వేచ్ఛాప్రియుడు. అతనిలో ఈ చైతన్యానికి కారణం - తను ఎంతో ప్రాచీనమైన ఆఫ్రికన్ సంస్కృతికి వారసుడననీ, అమెరికన్ ఆధునిక వాతావరణంతో పోల్చుకుని ఆత్మన్యూనతా భావంతో బతకనక్కరలేదన్న స్పృహ కలగడం.

## ఆఫ్రికన్ వారసత్వం

అతని తండ్రి అమెరికాలో ఒక నీగ్రో బానిస. 15 వ యేట బానిసత్వంలోని రాష్ట్రాలకు దొంగతనంగా పారిపోయివచ్చి మతబోధకుడిగా మారాడు. ఉన్న ఊళ్ళోని స్కూళ్ళలో నల్లవాళ్ళకు ప్రవేశం లేదని పిల్లల్ని పరాయివూళ్ళల్లో పెట్టి చదివించాడు. పాల్ కష్టపడి చదివాడు. లాయరయ్యాడు. దరిమిలా తనలోని కళను ఎరిగి బ్రాడ్వేలో (షోబోట్ (1932) వంటి మ్యూజికల్స్‌లో), ఆ తరువాత సినిమాలలో (టేల్స్ ఆ మానహట్టన్ (1942) వంటివి) పాడి, నటించాడు. బ్రిటిష్ సినిమాలలో నటించేరోజుల్లో అతనికి తన మూలాల గురించి శ్రద్ధ పెరిగింది. లండన్ విశ్వవిద్యాలయంలో ఆఫ్రికన్ భాషల గురించి అధ్యయనం చేశాడు. వర్ణవివక్షత పాటించే అమెరికన్ నాగరికత కంటె ఆఫ్రికన్ తాత్వికత ఎంతో ఉన్నతమైనదని భావించాడు. 1934లో సోవియట్ యూనియన్ సందర్శించి అక్కడ వివక్షత లేని సమాజాన్ని అభిమానించాడు. సోషలిజాన్ని గౌరవించాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీలపై పోరాడమని మిత్రపక్షాలను ఉత్సాహపరుస్తూ "బాలాడ్ ఫర్ అమెరికన్స్" గీతాన్ని పాడాడు. యుద్ధం తర్వాత ప్రగతి వాదుల పక్షాన పౌరహక్కులకై పోరాడాడు.

## అతను చెల్లించిన మూల్యం

1948, 49 ప్రాంతాల్లో అమెరికాలో చెలరేగిన కమ్యూనిస్టు వ్యతిరేక శకంలో పాల్ రాబ్సన్ అష్టకష్టాలు పడ్డాడు. కమ్యూనిస్టు అని ముద్రవేసి ప్రభుత్వాధికారులు అతని పాస్‌పోర్టు లాక్కున్నారు. అతనిపై నిఘా పెట్టారు. బ్రాడ్వేలో, రేడియోలో, టెలివిజన్లో అతని ప్రదర్శనలు నిషేధించారు. (ఎమర్జన్సీలో కిశోర్‌కుమార్ పాటలు నిషేధించినట్లు). శ్వేతజాతి ప్రజలలో అతనిపై విద్వేషాన్ని రెచ్చగొట్టి కచ్చేరీలు జరగకుండా అల్లర్లు చేయించారు. (పోలీసులు చూస్తూ ఊరుకునేవారు). అన్నిరకాలుగా ఒక కళాకారుడి గొంతు నులిమి అతన్ని ఉక్కిరిబిక్కిరి చేశారు.

## ఒత్తిడికి లొంగని మేరునగధీరుడు

వీటన్నిటినీ అతడు ఎదర్కొన్నాడు. విచారణలో తనకు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం ఉందో లేదో చెప్పనన్నాడు. (అసలతను మెంబరే కాడు) అలా చెప్పమని అడగడం పౌరహక్కులకు భంగం కలిగించడమేనని వాదించాడు. నిజానికి అతనికి మార్క్సిజంపై అభిమానం కంటె ఆఫ్రికన్ సంస్కృతిపై గౌరవం, అమెరికాలో అణచివేయబడుతున్న ఆఫ్రో-అమెరికన్లపై ప్రేమ ఎక్కువ. తనపై విధించిన నిషేధాజ్ఞలకు వ్యతిరేకంగా కోర్టులలో పోరాడుతూనే చిన్న చిన్న చర్చిలలో పాటలు పాడుతూ వుండేవాడు. తన నాదాన్ని వినిపిస్తూ "హియర్ ఐ స్టాండ్" అనే ఆత్మకథ రచించాడు.

## గ్రహణం విడిచాక

మెక్‌కార్థీయిజమ్ తగ్గుముఖం పట్టాక 1958లో పాల్ రాబ్సన్‌కు కమర్షియల్‌గా ప్రదర్శనలు ఇచ్చేందుకు అనుమతి లభించింది. అంతే, రాబ్సన్‌లో కళాకారుడు విజృంభించాడు. యూరోప్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, సోవియట్ యూనియన్‌లు విస్తృతంగా పర్యటించి అక్కడి అభిమానుల నీరాజనాలు అందుకున్నాడు. స్టేజిపై మళ్ళీ "ఒథెల్లో" నాటకం ప్రదర్శించాడు.

## కానీ...

అమెరికన్ ప్రభుత్వం పెట్టిన హింస ఆ కళాకారుడి హృదయాన్ని గాయపరచింది. 1961లో నెర్వస్ బ్రేక్‌డౌన్‌కి గురయి ఆత్మహత్యా ప్రయత్నం చేశాడు. అనారోగ్యంతో బాధపడుతూ చివరిరోజులు గడిపాడు.

ఎంతటి ప్రతిభావ్యుత్పత్తులు కలిగిన కళాకారుడైనా ప్రభుత్వ దమననీతి నెదిరిస్తే ఎన్ని కష్టాలు ఎదుర్కొనవలసివస్తుందో పాల్ రాబ్సన్ జీవితం ఎలుగెత్తి చాటుతుంది. అతను పాడిన మంచి పాటలలో కొన్ని గుర్తు చేసుకోవడమే జయంతి సందర్భంగా అతనికి మనం సమర్పించే నివాళి-

1. ఓల్డ్‌మేన్ రివర్
2. సాంగ్ ఆఫ్ ఫ్రీడమ్
3. కోనవ్ సాంగ్
4. ఓ మై రాకింగ్ ఛేర్
5. ఐ లాంగ్ టు హియర్ యు
6. ఐ హేవ్ బీన్ టు బ్యాటిల్
7. జస్ట్ యాజ్ ది వాయిస్ ఆఫ్ థండర్
8. ఓ మై బేబీ మై కర్లీ హేర్ డు బేబి

-ఎమ్బీయస్ ప్రసాద్

భీమనేని సునీత సమర్పించు
సంపద క్రియేషన్స్ (ప్రై) లిమిటెడ్



పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'**
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## తారాగణం

దీపక్, ఛార్మి, రిమ్మీసేన్,
వైజాగ్ ప్రసాద్, రమాప్రభ, చిత్రం శ్రీను,
వినయ్‌వర్మ, అనుపమ ప్రదాన్, గౌతంరాజు,
బాలయ్య తదితరులు.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కెమెరా | : రమణ సాల్వా |
| డాన్స్ | : శ్రీధర్ రెడ్డి, రాకేష్ |
| మాటలు | : మరుధూరి రాజా |
| సంగీతం | : వలీషా బాబ్జీ, సందీప్, శేషుకుమార్ |
| పాటలు | : భాషశ్రీ |
| ఎడిటింగ్ | : గౌతంరాజు |
| డబ్బింగ్ | : ప్రసాద్ ల్యాబ్స్ |
| రీ - రికార్డింగ్ | : అన్నా ఆడియో ల్యాబ్ |
| పబ్లిసిటి | : రమేష్ వర్మ |
| ఆర్ట్ | : కుమార్ |
| పి.ఆర్.ఓ. | : రాంబాబు వర్మ |
| కో-డైరెక్టర్స్ | : నర్సింహారావు, ఆనంద్, మద్దినేని రమేష్ |
| నిర్మాత, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : భీమనేని శ్రీనివాసరావు |

నీతోడు కావాలి...



నీతోడు కావాలి...



సివి. ఆర్ట్స్




పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'**
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## తారాగణం

శ్రీకాంత్, సునీల్, గాయత్రి
బ్రహ్మానందం, ఎమ్మెస్ నారాయణ,
భరణి, ధర్మవరపు సుబ్రమణ్యం,
గౌతంరాజు, రాజు (మ్యూజిక్ డైరెక్టర్),
ఆదిత్య, గుండు హనుమంతరావు

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : చింతపల్లి రమణ |
| పాటలు | : శ్రీహర్ష, కందికొండ, భాస్కరభట్ల రవికుమార్ |
| మేకప్ | : మహేంద్ర |
| కాస్ట్యూమ్స్ | : కోటేశ్వరరావు |
| ఆర్ట్ | : చిన్నా |
| ఎడిటింగ్ | : కోలా భాస్కర్ |
| పి.ఆర్.ఓ. | : జగన్ |
| స్టిల్స్ | : రాజా |
| చీఫ్ కో డైరెక్టర్ | : ఉదయ భాస్కర్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : తాండవ కృష్ణ |
| సంగీతం | : చక్రి |
| డైరక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : శంకర్ కందేటి |
| నిర్మాత | : సి.వి. రెడ్డి |
| స్క్రీన్ ప్లే - దర్శకత్వం | : దేవీప్రసాద్ |

ఆడుతూ పాడుతూ




ఆడుతూ పాడుతూ

రచన: భాషశ్రీ **1** గానం: ఉదిత్ నారాయణ, స్వర్ణలత

షు: బాలామణి ఎంత పని చేశావే నువ్వు
ఈత ముల్లు గుచ్చి గుండె పెట్టావే చిల్లు
తాటి చెట్టు కింద తాగుతుంటే ముంత కల్లు
జొన్న చేలో నడిచి వచ్చి కలిపావే కళ్ళు...
ఆ: సుందర ఇందరి ముందర చేయకు చిందర వందర
గుట్టకింద గట్టుకాడ దారి కాచి ఉండు వస్తా
అ: పటా పటా పట్టుపట్టి నిన్ను దోచుకుంటా
నా గుండెలోన గూడు కట్టి నిన్ను దాచుకుంటా (2)॥బాలామణి॥
షు: నడుమే కదిలే గలగల ఆ నదల్లే
ఎదలో వరదలే జలజలమని పొంగించే
ఆ: ఎంకీ పాటనంటూ కమ్మగ పాడుకుంటూ
కంకీపూలపైన పిట్టల ఎగిరిపోనా
అ: కంటీ పాపవంటూ కనులో దాచుకుంటూ
చంటీ పాపనంటూ మదిపై వాలిపోనా
ఆ: పొదలో సుధలే చిలికీ వగలే పంచనా
అ: పగలే సెగలే రగిలీ కథనే పెంచనా
ఆ: అందగాడ సందెకాడ సందు చూసుకోర...
ఆ కంచెకాడ మంచమేసి పూలుజల్లుకోరా...(2) అ:॥బాలామణి॥
షు: ఎగిసే కొలనులో కొరమేనును తెప్పించి
అదిరే పులుపుతో వలపేనే వడ్డిస్తా
అ: కురిసే వానలోన చినుకైపోయినట్టు
తనువే తాకినేను చీరై చుట్టుకోనా...
ఆ: మెరిసే బుగ్గలోని విరిసే సిగ్గులన్నీ పరిచా
ఆకుమీద జోడుగ నంచుకోరా
అ: మిథునం మథనం కలిసి జరిపే సంబరం
ఆ: అధరం అధరం వణికి మరిచే అంబరం
అ: కీచుకీచు పెట్టా నిను గంపకింద పెట్టా సందుచూసి
ముద్దు మీద ముద్దు పంచిపెట్టా (2) ॥బాలామణి॥

**2** గానం: హరిహరన్, ఉష

షు: గీతం సంగీతం చెలి పెదవుల సరిగమలో
ఆ: నిత్యం సాంగత్యం ప్రియ తనువుల మధురిమలో
అ: శతమానం అంటూ ప్రియహారం వేయనా
ఆ: సహకారం అంటూ మమకారం పంచనా
అ: ప్రణమామి అంటూ ప్రాణమివ్వనా... ॥గీతం॥

1 **నీతోడు కావాలి...**

రచన:శ్రీహర్ష **1** గానం: రవివర్మ

కో: శరభ... శరశరభ... శరభ... శరశరభ తుర్ర... తుర్ర... హే... హే...
తుర్ర... తుర్ర... హే... హే... తుర్ర... తుర్ర... హే... హే...
ప: ఆడుతూ... పాడుతూ... హే ఆడుతూ... పాడుతూ పరుగెత్తే జీవనం
సాగినా ఆగినా శివమెత్తే వాహనం...
గాల్లో... ఎగిరే ఫ్లయింగ్ సాసరేమో
వామ్మో... బస్సై దిగివచ్చే నిలిచినేమో
మోటర్ ఫీల్డ్ హిస్టరీకే సీక్రెట్.. దీని మిస్టరీ
బ్రహ్మా అలిసే దీన్ని చేసి అమ్మో బ్రహ్మా రాక్షసి హే...
ఆడుతూ... పాడుతూ... పరుగెత్తే జీవనం,
సాగినా ఆగినా శివమెత్తే వాహనం కో: హేయోరే.. హేయోరే.. హేహే..
చ: ముషర్రఫే దీనిపై ఎక్కితే చూడు... జన్మలో ఇండియా జోలికేరాడు
ఏడు వండర్స్ అయినా వేస్టే లేరా తన చెంత...
మూడో వరల్డ్‌వార్ తప్పదు కదరా తన చేత
ఎడ్లబండికి అక్కల్లే ఉంది చూడు...
ట్రాక్టరమ్మకి చెల్లెల్లా దీని వీర స్పీడు
టాక్ ఆఫ్ టౌన్ అయే కదరా టేక్ ఆఫ్ తీరు చూడరా
నాన్‌స్టాఫ్ నవ్వుతోటి కదరా హేట్సాఫ్ చెప్పి వేయరా ॥ఆడుతూ॥
చ: కష్టమే ఎప్పుడూ నష్టమేకాదు జీవితం మీద ఈ ఇష్టమే పోదు
లోకమంతా చూస్తే బాధలబందీ
ఎవరైనా మూతే ముడుచుకుంటే బాదరబందీ వదిలేనా
బతుకు బాటలో మనబాట మనమే వేస్తే
మాటమంతితో ఆ బాట ఆటపాట చేస్తే
స్వర్గం దించి వేయవచ్చు నడిచే నేలపైనిక
సర్వం కాళ్ల వరకూ వచ్చు బతుకే గొప్ప కానుక... ॥ఆడుతూ॥

రచన: కందికొండ **2** గానం: హరిహరన్, కౌసల్య

షు: నీలినీలి ముత్యమల్లె కనిపిస్తున్నావు
నింగిలోని జాబిలల్లె మురిపిస్తున్నావు ॥నీలినీలి॥

1 **ఆడుతూ.. పాడుతూ..**

రచన: భాషశ్రీ

అప్పటి నుండీ రోటీ మానేశాను... పంజాబే వదిలేసి వచ్చేశాను...
ఆంధ్రాలో గోంగూర చూసేసాను..
ఆవకాయ నంజుకొనుట షురూచేసాను
ఆ: అందుకనే గోంగూర కరువాయెను...
మామిడికాయ రేటు పెరిగి దురువాయెను... (2) ॥పాతికేళ్ల॥
అ: పాతికేళ్ల కిందటి మాట.. పాకిస్తాను బార్డర్‌లోన...
ఏ.కె.47 ఏ పట్టి... చెడుగుడు ఆటే ఆడుతూ ఉంటే
కాలికి పక్కన బాంబుపేలి... మెడికల్‌గా అన్‌ఫిట్టే అయ్యారో...
పట్టిన పట్టే వీడనంటూ... ప్రాణం లెక్కే చేయనంటూ...
శత్రువు దడదడలాడిపోయి వణుకే తట్టి బెణుకే పుట్టి...
తోకలు ముడుచుకుపోయే వరకు...
నిదురేపోనని శపథం చేశారో...
ఎన్ని తరాలైన పోరు ఆపను అంటూ
చేశాను అల్లుడినే లెఫ్టినెంటూ...
మిల్‌టరీకి ఇంతటితో సేవలాపను...
వారసుడిగా మనవణ్ణీ పంపిస్తాను...
ఆ: దేశం దేశం అంటూ అల్లుడక్కడా...
వారసుడేం పుడతాడు నీకు ఇక్కడా? (2) ॥పాతికేళ్ల॥
అ: పాతికేళ్ల కిందటిమాట... పాలకొల్లు మండలాన...
రావిచెట్టు సందులోన... అరుగుల వారి ఇంటిలోన...
బొరుగులు తినే గుమ్మను చూసి...
చిలిపి కృష్ణుడు చిటికెలు వేసెనురో...
ఆ చిటికెలు వేసిన పాండుగారు...
వరుసకు మా తాతగారు... ప్రేమనగరూ ఏ.ఎన్.ఆర్...
ఎవ్వర్‌గ్రీను ఎన్.టి.ఆర్... మీసం పండిన హీరోగారు...
వీరికి ఎవరూ సాటిలేరండోయ్...
అ: ఈస్ట్‌మన్ కలర్ నాటి మా స్టోరీలు...
చెప్పేందుకు మీ చెంతన ఎన్నో ఉన్నయ్
చేతనైతే మీరూ చేసీ చూపండీ
లవ్‌చేసి గిన్నిస్ బుక్‌లో ఎక్కండీ...
ఆ: మీ స్టోరీ చదివినాక బొంబాయోళ్ళు...
దిల్‌వాలే దుల్‌హనియా మరచిపోవాలి
మునిగి పోయినా టైటానిక్కే మళ్ళీ...
మీ లవ్ చూసి తేలుకుంటూ గంతులేయాలి... అ: ॥మీ స్టోరీ॥

**8** గానం: వలీషా బాబ్జి

ప: శ్వాసల్లో శ్వాసల్లే ఆశల్లో ఆశల్లే
నీడల్లే తోడల్లే నాగుండె జోరల్లే
ఓ చెలీ నిన్ననేను నాకు సొంతమనుకున్నాను
వసంతమై నడుచుకుంటూ నీవు వస్తుంటే
సాగరాన ఎగిసే అలవై దోబూచులాడేవు
కడలికి కన్నీటిని తరలించీ... దప్పిక నా మనసుకు మిగిలించీ
ఓ ప్రియా నా ప్రియా నను విడిచీ పోయావే
నీ గమ్యం నీదంటూ ఎదగాయం చేశావే ॥ఓ ప్రియా॥
చ: వాలిపోయినా పొద్దులో ఓ దీపమల్లే వెలిగి
రాలిపోయిన ఆశలన్నీ రేపిపోయినావే
పూయలేని ఓ పూలకొమ్మకు జీవమంటూపోసి
ప్రాణమిచ్చి ఆ చిట్టిరెమ్మకు ధ్యాసమయ్యినావే
బ్రతుకే పచ్చతోరణములా ప్రేమసాగరములా
మార్చివేసి నను విడిచిపోయినావే
నీడలా నడిచిరావాలని... నాకు నీతోడు కావాలని (2)
అనుకుంటే ఓ ప్రియా నను విడిచిపోయావే...
నీ గమ్యం నీదంటూ ఎదగాయం చేశావే ॥ఓ ప్రియా॥
చ: రాతికైనా నేర్పించుకుంటే మాట పలుకుతుందే
కాటినైనా బతిమాలుకుంటే మంటలార్పుతుందే
ఏ నాటికైన సరిదిద్దుకుంటే రాత మారుతుందే
ప్రేమలోన పడపోయినాకే మనసు మారుతుందే
మనసే చంపుకోని నేను మరిచిపోయి నిన్ను
అడుగుతీసి అడుగేసి కదులుతుంటే
దూరమని నేను వెళ్తూవుంటే... (2)
దగ్గరకు మనసు లాగుతుంటే
ఓ ప్రియా నా ప్రియా నను విడిచిపోయావే...
నీ గమ్యం నీదంటూ ఎదగాయం చేశావే ॥ఓ ప్రియా॥



6 **నీ తోడు కావాలి**

రచన: భాషశ్రీ

కడ వరకు తోడై నే నుండిపోనా
అ: చిత్రమల్లే మెరిసి పోయి స్వప్నమయ్యేవెలా ॥కలలో॥
చ॥ ఆ దేవుడొచ్చి నన్ను వరమంటూ కోరమంటే
ఏ జన్మకైనా నేను నీతోడు కోరుకుంటా
ఆ: మరుజన్మ వరకు నేను నిను వీడి ఉండలేను
మరణించి కూడ నీకై మరురూపు దాల్చినాను
అ: కనిపించే రూపం కదలాడుతుంటే
గుర్తించని మనసే వేటాడుతుంది
ఆ: కలల తీరం పక్కనుందీ ఎందుకీ కలవరం ॥కలలో॥

**7** గానం: రవివర్మ, లెనీనా చౌదరి

అ: పాతికేళ్ళ కిందటిమాట... రాజమండ్రి రేవుకాడ...
నీళ్ళకుండ నెత్తినపెట్టి కోమలాంగి పోతూవుంటే...
సూటూ బూటూ వేసుకున్నా... కుర్రాడొకడు చూశాడంటరో...
కళ్ళూ-కళ్ళూ కలిపేశాడు... మనసే ఆమెకు ఇచ్చేశాడు...
పెళ్ళికి సిద్ధం అయ్యేరోజు కొరకొర మీసపు ముసలోడొచ్చీ...
ఖంఠములో నాప్రాణము ఉండగ... పెళ్ళే జరగనివ్వను
అన్నాడూ... ఆ సూటూ బూటు కుర్రాణ్ణి నేనేనయ్యా...
కోర మీసాలోడు బాసు భట్టాచార్య తాను
అచ్చంగా నన్నుగన్న మా నాన్నెయ్యా...
ఏజ్ వన్‌నాట్ సెవెన్ నాటౌటైయ్యా...
ఆ: ఆ ఖంఠములో ప్రాణమింక పోయేదెపుడో...
నన్ను నువ్వు పెళ్ళాడీ తీరేదెపుడో... ॥పాతికేళ్ళ॥
అ: పాతికేళ్ళ కిందటిమాట... లూధియాన గల్లీలోన...
పగడాబన్‌కే ఏక్‌ముండా గూటీ బిళ్ళ ఆడుతూ ఉంటే...
లచక్ లచక్‌తీ ఏక్ కుడియా... మటికా పట్టి ఎదురుగ
పోయెనురో... లకడీ తోటి బిళ్ళను కొడితే...
దిల్‌కా మటకా పగిలిపోయి... ఇద్దరు ఒకటై పోయినాక
లంచ్‌లోన కుడియా నాతో... దాల్ తడ్‌కా రోటీ తింటూ...
సడన్‌గా స్వర్గానికే పోయెనురో...



రచన: భాషశ్రీ

చ॥ ఓ చెలియా ఇది నిజమా నీ పలుకే పరవశమా
ఆ: నిజమెరుగనులే సొంతం... నినుగని ఇక నిరంతం...
మదిలయలకు వసంతం కలిగే
అ: ఎంత ఎంత దూరం... అందాల ప్రేమ తీరం అంటూ
చెప్పవోయి ప్రాయం నీ ప్రేమ స్థావరం
ఆ: ఉంది కొంత దూరం దాయాలి అంతవరకూ
మీరు గుండెలోని భారం... అంటుంది పావురం
అ: నిను చూసే మదిరాసే కొత్త కావ్యము
ఆ: నిను చేరే ఎద హాయె ఎంత భాగ్యము
అ: గగనాలే నీవై భువనాలే మరువనా
ఆ: జవరాలే నేనై పరువాలే పంచనా
అ: నీచెంత ఎంత హాయిలే ప్రియా ॥గీతం॥
చ॥ ఈ హృదయం అతి సృజనం నీ శృతిలో ప్రతి నిమిషం
అ: శశి పరువపు అజంతం... పిలిచెనులే ఆ చెంతం...
కసి పెదవులే నా సొంతం... చేసే
ఆ: నిన్నలేని భావం నిన్ను చూసి నాకే నాలో
గుండెలోన చేరి గోల చేసెనా...
అ: నింగినున్న స్వర్గం పంచిన్నావు నేలమీద
ఎన్ని జన్మలైన నిన్ను వీడనే
ఆ: నీ సాయం నీ ప్రాయం నాకు అవసరం
అ: ఓ నేస్తం నీకోసం నేను అంకితం
ఆ: నా వలపే నీదై బహుమానం ఇవ్వగా
అ: నా తలపే నీదై పరిహారం కట్టగా
ఆ: ఈ జన్మకింత చాలులే ప్రియా ॥గీతం॥

**3** గానం: సునిధీ చౌహాన్

ప: జానేభీదో జానేభీదో మేరేయారో...
ఆనేవాలా కల్‌తోహై సాథ్‌యారో
కల్‌గయా... ఢల్‌గయా ఏక్‌అప్‌నా...
బన్‌కే ఢిఖాగయా కల్‌కా సప్‌నా...
జీవితానికి రోజులురా నాలుగంటే నాలుగురా
నిన్న నేటికి సాక్ష్యమురా రేపు మనకిక లక్ష్యమురా
లైఫే ఛాలెంజ్ అనుకొని ॥జానేభీదో॥
చ: మబ్బుచాటు ఉరిమే ఆ మెరుపులోని వెలుగే



హాస్యం హాయి రసమంట
కోపం ఎంతటి రభసంట
రవ్వంతైనా చాలంట
నవ్వే నవరత్నాలంట ॥నవ్వవె॥
కో: హో... హో... హో...
ఈ బతుకే చిన్నది భామా
అది నవ్వుకె చాలదు లేమ్మా
ఇక బాధకు చోటూ ఎక్కడ ఉందమ్మా
శతమానం మానవజన్మ బహుమానం నవ్వేనమ్మా
అభిమానం చూపి ఇచ్చెను ఆ బ్రహ్మ
గలగలా మాటాడితే ఏ దిగులూ రాదమ్మా
గంగలా ఉప్పొంగితే ఏ బెంగా లేదమ్మా
కను సన్నలలో ఆ స్వర్గాలే
కదలాడును లేవమ్మా
రాజీ అన్నది లేదంట రాత్రి పగలు ఒకటంటూ
జాబిలి సూర్యుడు మనజంట
ఇంకా ఎదురే ఎవరంటూ ॥నవ్వవె॥
ఆ: ఈ జగమూ అంతా మంచి అందరిపై నమ్మకముంచీ
అడుగేస్తే చాలూ ఆశే వెలిగించీ
అ: బతుకంటే ఓ దోబూచీ భయపడితే అదిగో బూచి
ఉల్లాసం వుంటే ఉండదు ఏ పేచీ
అ: సాగనీ ఆ సాగరం మనపాదం వెనువెంటా
అందనీ ఆకాశమే మనవేదం గెలుపంటా
ఈ లోకాన్నే ఇక ఏకంగా ఏలేద్దాం రమ్మంట
ఆ: రేపటి రోజిక మనదేగా
రేగే ఆశలు మనవేగా
ఆశావాదం మనదమ్మా ఆశాజీవే మనిషమ్మా ॥నవ్వవె॥



ఆ: నీతోనె సహవాసం చేస్తాలే జన్మాంతం
పెదవుల్లో దరహాసం దాచాలే నీకోసం
అ: నన్ను వుండనివ్వు సఖి నీ ఒడిలో
నీ మనసే సుజలాం, సుఫలాం
ఆ: నీ చిరుచిరు నవ్వుల జడిలో
నా బ్రతుకే సుఖదాం, వరదాం ॥నీలినీలి॥
చ॥ సూర్యుడాగిపోతే కాలం పరుగు నిలిచిపోదా
నువ్వు లేకపోతే గుండెల సవ్వడాగిపోదా
అ: అలలులేని సాగరం వుండబోదులే
నువ్వులేని నేను కూడా నిజము కాదులే
ఆ: నువ్వు నడిచే రహదారులలో
నే అభిసారికనై నిలిచా
అ: నువ్వు కట్టుకున్న కాలి అందె సడితో ॥నీలినీలి॥
నేను ఏకమై పాటనై పోయా
చ॥ కోకిలమ్మ పలుకు ఆమని రాకకోసమేగా
కోమలాంగి పరుగు నీ చెలిమి కోసమేగా
అ: ఒక్కసారి తాకిపో నీలిమేఘమా
చందనాలు చిందిపో చంద్ర కిరణమా
ఆ: కన్ను మూయకుండ నిన్న కన్న కలలో
ముద్దు పెట్టుకుంది నన్నునీ రూపం
అ: నా ఆశల జీవన నదిలో
చెలి నువ్వే చలనం గమనం
అ: నీలినీలి ముత్యమల్లె కనిపిస్తున్నావు (2)
ఆ: నింగిలోని జాబిలల్లె మురిపిస్తున్నావు (2)
అ: నీతోనే సహవాసం చేస్తాలే జన్మాంతం
ఆ: పెదవుల్లో దరహాసం దాచాలే నీకోసం అ: ॥నీలినీలి॥

రచన: రవికుమార్ **3** గానం: టిప్పు, డా॥ మూర్తి.

ప: రుకిమిణి నడుము భలే ఊగుతున్నాదే
అ: బంగారి రుకిమిణి సింగారి రుకిమిణి
వయ్యారి రుకిమిణి సయ్యాటలాడుదామా (2)
రుకిమిణి రుకిమిణి రుకిమిణి (2) ॥రుకిమిణి॥
మనసే తూగుతున్నాదే... వయసే రేగుతున్నాదే

రచన: భాషశ్రీ

మురిపించి మాయమైనా కన్నుల్లో నిలిచిపోదా...
ఆకాశంలోనే కదిలే కోటి తారలున్నా...
ఆ రాలే ఉలకలవైపుకు మనసులాగిపోదా...
అలరించే అందాలన్ని క్షణికమైనవే అయినా మనకు
చిరకాలం దాని వెలుగులో నడిచిపోరా నువ్వు...
యు విల్... గైన్ ఇట్... చలో చలో ॥జానేభీదో॥
చ: కంటిలోనే నిత్యం... కదలాడు కొంటె స్వప్నం
సాధించి చూడు సత్యం కాగలదులేరా ముత్యం
ఆ సాగరతీరంలోని ఇసుక గూడులన్నీ
నిలవాలి ఆశల గూటిలో రాతిమేడలౌతూ...
చెయ్ జారిందేదో అంటూ బాధపడుట మార్చేసి ట్రెండు
గడిచిందే రేపటి కొరకు స్ఫూర్తిచేయి ఫ్రెండు
షూట్ ఇట్... ఛేజ్ ఇట్... చలో చలో
ప: జానేభీదో జానేభీదో మేరేయారో...
ఆనేవాలా కల్‌తోహై సాథ్‌యారో
కల్‌గయా... ఢల్‌గయా ఏక్ అప్‌నా...
బన్‌కే ఖఖాగయా కల్‌గా సప్‌నా... ॥జానేభీదో॥
లైక్ ఎ డైమండ్ ఇన్ ది స్కై యే హమారా జీవన్‌హై
వాట్ యు లూజ్ ఈజ్ నాట్ సో హై
హౌ టు రీచ్ ఇట్ దేఖో భాయి
షూట్ ఇట్... ఛేజ్ ఇట్... చలో చలో

**4** గానం: వలీషా బాబ్జీ

ప: అందాలకోన కోనంచుల్లో చేన ఆ చేనులోన
ఓ గుండెకూన గళమే విప్పెనుసోనా ఓ రాగమైనా
పలికే ఆ రాగము భావము జగమే మెచ్చినదోయి
యుగమే ఏ రూపుగ మారిన నిజమై నిలచెను రేయి
మదిలో ఆకాంక్షను పెట్టి కృషినే తోడుగ చేయి
కలిగే ఆ రోజును చూడర రాజువు నీవే భాయి ॥అందాల॥
చ: కృషి వుంటే మనిషైనా ఋషులౌదురే అంటూ
అన్నాడో కవిబ్రహ్మ నాడు
ఈ కాంక్షే కలిగిందో గుండెల్లోనే రోజు
నీకంటూ ఎదురేది నేడు
సాధ్యం కాదన్నది ఏదీ భువిలోనే లేదను సత్యము



రచన: భాషశ్రీ

కూసంత నడుమే కడితే దివినైన తాకుట తథ్యము
నీపై నీ నమ్మకాలే నిన్ను నడిపించు కడవరకు... ॥అందాల॥
చ: నాకంటూ ఓ రోజు ఉందంటు ఓ నేస్తం సాగించు నీ జీవ ప్రాయం
నీలోను కొలువున్న కొండంత ఆ ఆశే సాధించి పెట్టేనే గమ్యం
నీ ఓటమి నీ విజయమునకు తొలిమెట్టై నిలువక మానదు
చెయ్‌జారిన ఆ అనుభవమే గెలిపించి వదలక మానదు
ఏ గ్రహణమేమి నిన్ను వంచదు గుండెల్లో దమ్ముంటే ॥అందాల॥

**5** గానం: వలీషా బాబ్జీ, హరిణి/సునీత

నీతోడు కావాలి... నీతోడు కావాలి... నీతోడు కావాలి... నీతోడు కావాలి...
నిను చూసి నాకు తెలిసెలే... సంతోషం అంటె ఏమిటో
నీ నవ్వుల చిలిపి వెలుగులో... నా బ్రతుకును నడపడానికి॥నీతోడు॥
నిను కలిసి నాకు తెలిసెలే... బ్రతుకన్నది తీపి బాటని
నీవుంటే కాలమే తెలియదని
ఆ విలువే మనసుకు పంచుటకు ॥నీతోడు॥
వీచే గాలై నన్ను చేరుకొని నీవు
శ్వాసనిచ్చి ప్రాణమల్లే మారిన చెలియా నాకు ॥నీతోడు॥
ఒకటీ ఒకటీ రెండు కాదు అని నాలో నువ్వు వేరు కాదు అని
నన్నే నీలో కలుపుకొనుటకు... ఓ నేస్తమా నీకై ఎపుడూ వేయి కళ్లతో
ఎదురు చూపులో ఉండగలనని మాటే ఇచ్చి
చెంత నిలుచుటకు...నా ప్రాణమా... ॥నీతోడు॥

**6** గానం: రవివర్మ, లెనీనా చౌదరి

షల: కలలో కల నే కన్నాను... ఆ కలలో నిను కనుగొన్నానే (2)
కలను వదిలి కనబడవే కానుకగా
కలలు గన్న నా మనసుకు చేరువగా
కలలు కన్నాననీ కలను మిగిలించకు ఇలకు చేరాలని నా కలను
కరిగించకు కలతపెట్టే కలను వదిలి ఇలకు చేరే చెలి(2)॥కలలో॥
చఆ: చిలిపి పెదవిపైన చిరునవ్వు చిందనిస్తే
చిరుజల్లు కురిపిసేను చితనుండి లేచిరానా
అ: కనుకాటుకల్లే నన్ను కరుణించి రాసుకుంటే
కనుపాప లాగా నీతో కలకాలముండి పోనా
ఆ: నీ తీయని పలుకే నను కోరుకుంటే



ఆడాలే ఆడ మయూరం చూడాలే ఈడు యవారం
చేసేద్దాం దుమ్ము దుమారం ॥ఆడాలే॥
చ: చిలకా రాచిలకా ఎడాపెడా చలేగా
థినకా తద్ధినకా హడావిడీ ఇదేగా కో: ఓలలా హో.. ఓలలా హో..
గిలిగా గిలిగిలిగా జిగేలంది ఇలాగా
సడిగా సందడిగా సవాలంటె సరేగా
చూశా తెగచూశా నీ సోకు వెన్నపూసా
చెంగూ చెవిలింగూ చెలరేగుతుంటె తమాషా
బాగుందే ఇందరజాలం
గుండెల్లో గందరగోళం
తీయాలే సిగ్గులతాళం
వెయ్యాలే ముద్దులగాలం... ॥రుకిమిణి॥
కో: హొయ్యా... హొయ్యా... హువ్వారే
చ: జనకా జజ్జనకా జమాయిస్త యమాగా
తళుకా తప్పదికా సతాయిస్తె ఎలాగా
కులుకే వున్నదిగా కొరుక్కునీ తినేలా
కునుకే రాదు కదా ఊరిస్తే ఇలాగా
రంగా శ్రీరంగా చిందేయి సుబ్బరంగా
సంగా సారంగా సాగాలి పెంకితనంగా
వాటంగా వుందె వయారం
ఏకంగా పడుచు పలారం
నీకేమో సొంపులు భారం
నీ చెంపే కెంపుల హారం... ॥రుకిమిణి॥

రచన: భువనచంద్ర **4** గానం: మనో, కోరస్

షల: చమకు చమకు చమకు చమకు
చమకు చమా తళుకు తళుకు
తారొచ్చి ఇలా జారొచ్చి
కన్ను కలిపేసి ఆడింది యారో



నన్నంది ఎవర్‌గ్రీన్ హీరో
డైట్ కోక్ యాడ్ మీది బొమ్మలాగ
సోకు చూపి కాటువేసె కందిరీగ
ఆ: వరల్డ్ కప్ మ్యాచ్‌లోని వైడ్ బాలులా
సైడు సైడుకెళ్లిపోతే ఎలా పిల్లడా
అ: స్పీడు ఇంక పెంచమాకె టాటా సియూరా
సోకులన్ని దోచి నిన్ను చేస్త సహారా ॥చమకు॥
చఅ: ఎఫ్ చానల్ పోరిలాగ ఫోజెందుకె
నీ నవ్వెచాలు ఎక్స్‌ట్రాలెందుకె
ఆ: నా ఫీలు నీకు మ్యాపు గీసెందుకె
ఈ స్పీడు నీకు డ్యాష్ కొట్టేందుకె
అ: దూకుడాపకుంటె నిను క్లీన్ బోల్డ్ చేస్త
ఆ: నువ్వు బౌలరైతే నే మిడిల్ స్టంప్‌నవుతా
అ: అమ్మో నా సఫారి ఓ స్వీటు సుపారి
తేల్చుకుందాం రావెమరి చెలోచెలి అనార్కలి ॥చమకు॥
చఆ: ఈడు విజిల్ వేస్తోంది తోడుకావాలి
నీలాంటి వాడితోటె ఆడుకోవాలి
అ: తేనెతుట్టె లాంటి వాణ్ణె తుంటరి బుల్లి
కదిపాక ఆగలేనె ఆపై మళ్లీ
ఆ: అందుకనే ఇచ్చా నా గుండెలోకి వీసా
అ: నోకియా సెల్ పీసా నచ్చావె మోనాలీసా
చిందేద్దాం ఈ వేళా భూగోళం ఊగేలా
ఆడుకుందాం రావె ఇక కథాకళి నీలాంబరి... ॥చమకు॥

రచన: శ్రీహర్ష **5** గానం: ప్రమోద్ బబ్లూ, విశ్వ, సంతోషిని

ప: నవ్వవె చిలకమ్మా పున్నమి వెన్నెల ఇవ్వమ్మా
నేస్తం నువ్వమ్మా జాజుల మల్లెల జల్లమ్మా ॥నవ్వవె॥
నవ్వింతలే నూరింతలై చిరునవ్వులు రువ్వాల
కవ్వింతలే కేరింతలై నీ కోపం తీరాల

జస్ట్ ఫర్ ఫన్

# అద్గదీ... సద్గతి...!

——— **A story with 'different' claimax**

త్రిపురనేని మహారథి గారబ్బాయి దర్శకుడిగా తీసే సినిమా ప్రారంభోత్సవం రికార్డింగ్ సందర్భంగా జరిగిన ప్రెస్‌మీట్ ముగిశాక - కొందరు ఫిలిం జర్నలిస్టులు సరదాగా 'మహతి రికార్డింగ్ స్టూడియో' బైట చెట్టునీడన పిచ్చాపాటీ కబుర్లలో పడ్డారు. అక్కడున్నవారిలో 'చిత్రం' పత్రిక ఎడిటర్ బాబూరావు, 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' చీఫ్ సబ్ ఎడిటర్ యస్.యస్. శివకుమార్, 'నంబర్‌వన్' పత్రిక రిపోర్టర్ నారాయణరాజు, 'ఆంధ్రభూమి' దినపత్రిక రిపోర్టర్ నారాయణ, 'తెలుగు పత్రిక' సీనియర్ రిపోర్టర్ వెంకట్రావ్ అందరూ ఉన్నారు. తెలుగు సినిమా కథల తీరు తెన్నులపై చర్చ మొదలైంది.

"నాదగ్గర ఓ అద్భుతమైన కథ ఉంది. ఆ కథలో అన్ని యాస్పెక్ట్‌లూ కవరవుతాయి. క్లయిమాక్స్ కూడా ఎవ్వరూ ఊహించలేని విధంగా ఉంటుంది. కావాలంటే మన నారాయణని అడగండి" అన్నాడు శివకుమార్.



"అవును. నేను ఆంధ్రప్రభలో వర్క్ చేసే రోజుల్లో చెప్పేవాడీ కథని. చాలా సరదాగా ఉంటుంది... వినండి, వినండి" అంటూ సర్దుకుని శివకుమార్ సిద్ధపడ్డాడు అని నారాయణ.

"చెప్పుమరి... ఆలస్యం దేనికి!? అడ్వాన్స్ ఇచ్చి హోటల్లో రూమ్ బుక్ చేస్తేగాని చెప్పవా!?" అన్నాడు నారాయణరాజు.

"సరే వినండి. హీరోయిన్ గ్లామరస్‌గా ఉంటుంది. భక్తి ఎక్కువ. చిన్నప్పట్నించీ పుట్టలో పాలుపోసి పాటలుపాడుతూ ఉంటుంది. దాన్తో ఉమెన్ యాస్పెక్ట్, పెద్దవాళ్ళ యాస్పెక్ట్ - రెండూ కవరవుతాయి. పక్కింటి కుర్రాడేకదా అని ఓ నికృష్టుడుతో పెళ్ళిచేస్తారు తల్లిదండ్రులు."

"నికృష్టుడితో తెలిసి తెలిసి ఎలా పెళ్ళి చేస్తారయ్యా?" అడిగాడు వెంకట్రావ్.

"ఉండండి సార్... నన్ను చెప్పనివ్వండి... వాడు నికృష్టుడని వాళ్ళకి తెలియదు. మనకు తెలుస్తూ ఉంటుంది. ఎలాగంటే కృష్ణుడి లెవెల్లో అమ్మాయిల్ని వెంటేసుకుని స్టెప్పుల డ్యూయెట్లు పాడుతూ ఉంటాడు..."

"ఎందుకూ... కృష్ణుడు, నికృష్టుడు అనే ప్రాస కలవటం కోసమా?" అని అడిగారు బాబూరావు

"అది కాద్సార్... అదంతా యూత్‌కోసం... అలా యూత్‌ని కవర్ చేస్తాం అన్నమాట"

"ఎంత యూత్ అయితేమాత్రం అలా అమ్మాయిల్తో తిరిగితే రోగాలంటుకుని చావడా...!?" అన్నాడు నారాయణరాజు.

"రోగాలంటుకోవడం, చావడం రెండూ జరిగాయి. దాన్తో... వాడిశవాన్ని పుట్టముందేసుకుని 'ఓ నాగదేవా... నా పతిని బ్రతికించలేవా' అని పాడుతుంది హీరోయిన్. అక్కడ సెంటిమెంట్ పార్టు వర్కవుట్ అవుతుంది."

"అవార్డు యాస్పెక్ట్ చెప్పావ్ కాదు...!?" అన్నాడు నారాయణ.

"ఆ పాయింట్‌కే కదా వస్తున్నా...!? అలా ఆ హీరోయిన్ పాడగానే పుట్టలోంచి పాము వచ్చి - 'పిచ్చిదానా... అసలు పాములు మనిషిని బ్రతికించటం అన్నది సినిమాల్లోనే తప్ప బైట ఎక్కడైనా చూశావా... నీకు భక్తి తప్ప బుర్ర లేనట్టుందే' అని అంటుంది..."

"పాములు మాట్లాడ్డం... అదీ మనకర్థమయ్యే తెలుగులో మాట్లాడ్డం... ఫాంటసీ యాస్పెక్టా...?" అన్నాడు నారాయణరాజు.

"నువ్వలా అనుకుంటే నాకభ్యంతరం లేదు గానీ అక్కడ మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా, హేతువాదానికి అనుగుణంగా డైలాగులు వేస్తాం కాబట్టి ప్రజా ప్రయోజనాల దృష్ట్యా అది అవార్డు యాస్పెక్ట్..." అన్నాడు శివకుమార్.

"క్లయిమాక్స్ ఊహించని విధంగా ఉంటుందన్నావు కదయ్యా అది ఇదేనా?" అడిగారు బాబూరావు.

"అబ్బే... ఇది జస్ట్ ప్రీ క్లయిమాక్స్... అసలు క్లయిమాక్స్ వేరే ఉంది."

"సస్పెన్స్‌తో చంపక త్వరగా చెప్పవయ్యా" అన్నాడు వెంకట్రావ్

"అప్పుడు హీరోయిన్ 'అంతేనా... అయితే నేను నా పతితో కలిసుండే మార్గమే లేదంటావా...!?' అని అంటుంది. 'అలా అన్నావ్ బావుంది... నీ పతిని బ్రతికించలేనన్నాను గాని నిన్ను అతని దగ్గరికి చేర్చలేనన్నానా... ఇద్దరూ కలిసుండండి...!' అంటూ 'ఫట్' మని కాటువేసి పోతుందా పాము... అదీ క్లయిమాక్స్" అంటూ ముగించాడు శివకుమార్.

**-రాజా**

## బొమ్మలాట





Ramakrishna

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్



# కంఠాభరణం

- పానుగంటి

**కీ॥ శే॥ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సాక్షి వ్యాసాలేగాక ఒక చక్కని అధిక్షేపాత్మక నాటకం గూడా రాశారు. దానిపేరు 'కంఠాభరణం'**

ఈ కంఠాభరణాలు తెలుగు, సంస్కృత నాటకాల్లో చాలా 'డ్రామా'లకు మూలం అయ్యాయి. 'మృచ్ఛకటికం' సంస్కృత నాటకంలో కథ అంతా ఓ 'నగ'లమూట చుట్టూ తిరుగుతుంది. అలాగే గురజాడ వారి కన్యాశుల్కంలోనూ మధురవాణి 'కంటె' కథ అంతా నడిపిస్తుంది.

'కంఠాభరణం' నాటకంలోనూ అంతే! ఈ నాటకం ద్వారా పానుగంటి వారు ఆనాటి బ్రాహ్మణ కుటుంబాలు కొన్నింటిలో వుండే వేశ్యాలంపటత్వం, విచక్షణారహిత ఆచార పరాయణత్వం - అలాగే, ఆనాటి సమాజంలో భాగమై పోయిన లంచగొండితనం, దొంగసాక్ష్యాలు - ఇలాంటి దురాచారాల్ని ఎత్తిచూపినా, ప్రధానంగా ఆయన యీ నాటకంలో హాస్య సృష్టిపైనే ఎక్కువ దృష్టి పెట్టారు.

హాస్యాన్ని రెండు రకాలుగా సాధించవచ్చు. ఒకటి భాషాపరంగా, రెండు సన్నివేశపరంగా పానుగంటి వారు ఈ నాటకంలో రెండు రకాల హాస్యాలనీ అందించారు.

ఇందులో ప్రధాన కథ యిది. సోమావధానులనే చాదస్తపు బ్రాహ్మడు తన కుటుంబంతో పల్లెటూరినించి ఏదో పని మీద పట్నం వచ్చి వెంకటశాస్త్రి అనే అతని యింట్లో దిగుతాడు. ఒక రోజు సోమావధాని భార్య 'బంగారమ్మ', వితంతు మరదలు 'సుబ్బలక్ష్మి' సర్కసు చూడాలని సరదా పడతారు. సోమావధానులు దానికి అంగీకరించకపోతే అతనికి చెప్పకుండా వెళ్ళేటప్పుడు దారి తప్పుతారు.... మధ్యలో 'కృష్ణారావు' అనే విలాస పురుషుడి పాత్ర ప్రవేశిస్తుంది. అతను ఒక సందర్భంలో సుబ్బిశెట్టి అనే వైశ్యుడి మెళ్ళో గొలుసు (కంఠాభరణం) హామీగా లాక్కుంటాడు. నాటకం పేరుని నిర్దేశించిన కంఠాభరణం యిదే!..... తరువాత కథ చాలా మలుపులు తిరిగి, సుబ్బలక్ష్మి మొగుడు బతికే వున్నట్లు బైటపడడం, అలాగే కృష్ణారావులో పరివర్తన కలిగి భార్యని స్వీకరించడం వగైరాలతో మంగళాంతంగా నాటకం ముగుస్తుంది.

నాటకం మొదటి అంకంలోనే సోమావధానులు, బంగారమ్మ, సుబ్బలక్ష్మి, వాళ్ళు దిగిన యింటి యజమాని 'వెంకటశాస్త్రి' పరిచయం అవుతారు మనకి. సోమావధానుల అమానుషమైన కర్మఠత్వం ఓ పక్క నవ్వు తెప్పిస్తూనే, ఓ పక్క బాధ కలిగిస్తుంది. ఇంత కర్మపరత్వం ప్రదర్శించినా అతని అసలు పరిజ్ఞానం అంతంత మాత్రమే! సరైన పదాలే ప్రయోగించలేడు. ఒక మాటకి బదులు ఉచ్చారణలో దగ్గరగా ఉండి అర్థం వేరేగా ఉండే మరో మాటని వాడుతుంటాడు. ఇలా వాడడాన్ని ఆంగ్లంలో 'మాల్‌ప్రాపిపిజం' (Malapropism) అంటారు. 'షెరిడన్' తను రాసిన 'The Rivals' అనే నాటకంలో యిలాంటి పాత్రని ఒకటి సృష్టించి ఆమె పేరు Mrs. Malapprop అని పెట్టాడు. ఆమె పేరు మీద ఆతరహా భాష Malapropism అనే పేరుతో స్థిరపడింది. (నిజానికి మన 'మృచ్ఛకటికం'లో శకారుడి భాష యిలాంటిదే! వట్టి పదాల తికమక మాత్రమే కాక, సన్నివేశాల తికమకనీ - రావణాసురుడు కుంతిని ఎత్తుకెళ్లాడు - వంటివి, కల్పించి మంచి హాస్యం సృష్టించాడు ఆ నాటక కర్త, శూద్రకుడు).

ఈ నాటకంలో మాటిమాటికీ సోమావధానులు అపభ్రంశంగా మాట్లాడ్డం, వెంకటశాస్త్రి సరిదిద్దుతూ వుండడం మనకి నవ్వు తెప్పిస్తుంది. మచ్చుకి ఆ సన్నివేశం కాస్త చూద్దాం:

సోమా: (బంగారమ్మ, సుబ్బలక్ష్ములతో) ఏంటి మీకింత నాటకాల పిచ్చి? దివాణంలో తద్దినాలకీ, మూసివాయినాలకీ తప్ప ఆడవాళ్లు గడప దాటడం మన యింటా వంటా వుందా? అబ్దికాలు పెట్టించడం మన పని. అంతేకాని మనకి యివన్నీ ఎందుకు?

బంగా: అర్థరాత్రి పూట తద్దినాల గొడవెందుకులెండి? ఏదో మీ మరదలు - భర్తపోయి వీధి మొహం ఎరక్కుండా పడువున్నది - అది ముచ్చట పడుతున్నది గదా అన్చెప్పి గానీ....

సోమా: మనదగ్గర ఆ తేడాల్లేవ్! మహాలక్ష్మీ సమానులు (ముత్తయిదువులు) అయినా, గంగాభాగీరథులు (వితంతువులు) అయినా మనకొకటే! బ్రహ్మశ్రీలు (మగవాళ్లు) గంగా భాగీరథులైనా - లేక అటుది యిటైనా - నిష్ఠంటే నిష్ఠే - నా నిష్ఠ నేను వదలను.

**(ముందు ముందు కథలో మగవాళ్లు వితంతు వేషాలూ, వితంతువులు మగ వేషాలూ వేసుకుంటారు - ఇది కథార్థ సూచన - వ్యాసకర్త).**

బంగా: ఈ కాయితం (సర్కసు నోటీసు) చూడండి! ఎంత పెద్దదో! ఇందులో ఎన్ని అద్భుతాలు రాసున్నాయో!

సోమా: నా తుండు గుడ్డ యింత కంటె పెద్దది. ఇలాంటి కాయితాలు మేం చూడం. ఇట్లాంటి వాటి వల్లే ఆచారం పాడవుతోందని మేం అసలు 'అక్షర శ్రీకార'మే చేయలేదు.

వెంక: శ్రీకారం కాదయ్యా! అక్షర స్వీకారం!

సోమా: ఏదో ఒకటి! నాటకానికి వెళ్ళడానికి మాత్రం ఒప్పుకోను.

బంగా: ఇది నాటకం కాదు - సర్కసు.

సోమా: వెంకట శాస్త్రీ! 'సర్కసు' అనేదా ఏ భాషా పదం?

వెంక: సరిగ్గా తెలీదు.

సోమా: అయితే యిహనేం! అది సంస్కృత పదమే! కఠిన శబ్దమేదైనా అది సంస్కృత పదమే! దీనికి తిరుగు లేదు.

వెంక: ఓహో! అయితే ఆ మాటకి అర్థం ఏమిటి?

సోమా: అర్థం మనకెందుకు? వేదాలకి అర్థం వుందా? వున్నా మనకి తెలుసా? అందుకే వేదాలు అంత గొప్పవయ్యాయి.

బంగా: సరేలెండి, ఒక్కసారి ఆ కాయితం చదివితే ఏం పోయింది?

సోమా: కాయితాల మీది రాతలు చదవడం నేనొప్పుకోను. అలాంటి 'అకార్యఖననం'నే బతికుండగా జరగనివ్వను. (ఖననం అంటే పాతి పెట్టడం)

వెంక: 'అకార్య కరణం' అనాలి (అకార్యం అంటే చేయకూడని పని) (కరణం అంటే చేయడం)

బంగా: ఆ సర్కసులో ఒకామె తల వెంట్రుకలకి రాయి కట్టుకుని ఎత్తిందట!

సోమా: మా మేనత్త కోడలు గొంతుకు పెద్దరాయి కట్టుకుని గోదాట్లో దూకింది. అందులో అంత గొప్పేవుంది?

సుబ్బ: అందరూ ఆమెని తెగ మెచ్చుకుంటున్నారట!

సోమా: సుబ్బలక్ష్మీ! నీ శక్తి నీకు తెలీదు. ఆరుకుంచాల గుండిగను అవలీలగా నువ్వెన్నిసార్లు దించలేదూ, ఎడం చేత్తో? ఆ 'తిరకాసు'లో ఆమె చేసేది అంతకంటె గొప్పపనా?

వెంక: 'తిరకాసు' కాదండీ! సర్కసు.

సోమా: సరేలే! ఇది విను, వెంకటశాస్త్రి, మా సుబ్బలక్ష్మి మొగుడు చదువుకోసం నవద్వీపం వెళ్లి మళ్ళీరాలేదు. పన్నెండేళ్ళు చూసి ఓ రోజున నేనే శుభ్రంగా రేవుకి తీసికెళ్ళి ఆమెకి బుర్ర గీయించేశాను.

వెంక: అయ్యో! ఎంత పని చేశారు?

సోమా: అదేమరి 'నిష్ఠ' అంటే! కర్మ విషయంలో 'సూచాలు' తప్పకూడదు.

వెంక: 'సూచాలు' కాదు 'తూచాలు', కాని ఒకవేళ అతను యింకా బతికి వుంటే!;

సోమా: వుంటే వుండనీ! కాని మా ధర్మశాస్త్రం మటుకు అతను బతికున్నట్లు ఒప్పుకోదు. అతనికి తద్దినాలు పెట్టాల్సిందే! ఆఁ!

వెంక: అబ్బ! ఎంత గొప్పవారు మీరు?!

సోమా: నా గొప్పదనం అప్పుడే ఏం చూశావ్? ఇంకా చెబుతా విను! మా యింట్లో అన్నీ దేనికది వేర్పాటుగా వుంటాయి. పిల్లలకి జబ్బులొస్తే 'రోగ గృహం'. శాస్త్ర చర్చలూ, 'పూర్వభక్ష్యాలు' చెయ్యడానికి వేరే వసారా... (భక్ష్యం అంటే తినేది)

వెంక: ఓహో! 'పూర్వపక్షా'లకి వచ్చిన తిప్పలా? (పూర్వపక్షం అంటే ప్రతివాదన).

సోమా: విను! విను! నాకు నలుగురు కూతుళ్లు, నలుగురు కోడళ్లూ! ఎప్పుడు ఎవరు వితంతువులవుతారో, ఏమో! అప్పుడు వాళ్లని పరామర్శం చేందుకు ఓ గది కావాలి గదా! దానికోసం తొక్కట పడకుండా ఎనమండుగురికీ ఎనిమిది చిన్న కొట్లు - ఎవరి పేరు మీద వారికి - కట్టించేశాను.

వెంక: శివ! శివా! అయినా ఒక గది చాలదా?

సోమా: అందరూ ఒకేసారి పోతే! దూరదృష్టి వుండాలయ్యా! అలా జరిగితే అప్పుడు యిల్లెవరిస్తారు? శుభకార్యాలకంటే యిస్తారుగాని?... అందుకే యీ ఏర్పాటు.

వెంక: సరే, మరి మీ ఆవిడ కోసం ఓ గది ఎందుకు కట్టించలేదు?

సోమా: దాని జాతకంలో పునిస్త్రీ చావురాసి పెట్టి వుంది. అయినా దానికీ నేనేం తక్కువ చెయ్యలేదులే! రేపు దాని బుద్ధి పెడదారి పట్టి ఎవరితో నైనా లేచిపోతే?! అప్పుడు దానికి 'ఘటశ్రాద్ధం' (బ్రతికినా చచ్చిన వాళ్ళతో సమానంగా పరిగణించి చేసే అపరకర్మ) పెట్టొద్దూ! అందుకని దానికీ ఓ గది కట్టించే వుంచా.

బంగా: చేసిన ఘనకార్యం చాలక నలుగురికీ చెప్పుగోడం కూడానా?! సరే, మీ గొడవ మీది! మేం మాత్రం సర్కసుకి వెళ్లాల్సిందే!

సోమా: నాటకం అంటే ఆడా మగా కలిసి తైతక్కలాడ్డవేగా! అదేగా యీ కవులు రాసేది, ఆ నటులు చేసేదీనూ! అందుకే కవులూ, నటకులూ, గాయకులూ పంక్తి బాహ్యులన్నారు (కలిసి భోజనం చేయకూడని వారు).

వెంక: ఈ గొడవ తెగేది కాదు గాని, వాళ్లని వెళ్ళనివ్వండి, పాపం! పైగా యిది నాటకం కాదు. సర్కసు. ఇక్కడ కవులూ, నటకులూ ఎవరూ వుండరు.... అక్కడ ఒకామె మూడొందల పౌన్ల రాతిని గుండెల మీద పెట్టించుకుని సమ్మెటలతో కొట్టించుకుంటుందట....

బంగా: అబ్బ!



సోమా: నువ్వు మాత్రమేం తక్కువ? ఏనుగుల్లాంటి కవల పిల్లల్ని మీద కెక్కించుకుని ఆడించలేదూ?

వెంక: అయ్యా! స్త్రీజాతిని అలా తీసి పారెయ్యకండి! పూర్వం గూడా యోగాభ్యాసాల్తో మనశ్శరీరాలు దృఢం చేసుకుని బ్రహ్మచర్య దీక్షలో గడిపిన గొప్ప స్త్రీలున్నారు.

సోమా: స్త్రీకి బ్రహ్మచర్యమా! కుదరదని నేను నిరూపిస్తాను. ఎలాగంటావా? బ్రహ్మచారికి గోచీ వుండాలి. మరి ఆడవాళ్లని గోచీ పెట్టుకోమను. చూద్దాం!

వెంక: మీకు శాస్త్రాలు బాగా తెలుసే!

సోమా: మరేవనుకున్నావ్? వాల్మీకి దగ్గరికి అంబికా అంబాలికలు వెళ్ళి ప్రార్థిస్తే వాళ్లకి వాలి సుగ్రీవుల్ని అనుగ్రహించి ఆయన యాదవ కులం కాపాడ లేదా?.... నాకన్ని శాస్త్రాలూ, పురాణాలూ తెలుసయ్యోయ్!

(అంబికా, అంబాలికలు, భారతంలోని పాత్రలు వాలి సుగ్రీవులు రామాయణం పాత్రలు, యాదవ కులం గురించి భాగవతంలో వస్తుంది).

సుబ్బ: (సోమావధానులకి వినబడకుండా బంగారమ్మతో) అక్కా! ఇహ యీయన ఒప్పుకోడు! మనం దొంగతనంగా వెళ్ళి చూద్దాం! నువు రాకపోతే నేను ఒక్కదాన్నైనా వెళ్తాను.

బంగా: ఒక్కదానివీ వెళ్ళి మళ్ళీరాగలవటే? అసలే వూరుగాని వూరు. భయం వెయ్యదూ?!

సుబ్బ: ఎందుకు భయం? నా మొగుడు తిడతాడనా! నా దగ్గరున్న మణి మాణిక్యాలు ఎవరన్నా దోచుకుపోతారనా? నెత్తికి ముసుగొచ్చినప్పుడే అన్నీ వదిలేశాను. బతుకులో ఎలాగా సుఖం లేదు. ఇలాంటి సరదాలైనా తీర్చుకోవద్దటే!

బంగా: సరేలే! నిన్నొక్కదాన్నీ ఎలా పంపిస్తాను? నేనూ వస్తాను పద! ఈయన్ని కాస్త నిద్దరపోనీ! వెళ్దాం!

**(ఇంకావుంది)**

**-నిశాపతి**

# రాసిలోను, వాసిలోను మిన్నయైన సంగీతాన్నందించిన విజయభాస్కర్

కన్నడ సినీరంగానికే కాక 'కృష్ణవేణి', 'అమ్మాయిల శపథం' వంటి చిత్రాల ద్వారా తెలుగు సినీరంగానికి కూడా పరిచితుడైన సంగీతదర్శకుడు విజయభాస్కర్ ఇటీవలే మరణించారు. ఆయన ముచ్చట్లు కొన్ని -



విజయభాస్కర్ బెంగళూరులోని గవర్నమెంటు ఇంజనీరింగు కళాశాల ద్వారా మెకానికల్ ఇంజనీరింగ్‌లో పట్టభద్రుడు. సంగీతం మీద ఇంట్రస్టుతో చిన్నప్పటినుండీ గోవింద భావే వద్ద హిందూస్తానీ సంగీతం నేర్చుకున్నారు. అంతేకాదు, కర్ణాటక సంగీతం, వాటితో బాటు పియానో కూడా నేర్చారు. బొంబాయి చిత్రసీమకు వెళ్ళి నౌషద్ వద్ద అసిస్టెంటుగా పనిచేశారు.

నిర్మాత-దర్శకుడు బి.ఆర్. కృష్ణమూర్తి కోరిక మేరకు 1954లో 'శ్రీరామపూజ'కు సంగీతం సమకూర్చడంతో విజయభాస్కర్ చలనచిత్రప్రస్థానం ఆరంభమయింది. కళ్యాణకుమార్ తొలిచిత్రం భాగ్యచక్ర (1956), ఆర్. నాగేంద్రరావు తీసిన ప్రేమద పుత్రి (1957), ప్రఖ్యాత రచయిత కువెంపు తీసిన 'మనమెచ్చిద మాదడి' (1963)ఇలా అనేక మంచి చిత్రాలకు సంగీతం అందించినా రాజ్‌కుమార్ నటించిన 'సంత్ తుకారామ్'తో విజయభాస్కర్ పాప్యులర్ మ్యూజిక్‌డైరక్టరు అయిపోయారు.

కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే ఉత్తమ సంగీతదర్శకుని బహుమతి 6 సార్లు గెలుచుకునే గౌరవం విజయభాస్కర్ ఒక్కరికే దక్కింది. మొట్టమొదటి అవార్డు లభించినది - 'బెళ్ళిమోడ' (తెలుగులో వెండిమబ్బు నవలగా, పాలమనసులు సినిమాగా వచ్చింది)సినిమాకు. పుట్టణ్ణ 1967లో తీసిన ఆ సినిమాతో వారిద్దరి మధ్య ఒక అనుబంధం నెలకొని చాలాకాలం సాగింది. 'గెజ్జెపూజ' (తెలుగులో కళ్యాణ మండపం), 'శరపంజర' (తెలుగులో 'కృష్ణవేణి'), 'నాగరహావు' (తెలుగులో 'కోడెనాగు') ఇలా ఎన్నో పుట్టణ్ణ సినిమాలకు సంగీతం అందించినది విజయభాస్కరే!

విజయభాస్కర్ కన్నడంలోనే కాక తమిళ, తెలుగు, మలయాళ, కొంకణి, ఒరియా, తుళు భాషల్లో 670 సినిమాలకు సంగీతం సమకూర్చారు. వాటిల్లో 200 కన్నడ సినిమాలు. ఎటువంటిరకమైన సంగీతమైనా ఇవ్వడంలో ఆయన దిట్ట. రీ రికార్డింగులో ఆయన నేర్పు చూసి మలయాళ సంగీతదర్శకుడు అడూర్ గోపాలకృష్ణన్ తన 'మాదిలుగళ్' సినిమా ఆఫర్ ఇచ్చారు. విజయభాస్కర్ అనేక మంది కొత్తగాయకుల చేత పాడించారు. సంగీతంపై డెక్కన్ హెరాల్డ్, ప్రజామత పత్రికలో ఇంగ్లీషు, కన్నడాలలో వ్యాసాలు రాసారు. గేయరచయితలకు, సంగీతదర్శకులకు రావలసిన రాయల్టీ గురించి కాసెట్ కంపెనీలతో పోరాడారు. ఇటీవలే 'నీల', 'పూర్వాపర' సినిమాలకు సంగీతం సమకూర్చారు.

మార్చిలో స్వరలోకానికేగిన ఈ బహుముఖ ప్రజ్ఞాశాలికి "హాసం" శ్రద్ధాంజలి ఘటిస్తున్నది. ●




సంగీత దర్శకుడు కీ॥శే॥ రోషన్ కాంబినేషన్‌లో లతా మంగేష్కర్ గారు పాడిన "కభీతో మిలేగీ" పాట గిరి గారు చెపినట్టు "భీగీరాత్" చిత్రంలోనిది కాదు. ఈ పాట "ఆర్తీ" చిత్రంలోనిది. 'భీగీరాత్' చిత్రంలో రఫీ/లత సోలో పాట "దిల్‌జోన కెహసకా"! సవరించగలరు. లతగారు పాడిన "కభీతో మిలేగీ కహీతో మిలేగీ బహారోఁకి మంజిల్ రాహీ" మజ్రూ సుల్తాన్‌పురి/రోషన్‌లో వచ్చిన మధురమైన పాట అది.

-ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూరు

శివరాత్రి ప్రత్యేక సంచిక 'హాసం' - హృదయాహ్లాదం. బాపు చిత్రంలా మనోజ్ఞమైన వేటూరి కలం పునశ్చరణ చేసికొంటే మరీ మరీ అందం. పాత క్రొత్తల మేలు కలయికలో కిరాతార్జునీయం ఆదికవితలా, కవిసార్వభౌముని కవన ఘంటంలా ఉంటుంది.

"నెలవంక తలపాగ నెమలి ఈకగ మారె"-(వేటూరి)

"చారుసుధాధామ శకలావతంసంబు - పెడ గొప్పుపై నున్న పీకె" - (శ్రీనాథుడు - హర విలాసం.)

"నిప్పులుమిసే కన్ను నిదురోయి బొట్టాయే" - (వేటూరి)

"ఘనలలాటంబున కనుపట్టు కనుచిచ్చు గైరికద్రవ తిలకంబు కాగ -" (శ్రీనాథుడు.)

ఇక కిరాతార్జునుల బాణాల మధ్య వరాహం...

"తనువుకొండగ గిరిగిర తిరుగుచు - అటు నిటు తగిలిన రెండు బాణముల అసువులు కూల్చెను వరాహము" - (వేటూరి)

"శరనిధి మథనమున తిరుగు శైలమ పోలెన్ - (నన్నయ్య అరణ్యపర్వం.)

అల్పాక్షరాలలో అనల్ప రామణీయకం ఆది కవిదియైతే శబ్దశాసనంలో సార్వభౌమత్వం - శ్రీనాథునిదియైతే నుడికారంలో తెలుగుతనం వేటూరిది.

-గాదె రంగనాయకమ్మ, జంగారెడ్డిగూడెం

మీరు డేనీ కేయే గురించి రాస్తూ "నాక్ ఆన్ వుడ్" చిత్రంలోని ఫార్ములా కిశోర్‌కుమార్‌కి అద్భుతంగా నచ్చిందని, ఆ చిత్రం అతన్ని ముగ్ధుణ్ని చేసిందని వివరంగా తెలియజేశారు. కానీ మీరు అసలు విషయం రాయలేదు. అదేమిటంటే ఈ 'నాక్ ఆన్ వుడ్' హిందీలో "బేగునాహ్" పేరుతో 1957లో మక్కికి మక్కి కాపీ కొట్టి తీశారు. అందులో హీరో యింకెవరు? మన కిశోర్ కుమారే! సంగీతం శంకర్-జైకిషన్. అద్భుతమైన సంగీతం అందించారు. కానీ ఏం లాభం? చిత్రాన్ని శాశ్వతంగా నిషేధించారు! విడుదలైన కొన్నివారాలు మాత్రమే ప్రదర్శింపబడి థియేటర్లలోంచి తొలగింపబడింది. బేన్ (Ban) మూలంగా ఎస్-జే అభిమానులకు కూడా ఈ చిత్రం గురించి తెలియదు! ఈ చిత్రంలోని 'ఏ ప్యాసే దిల్ బేజుబాన్' అనే ముకేష్ పాట జైకిషన్ మీద చిత్రీకరించపబడింది.

-బి.శ్రీనివాసరావు, హైదరాబాదు

మార్చి 1-15 సంచిక 11వ పుటలో 'విజయానంద చంద్రిక' రాగం గురించి చెబుతూ "ఉత్తరాది రాగాలైన భైరవ్, బహార్‌లకి ప్రతిబింబాలనదగిన" అన్నారు. అది వట్టి భైరవ్ కాదు, 'ఆహిర్ భైరవ్' అని గమనింప కోరుతున్నాను. అసలు ఈ పాట గొప్ప ప్రయోగమైతే కావచ్చునేమోగాని సర్వజనరంజకం కాలేక పోయిందని చెప్పవచ్చు. పూర్తిగా సంగీత విద్వాంసులకు మాత్రమే అర్థమయ్యే రీతిలో పాక్షిక ప్రయోజనాన్ని మాత్రమే సాధించింది. అదీ మెలోడీ విషయంలో కూడా అంతంత మాత్రమే! ఘంటసాల పాడడం వల్లనే ఈ మాత్రమైనా ఇప్పటికీ నిలిచింది.

చక్రవాకం, కానడరాగాలు రెండూ భిన్న ధృవాల రాగాలు. వాటిని కలపాలనుకోవడం కొత్త ప్రయోగం కాని, అలా కలపడం వల్ల ఆ రెండు రాగాల మాధుర్యంలోని శిల్పం దెబ్బ తిన్నదని చాలామంది గమనించినట్లు లేదు. అందుకే ఈ పాటను విని ఊరుకోవలసిందే కాని పాడే ప్రయత్నం చేస్తే ప్రమాదం అని ఔత్సాహికులు గమనించి ఉంటారు.

సర్వజన సమ్మోహనకరమైన మోహన, శ్రీ, హిందోళం లాంటి రాగాలను తీసుకుని ఇటువంటి ప్రయోగం చేయగలిగితే ఇంకెంత రక్తిగా ఉండేదో అనిపిస్తుంది. 12వ పేజీలో "శేష శైలవాసా శ్రీ వెంకటేశ" అని రీతిగౌళలో చక్కని రీతిని" అని అన్నారు. కాని ఆ పాటల ఎత్తుగడ అంటే పల్లవిలో మాత్రమే రీతిగౌళ ఉన్నది. రెండు చరణాలు 'ఆనంధభైరవి'లో సాగాయి. ఈ అంశాన్ని రెండో పంక్తి చివర "అలుకరానీయకు. ప్రస్తుతించి పాడి' అనే చోట్లలో సుస్పష్టంగా గమనించవచ్చు. అందుకే దీన్ని "రీతి భైరవి" అనో "ఆనందగౌళ" అనో వ్యవహరిస్తే బాగుంటుంది.

21వ పేజీలో "ముప్పై ఏళ్ళ వయస్సు పైబడిన తరువాత కిశోరీ అమోన్‌కర్ గొంతు హఠాత్తుగా మూగపోయింది" అన్నారు. ఎందుకలా జరిగిందో చెప్పలేదు. తర్వాత మళ్ళీ ఆమె ఎలా పాడగలిగారో కూడా చెప్పలేదు. ఇలాంటి పాడిపాడి వ్యాసాలను కొంచెం జాగ్రత్తగా పరిశీలించి వేయగలరని మనవి. అసలు ఆమె పేరు "కిశోరీ అమోన్‌కర్" అని రాయాలి కాని 'కిషోరీ అమోంకర్' కాదు.

-ఎం.పురుషోత్తమాచార్య, నల్లగొండ

శ్రీమతి పి.లక్ష్మి - నల్లకుంట, హైదరాబాద్

ప్ర: ఆలిండియా రేడియోలో కొన్నాళ్ళక్రితం 'ఓ వసంతప్రియా' అనే ఓ లలిత గీతం వచ్చేది. వాటి వివరాలను తెలుపగలరా? అలాగే 'తెలతెలవారి మేలుకొనుమా' 'మోగింపవే హృదయవీణ' ఈ రెండు సినీ గీతాల వివరాలు కూడా ఇవ్వగలరా?

జ: 1. 'ఓ వసంత ప్రియా' అనే లలితగీతం రచన కందుకూరి రామభద్రరావు గారు. ఈయన ప్రముఖ కవి శశాంకకు మామగారు. ఈ పాటను పాడినది శ్రీరంగం గోపాలరత్నం. సంగీతం శ్రీ పాలగుమ్మి విశ్వనాథం గారు.

(ఈ ప్రశ్నకు సమాధాన్నిచ్చింది శ్రీ ఎం.చిత్తరంజన్)

2. 'తెలతెల వారే మేలు కొనుమా' పాట "మనోహర" (1954 ) అనే చిత్రంలోనిది.

ఈ 'మనోహర' సినిమా ఆడియో క్యాసెట్‌ను హెచ్.ఎం.వి.వారు రిలీజ్ చేయబోతున్నారు. అతి త్వరలో మీరు ఆ పాటను వినొచ్చు.

'మోగింపవే హృదయవీణ' పాట 'అన్న-తమ్ముడు' (1958) అనే చిత్రంలోనిది. సంగీతం అశ్వత్థామ.

3. ఎ.జ్యోతి - నల్లగొండ

తలత్ మహమ్మద్ తెలుగులో పాడిన పాట ఏది? ఏ చిత్రంలోనిది?

మనోరమ (1959) సినిమాలో తలత్ మొహమ్మద్ 3 తెలుగుపాటలు పాడేరు. అని (1) అందాల సీమ సుధానిలయం (2) మరిచి పోరాదోయి చేసిన బాసలు (3) గతిలేని వాణ్ణి గుడ్డివాణ్ణి బాబయా

బి.వి.రామారావు - నల్లగొండ

మహమ్మద్ రఫీ తొలిసారి తెలుగులో పాడిన పాట ఏది? ఏ చిత్రంలోనిది ?.

రఫీ తెలుగులో పాడిన తొలిగీతం 'పదండి ముందుకు' (1962) చిత్రంలోనిది. ఆ పాట పల్లవి 'మంచికి కాలం తీరిందా మనిషికి హృదయం మారిందా' అని వస్తుంది. ఈ చిత్రాన్ని నిర్మించిన నటుడు జగ్గయ్య ఈ పాటను రాశారు.

# లలిత సంగీతం

## ఆంధ్రప్రశస్తి

తెలుగు తల్లి గొప్పతనాన్ని, తెలుగుభాష ప్రాశస్త్యాన్ని చాటే
ఈ పద్యాలు ఉగాది సందర్భంగా...

1. ఇది వైకుంఠము వేంకటేశ్వరుడు లక్ష్మీశుండు కొల్వుండుటన్
ఇది కైలాసము మల్లికార్జునుడు ఆర్యేశుండు చెల్వొందుటన్
ఇది బ్రహ్మోర్వి సరస్వతీ చరణ పంకేజాతమై యుండుటన్
ఇది మా ఆంధ్రము నీకు పీఠము త్రిశక్తీ పూజగైకోగదే
2. వాణియెతీరవాటిక భవానియె రాయలసీమ శ్రీతెలం
గాణము పూర్ణరాజ్యరమగా ముగురమ్మల మూర్తి దాల్చి గీ
ర్వాణపథమ్ములన్ కదలివచ్చితివే జగమేలు కొమ్మికన్
రాణదలిర్ప మానవతరంజిల ఆంధ్రమ భాగ్యసాంద్రమా
(డా॥ బోయి భీమన్న)

మంచిగుమ్మడికన్న దంచిన ఎఱ్ఱని
క్రొవ్వడ్ల బియ్యము కూడుకన్న
మేల్ జహంగీరు మామిడి పండుకన్న సుం
కారిన లేసజ్జకంకి కన్న
కమియపండిన ద్రాక్షకన్న చక్కెర తగ
బోసివండిన పాల బువ్వకన్న
రసదాడికన్న పనసతొనకన్న క
జూరము కన్నను జున్నుకన్న
అలతి పెరతేనియలకన్న నామనిత టీ
కొసరి కూసిన కోయిల కూతకన్న
ముద్దులొలికెడి జవరాలి మోవికన్న
తీయనైన దెయ్యది? అదే తెనుగు బాస.
(కీ॥శే॥ ముదిగొండ వీరభద్రమూర్తి)



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

రచన: డా॥ బోయి భీమన్న, కీ॥శే॥ ముదిగొండ వీరభద్రమూర్తి

గానం : కె.బి.కె.మోహన్‌రాజు

రాగాలు : ఆరభి, కానడ, హిందోళ

**ఆరభి**

ఆరోహణ : స రి మ ప ద స
అవరోహణ : స ని ద ప మ గ రి స
రాగంలోని స్వరాలు : షడ్జము, చతుశృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి దైవతం, కాకలినిషాదం

**కానడ**

ఆరోహణ : స రి గ మ ప మ ద ని స
అవరోహణ : స ని ప మ గ మ రి స
రాగంలోని స్వరాలు : షడ్జమ, చతుశృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి దైవతం, కైశికినిషాదం

**హిందోళ**

ఆరోహణ : స గ మ ద ని స
అవరోహణ : స ని ద మ గ స
రాగంలోని స్వరాలు : షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధదైవతం, కైశికినిషాదం



తెలుగుతల్లిని, తెలుగుభాషను సంస్తుతించే యీ పద్యాలను ఎంతో భావగర్భితంగాను, మనోహరంగాను రచించారు డా॥ బోయి భీమన్నగారు, కీ॥శే॥ ముదిగొండ వీరభద్రమూర్తిగారు. 1975లో భాగ్యనగరంలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని శ్రీ భీమన్నగారు వ్రాసిన "కేదారేశ్వరి" అనే కావ్యంలో ఆంధ్రమాతపై అల్లిన యీ పద్యాలను, "తెలుగు ఒక వెలుగు - జాతి ఒక జ్యోతి" అనే వీరభద్రమూర్తిగారి కావ్యంలోని తెలుగుభాష ఔన్నత్యాన్ని చాటే పద్యాన్ని - ఎన్నో సభలలోను, ప్రపంచ తెలుగు మహాసభలలోను కూడా మధురంగా గానం చేసి తెలుగువారి మన్ననలు అందుకున్న శ్రీ కె.బి.కె.మోహన్‌రాజు సుప్రసిద్ధ లలిత సంగీత గాయకుడు. పౌరాణిక నాటకాలలో పద్యం పాడడం ఒక విధమైతే, శాస్త్రీయ సంగీత కచ్చేరీలలో విద్వాంసులు పద్యం పాడడం ఒక విధమైతే, శాస్త్రీయ సంగీత కచ్చేరీలలో విద్వాంసులు పద్యం పాడడంలో రాగానికి ప్రాధాన్యత ఎక్కువగా వుంటూ, రాగలక్షణాలు మొదలగు కట్టుబాట్లను అనుసరించి గానం చేయడం మరొక విధము. రాగాన్ని విస్తరించి మనోధర్మంగా పాడడం శాస్త్రీయ సంగీతంలో పరిపాటి. అయితే యీ రెండు పద్ధతులకు భిన్నంగా ఘంటసాల అర్ధశతాబ్దిక్రితమే "పుష్పవిలాపము", "కుంతీకుమారి" మొదలగు శీర్షికలతో కరుణశ్రీ రచించిన పద్యాలను లలిత సంగీత పద్ధతిలో - అనగా భావానికి, లాలిత్యానికీ అత్యంత ప్రాధాన్యతినిస్తూ గానం చేసి పద్యాలు పాడడంలో ఒక రివొల్యూషన్‌ని తీసుకొచ్చారు. పద్యానికి కూడా పాటకు కూర్చినట్లుగానే బాణీని కూర్చి స్థిరపరచి అందులోని పదాలకు, భావాలకు తగిన ప్రాముఖ్యతను కల్పిస్తూ గానం చేయడంలో ఆయన సిద్ధహస్తుడనిపించుకున్నారు. అవి ఎంతగా జనాన్ని ఆకట్టుకున్నాయో మనందరికీ తెలుసు. అలాగే మోహన్‌రాజు కూడా తను పాడిన యీ పద్యాలకు తానే బాణీని స్థిరపరచుకుని రసవత్తరంగా గానం చేసి ప్రశంసలు పొందగా, ఆ నొటేషన్‌ను పొందు పరచాను.

## కె.బి.కె.మోహన్‌రాజు



ఆకాశవాణి ద్వారా నాలుగు దశాబ్దాలుగా ప్రముఖ గాయకుడుగా ఖ్యాతి గడించుకున్న శ్రీ మోహన్‌రాజు చిన్నతనం నుంచే పాడటం మొదలు పెట్టాడు. 1934లో జన్మించి తన 15వ ఏట సభలలో పాడటం ప్రారంభించి, ఏలూరు వాస్తవ్యులైన కస్తూరి నరసింహారావుగారు, వారు తండ్రి శేషయ్యగారల వద్ద సంగీతంలో శిక్షణ పొంది. 1950 ప్రాంతంలో కొన్ని పౌరాణిక నాటకాలలో లోహితాస్యుడు, అభిమన్యుడు, వికర్ణుడుగా నటించాడు. 1957లో "మర్ఫీ మెట్రో" వారి నిర్వహణలో జరిగిన హిందీ చిత్రగీతాల పోటీలో దక్షిణ ప్రాంతానికి "బెస్టు సింగర్" అవార్డును గెల్చుకున్నాడు. ఆ పోటీకి ప్రముఖ హిందీ చిత్రాల సంగీత దర్శకులు సర్వశ్రీ నౌషాద్, సి.రామచంద్ర, మదన్‌మోహన్, అనిల్ బిశ్వాస్ న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో 1959లో లలిత సంగీతం ఆడిషన్ పాస్ అయినప్పటి నుంచి నేటి వరకూ ఎన్నో పాటలకు, సంగీత రూపకాలను తన మధుర గాత్రాన్ని అందించాడు. ప్రముఖ స్వరకర్తలైన సూర్యప్రకాశరావు, ఈమని శంకరశాస్త్రి స్వరపరిచిన చాలా పాటలను మోహన్‌రాజు హృద్యంగా ఆలపించారు. నేను, మోహన్‌రాజు కలిసి చాలా కార్యక్రమాలలో పాల్గొన్నాము. ప్రసిద్ధ గేయకవులైన కృష్ణశాస్త్రి, సి.నా.రె,. దాశరథి, బాపురెడ్డి, బోయిభీమన్న, గుంటూరు శేషేంద్రశర్మ, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీకాంతశర్మ, వింజమూరి శివరామారావు మున్నగు వారి గీతాలను ఆకాశవాణిలోనే కాక పలు సంగీత సభలలో కూడా గానం చేశాడు. నా సంగీత దర్శకత్వంలో ఎన్నో పాటలను, సంగీతరూపకాల పాటలను ఆయన గానం చేశాడు. వాటిలో "ఎవరిది - యింతగ నను వెంటాడేదెవరది" (డా॥ బోయి భీమన్న), "ఎవ్వరిదోయీ యీ రేయి" (డా॥ దాశరథి), "నింగిపై నీలాలా తెరపై (శశాంక), "గుండెల్లో వుండాలి కులాసా" (కృష్ణశాస్త్రి), "చూచేకొలది సుందరము" (డా॥ బోయి భీమన్న) - యిత్యాది గీతాలు మోహన్‌రాజు పాడిన ప్రసిద్ధ గీతాలలో మచ్చుకు కొన్ని మాత్రమే.

1966, 70 మధ్యకాలంలో 'సాక్షి', పూలరంగడు, తాసిల్దారుగారి అమ్మాయి, ఇన్‌స్పెక్టర్ భార్య, పెద్దన్నయ్య, విధివిలాసం (మాస్టర్ వేణుగారికి అసోసియేట్ సంగీత దర్శకుడిగా నేను పని చేసిన చిత్రం), మన మహాత్ముడు (నా సంగీత దర్శకత్వం) మొదలగు చిత్రాలలో మోహన్‌రాజు పాడిన పాటలు చాలా పాప్యులర్ అయినాయి. 1982లో రామదాసు ప్రాజెక్ట్‌ను నెలకొల్పి రామదాసు కీర్తనలను, ఆ తరువాత అన్నమయ్య కీర్తనలను పాడడంలో మంచి పేరు గడించుకున్నాడు. 1981లో కౌలాలంపూర్‌లోను, 1993లో అమెరికాలోను జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలో పాల్గొని అమెరికాలో యింకా పలుచోట్ల కార్యక్రమాలలో గానం చేశాడు.

1997లో ఆకాశవాణి జాతీయ కార్యక్రమంలో పాలగుమ్మి విశ్వనాథంగారి ఆధ్వర్యంలో శ్రీమతి వేదవతి ప్రభాకర్‌తో కలిసి పాడగా, అన్ని ఆకాశవాణి కేంద్రాలు ప్రసారం చేశాయి. లలిత సంగీతం పాడడంలో విశేషమైన అనుభవాన్ని సంపాదించుకున్న శ్రీ మోహన్‌రాజును 1998 ఆకాశవాణి "టాప్‌గ్రేడ్" గాయకుడుగా నిర్ణయించి గౌరవించింది.

## పద్మభూషణ్ డా॥ బోయి భీమన్న



నేడు వృద్ధాప్యంపైబడినా దాని ప్రభావం శరీరంపైనే తప్ప మనసు మీద లేదని, ఎప్పటికప్పుడు నూతనోత్సాహంతో ఉరకలు వేస్తున్న మనసుతో యీ నాటికీ ఎంతో వైవిధ్యభరితమైన సాహితీ సౌరభాలను వెదజల్లుతున్న మహాకవి డా॥ బోయి భీమన్నగారు. 1911వ సంవత్సరంలో తూర్పుగోదావరి జిల్లాలోని మామిడికుదురు గ్రామంలో కాలేజి చదువు పూర్తి చేసుకుని "జయవాణి", "ప్రజామిత్ర", "నవజీవన" మొదలగు పత్రికలకు సంపాదకత్వాన్ని నెరపి, "క్విట్టిండియా" ఉద్యమంలో పాల్గొని స్వాతంత్రం వచ్చిన తరువాత 1950 నుండి 5 సంవత్సరాలు "ఆంధ్రప్రభ"లో కూడా సబ్ ఎడిటర్‌గా పని చేసిన భీమన్నగారు "రాగోదయం" అనే కావ్యాన్ని రచించారు. అందులోని గేయాలను ఆకాశవాణిలో చాలామంది గాయనీగాయకులు తరచూ పాడుతుండే వారు. 1971లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు భీమన్నగారికి "కళాప్రపూర్ణ" గౌరవ డాక్టరేటును ప్రదానం చేసింది. 1973లో భారత ప్రభుత్వం "పద్మశ్రీ"లో సత్కరించింది. "గుడిసెలు కాలిపోతున్నయ్" అనే భీమన్నగారి కావ్యానికి సెంట్రల్ సాహిత్య అకాడమి వారి జాతీయ పురస్కారం (1975), ప్రపంచ తెలుగు మహాసభల (1975)లో సత్కారం, మరిన్ని గౌరవ డాక్టరేట్లు, ఎన్నో పురస్కారాలు వీరిని వరించాయి. కనకాభిషేకం, పుష్పాభిషేకం, కనక పుష్పాభిషేకం - ఇలా ఎన్నో సన్మానాలు, గౌరవాలు పొందిన భీమన్నగారు నిరంతర సాహితీ కృషీవలుడు. ఆయన రచించిన గేయాలు, కవితలు ఆకాశవాణి ద్వారా బహుళ ప్రచారాన్ని పొందాయి. శ్రీయుతులు మంచాళ జగన్నాథరావు, పాలగుమ్మి విశ్వనాథం మొదలగు స్వరకర్తలు వీరి చాలా పాటలను స్వరబద్ధం చేశారు. నేను కూడా వీరి పాటలకు, సంగీత రూపకాలకు సంగీతాన్ని కూర్చాను. ఎంతోమంది కళాకారుల చేత పాడించాను. నేనూ పాడాను. బహుళ జనాదరణ పొందిన వాటిలో మచ్చుకి కొన్ని--

"మోహనరాగరాగిణి" ("ఈ పాట నేర్చుకుందాం"లో నేర్పినది), "ఎవరిదిదీ యింతగనను వెంటాడేదెవరిది" (గానం: మోహన్‌రాజు),

"ఎత్తవోయీ కేల యీ బేల సుమబాల" (గానం: శాంతాచారి), "చూచే కొలదీ సుందరము" (మొదట మోహన్‌రాజు పాడగా, ఆ తరువాత డా॥ బాల మురళీగారు గానం చేశారు), "ఆరాధింతునురా" (గానం: శాంతాచారి), "పయనించు సెలయేటి" (గానం: చిత్తరంజన్), "ఎంత కాలమాయెరా" (గానం: కనకవల్లి నాగేందర్). ఇలా ఎన్నో గీతాలు ఆకాశవాణి, దూరదర్శన్‌లలోనూ ప్రసారమైనాయి. భీమన్నగారి "కాళియ మర్దనం" సంగీత రూపకానికి నేను సంగీతం సమకూర్చడం జరిగింది. "ముజ్జగాలు మోహించగ మురళిని వాయించరా" అనే వీరి గీతాన్ని సుప్రసిద్ధ సినీ నటి పి.శాంతకుమారి మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో గానం చేశారు.

తెలుగువారికి ఎన్నెన్నో ఉన్నతమైన రసగుళికలవంటి గీతాలను అందించిన భీమన్నగారిని 2000 సంవత్సరంలో "నవయుగ కవి సార్వభౌమ" బిరుదంతో విజయనగర వాసులు, 2001 సంవత్సరంలో పద్మభూషణ్ బిరుదుతో భారత ప్రభుత్వమూ సత్కరించాయి.

## కీ॥శే॥ ముదిగొండ వీరభద్రమూర్తి



శైవ సంప్రదాయ వంశజులై సంస్కృతాంధ్ర భాషలలో ప్రౌఢ ప్రబంధాలను, యక్షగానాలను విరచించిన శ్రీమల్లికార్జున శాస్త్రి, శ్రీమతి నాగమాంబలకు వీరభద్రమూర్తిగారు జన్మించారు. 1908లో గుంటూరు జిల్లాలోని మాదల గ్రామంలో, జననీ జనకుల నుండి వారసత్వంగా పుణికి పుచ్చుకున్న విద్య వీరభద్రమూర్తి లోని సహజ కవిని మేల్కొలిపింది. అనతి కాలంలోనే విశేష పాండిత్యాన్ని గడించి నాలుగు దశాబ్దాల పాటు వివిధ సాహితీ ప్రక్రియలను చేపట్టి ఎన్నో కావ్యాలు వ్రాశారు. ఉద్భటుని ఉపనయనము, మహామరకతము, మాదల గ్రామంలోని శివునిపై సుప్రభాతము, వందేమాతరం (దేశ స్వాతంత్ర సంగ్రామం - యితి వృత్తం) మొదలగునవి వీరి గ్రంథాలు. కంచువంటి కంఠం గల యీ కవి సంగీతంలో కూడా ప్రజ్ఞ గల వారని చెబుతారు. రాగయుక్తంగా కావ్యగానం చేసి రసజ్ఞులను సమ్మోహపరచేవారట. విశ్వనాథ, శ్రీశ్రీ వంటి మహాకవుల ప్రశంసలనందుకున్న వీరభద్రమూర్తి ఎన్నో లలిత గీతాలను కూడా రచించారు. "ఎదురైనారా ఎవరైనా" (పాలగుమ్మి విశ్వనాథంగారి సంగీతం), "ముదురు ముదురు వెన్నెలలో" (చిత్తరంజన్ సంగీతం) మొదలైన గీతాలు ఆకాశవాణి ద్వారా ప్రచారాన్ని పొందాయి. 1969లో వీరు రచించిన మల్లికార్జున సుప్రభాతం, సుసాంధ్యం అనే స్తోత్రాలను నేను, మా సోదరి శాంతగానం చేయగా కవిగారు వాటిని శ్రీశైల దేవస్థానం వారికి సమర్పించారు. భక్తి, దేశభక్తి, సమాజ శ్రేయస్సుకు సంబంధించిన వివిధ యితి వృత్తాలతో వీరి కలం నుండి సుందరమైన కవితలు జాలువారాయి. 1980లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమిలో విశిష్ట సభ్యత్వ గౌరవాన్ని పొందారు.

## ఆరభి, కానడ, హిందోళరాగాలలో తెలుగు చిత్రాలలోని కొన్ని పాటలు

| ఆరభిరాగం | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|
| "అమ్మాతమ్ముడు మన్నుతినేను" ('జయకృష్ణా ముకుందా మురారీ'లో ఓ పద్యం) | పాండురంగమహాత్మ్యం | ఘంటసాల | టి.వి.రాజు |
| కానడరాగం | | | |
| శ్రీగౌరిశ్రీగౌరియే | విచిత్రదాంపత్యం | పి.సుశీల | అశ్వత్థామ |
| నిన్ను చూచునందాక | భక్తశబరి | పి.సుశీల | పెండ్యాల |
| హిందోళరాగం | | | |
| చూడుమదేచెలియా | విప్రనారాయణ | ఎ.ఎమ్.రాజా | ఎస్.రాజేశ్వరరావు |
| నేనెరాధనోయీ గోపాలా | అంతామనమంచికే | భానుమతి | భానుమతి-సత్యం |
| మోహనరూపాగోపాలా | కృష్ణప్రేమ | ఘంటసాల | పెండ్యాల |
| పగలే వెన్నెలా జగమే ఊయలా | పూజాఫలం | ఎస్.జానకి | ఎస్.రాజేశ్వరరావు |
| గున్నమామిడి కొమ్మమీద | బాలమిత్రుల కథ | ఎస్.జానకి | సత్యం |
| పిలువకురా అలుగకురా | సువర్ణసుందరి | పి.సుశీల | ఆదినారాయణరావు |
| ఓం నమశ్శివాయ | సాగరసంగమం | ఎస్.జానకి | ఇళయరాజా |
| మనసే అందాల బృందావనం | మంచికుటుంబం | పి.సుశీల | ఎస్.పి.కోదండపాణి |
| శ్రీకర కరుణాలవాల | బొబ్బిలియుద్ధం | భానుమతి | యస్.రాజేశ్వరరావు |
| కలనైనా నీతలపే | శాంతినివాసం | పి.లీల | ఘంటసాల |




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

1. దెందము( పెళ్ళికానుక...వాడుక మరచెదవేల )
ఎ)హృదయము బి) వాయిద్యము
సి) సంతోషము డి) ప్రేమ

2. డోల ( చక్రపాణి....ఓ ప్రియురాలా)
ఎ)లాలిపాట బి) అల్లరి
సి)ఉయ్యాల డి) వాయిద్యము

3. దొంతర (శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న.... ఓ ఏమి ఈ వింత మోహం)
ఎ)వేడుక బి) ఉరక
సి) అల డి) వరుస

4. మేలాలాడు (పక్కింటి అమ్మాయి....కలయేమో)
ఎ)రాగానుగుణంగా ఆడు
బి) వేళాకోళము
సి) జాతరలో అడు డి) కొట్టు

5. నెనరు (పెళ్ళికానుక....ఆడేపాడే)
ఎ) వలపు బి)వినరు
సి)కోపము డి)జ్ఞాపకము

6. నెమ్మది (పెళ్ళికానుక....ఆడేపాడే)
ఎ)ఆలస్యము బి) బద్ధకము
సి)నిశ్చింత డి) సుఖము

7) సాములు(ఇంటిగుట్టు....ఆడువారి మాటలు)
ఎ)గురువు బి)వ్యాయామము
సి) విద్య డి) ముని

8) ఆరడి (భక్త అంబరీష...హే ప్రభూ)
ఎ)నిరాశ బి) ఆశ
సి)బాధ డి)సంగతి

9) కెమ్మోవి (గోపాలుడు భూపాలుడు....ఒకసారి)
ఎ)ఎర్రని పెదవి బి)నోరు
సి)కొమ్మ డి)చిగురు

10) కీల (గోపాలుడు - భూపాలుడు....ఒకసారి)
ఎ)గుట్టు బి)పాత్ర
సి)మత్తు డి) మంట

**జవాబులు**

1) a 2) c 3) d
4) a 5) d 6) c
7) b 8) c 9) a
10) d




## తెలుగు కార్టూనిస్టుకు అంతర్జాతీయ గౌరవం



ప్రతిష్ఠాత్మకమైన బెల్జియం అంతర్జాతీయ కార్టూన్ ఉత్సవం - 2002లో ఒక తెలుగు కార్టూనిస్టు గీసిన మూడు కార్టూన్ల ప్రదర్శనకు ఎంపిక అయ్యాయి. భారతదేశం మొత్తం నుండి ఆయన ఒక్కరికే ఈ అవకాశం దక్కింది. ఈ అరుదైన గౌరవం దక్కించుకున్న కార్టూనిస్టు వేరెవరో కాదు - "ఈనాడు" ద్వారా తెలుగు పాఠకులను రోజూ నవ్వించి కవ్వించి ఆలోచింపజేసే కార్టూనిస్టు శ్రీధర్. జూన్ నుండి సెప్టెంబరు వరకు జరిగే ఈ ఉత్సవానికి ప్రపంచ వ్యాప్తంగా 800 మంది కార్టూనిస్టులు పంపిన దాదాపు రెండువేల కార్టూన్లలోనుండి ఈ ఎంపిక జరిగింది. ఇలా అంతర్జాతీయ ఉత్సవానికి ఎంపిక కావడం శ్రీధర్‌కు ఇది మూడవసారి. (ఆధారం -ఈనాడు 15-3-02)

## ఇంగ్లీషు పాట - గోవిందా నోట



గోవిందా అప్పుడప్పుడు హిందీ పాటలు పాడుతూనే ఉంటాడు. పదిసంవత్సరాల కాలంలో దులారా, ఆంఖే వంటి సినిమాలలో అతను పాడిన పాటలను శ్రోతలు ఆదరించారు కూడా ఇప్పుడు "వాహ్ తేరా క్యా కహ్‌నా"లో ఇంగ్లీషు పాట పాడేస్తున్నాడు. గోవిందాకు హిందుస్తానీ శాస్త్రీయ సంగీతం ఇష్టమట. బడే గులాం ఆలీఖాన్, ఉస్తాద్ అమీర్‌ఖాన్ పాటలంటే చెవి కోసుకుంటాడట. ఈ ఇంగ్లీషు పాట ఎందుకు పాడుతున్నావంటే "సరదాగానే ఉంటూ డబ్బు గురించి మరీ వ్యామోహపడవద్దని నీతి చెబుతోంది కాబట్టి" అన్నాడు. ఇంతకూ ఆ పాట లిరిక్ ఏమిటో తెలుసా? - "ఐ వాంట్ మనీ, ఐ వాంట్ ఓన్లీ మనీ, గుడ్ మనీ, బాడ్ మనీ, బ్లాక్ మనీ..." పాడడానికి గోవిందా శ్రమపడ్డాడో లేదో కానీ గేయ రచయిత మాత్రం ఆవగింజంతైనా కష్టపడినట్లు లేదు.

## సంగీతం అందించడానికి కథ తెలియాలా?



81 సంవత్సరాల వయస్సులో నౌషద్‌కు ఓ సినిమాకు సంగీత దర్శకత్వం వహించడానికి ఆఫర్ వచ్చింది. ఫిరోజ్‌ఖాన్, సంజయఖాన్‌ల సోదరుడు అక్బర్‌ఖాన్ 50 కోట్ల వ్యయంతో నిర్మించబోయే తన "తాజ్‌మహల్" చిత్రానికి సంగీతం సమకూర్చే బాధ్యత నౌషద్‌కు అప్పగించారు. అర్బాజ్ అలా జహంగీర్‌గా, పూజా బాత్రా నూర్జహాన్‌గా, కబీర్‌బేడీ ముసలి షాజహాన్‌గా, మనీషా కోయిరాలా జహనారాగా నటిస్తున్న ఈ భారీచిత్రానికి ప్రస్తుతం కమర్షియల్‌గా హాట్ ఫేవరేట్ కానని నౌషద్‌ను ఎంచుకోవడంలో అక్బర్‌ఖాన్ పొరబడ్డారా అన్న విషయం చర్చకు వచ్చినప్పుడు ఒక విమర్శకుడు ఇలా వ్యాఖ్యానించారు. - "జెడి చక్రవర్తి "దుర్గ" అనే డైరక్టు హిందీ సినిమాకు విద్యాసాగర్ అనే తెలుగు సంగీతదర్శకుడిని పెట్టుకున్నప్పుడు నేను ఇలాటి ప్రశ్నే వేసాను. అతనేమన్నాడో తెలుసా? నా సినిమా కథను అర్థం చేసుకుని, భావానికి తగినట్టు ప్రత్యేకంగా సంగీతం ఇచ్చేవారిని పెట్టుకుంటే మంచిదంటారా? రెడీమేడ్‌గా ఎవరికైనా పనికివచ్చేట్టు ట్యూన్స్ తయారుచేసి పెట్టుకుని నేను ఐదారు సెలక్టు చేసుకునే దాకా వినిపించేవారిని పెట్టుకుంటే మంచిదంటారా? అని అడిగేడు. అలాగే ఇలాటి పీరియడ్ సినిమాకు మూడ్ తగ్గ సంగీతం సమకూర్చగల ప్రతిభ నౌషద్‌కు తప్ప వేరేవాళ్ళకు ఉందంటారా?" అక్టోబర్‌లో రిలీజ్ కాబోయే ఈ చిత్రానికి లిరిక్స్ నక్స్ లాయల్‌పురి. తాజ్‌మహల్ ఎదుట గతంలో తన సంగీతకచ్చేరీ ఏర్పాటు చేసిన గ్రీకు సంగీతకారుడు యానీ బ్యాక్ గ్రౌండ్ సంగీతం అందిస్తారు.

## బ్రిట్నీ-జస్టిన్ అగాధం



ప్రేమికులదినం నాడు పెళ్ళి చేసుకుంటామని ప్రకటించిన బ్రిట్నీ స్పియర్స్-జస్టిన్ టింబర్లేన్ విషయం "హాసం16-31 డిసెంబర్" సంచికలో చూసేవుంటారు. కానీ అనుకున్న విధంగా ఆ పెళ్ళికాలేదు. జస్టిన్ N'Sync బ్యాండ్ వదిలేసి సోలో సింగర్‌గా మారడానికి నిశ్చయించుకోవడానికి, బ్రిట్నీని పెళ్ళి చేసుకోకూడదనని అనుకోవడానికి సంబంధం ఉందంటున్నారు. తమ మధ్య ఏర్పడిన పొరపొచ్చాలు సమసిపోతాయని ఆశించిన బ్రిట్నీకి ఆశాభంగం కలిగింది - ఫోన్ చేసినప్పుడు టింబర్లేన్ చెప్పిన సమాధానం విని. బ్రిట్నీకి ఘాటుగా సమాధానం ఇచ్చిన తర్వాత తనకు ఫోన్ చేసిన ఇంకో అభిమానికి టింబర్లేన్ ఒక అమూల్యమైన సలహా ఇచ్చాడట - "ఆడవాళ్లకు దూరంగా ఉండు బ్రదర్. వాళ్లతో అన్నీ ఇక్కట్లే!" అన్నాట్ట. మగవాళ్ల గురించి మరి బ్రిట్నీ ఏమంటుందో వినాలి.

## ఉవాచ

"ఈనాటి పాటలు నాకు పెద్దగా నచ్చవు. నూటికి ఒకటి, రెండు... అంతే! ఈ మధ్య నాకు నచ్చిన పాటలు - 'జియాజలే', 'కుఛ్ న కహో'



"పాటల తర్వాత నాకు ప్రాణప్రదమైనది ఫోటోగ్రఫీ. 1946 నుండి నాకీ హాబీ ఉంది. కానీ అవన్నీ నా పర్సనల్ కలక్షన్‌కే. ఎగ్జిబిషన్‌లో పెట్టడానికి కాదు."

-లతా మంగేష్కర్

# రసజగత్తును 'ఊయల' నూపిన

# గరికపర్తి కోటయ్య దేవర

1864 ప్రాంతాల్లో

బందర్లో పెద్ద ఉప్పెనొచ్చింది....

తాడెత్తు సముద్రపు అలలు విలయతాండవం చేస్తోంటే

పెద్దపెద్ద చెట్లు - పెళపెళ విరిగి పడిపోవడం....

పంట పొలాలు నాశనం అయిపోవడం.

పెంకుటిళ్ళు కూలిపోయాయ్.

గుడిసెలు... నీళ్లలో తేలిపోయాయ్.

పశువులు కొట్టుకు పోతున్నాయ్

మనుషులు కొట్టుకు పోతున్నారు.

ప్రాణభీతి.... ప్రకృతి బీభత్సం....

ఆ ప్రవాహంలో... తేల్తోన్న చెక్క ఉయ్యాల....

అందులో ఓ పసిపిల్లాడు!!

ఏడ్చీ ఏడ్చీ.... సొమ్మసిల్లిపోయాడు!.....

ఉయ్యాల కొట్టుకు పోతోనే ఉంది!.... కొట్టుకు పోతోంది.... పోతోంది!

ఎదురుగుండా లోయ.... అందులో పడిందా!....

ఇంక అంతే!.....

**కానీ ఈ ఊయలవెళ్లి.... ఓ కుంకుడు చెట్టుకు చిక్కుకుంది!!**

"... ....... ............."

ప్రకృతి శాంతించింది!

ఉప్పెన తగ్గింది!....

ఉయ్యాల్లోని పిల్లాడు... మళ్లీ ఏడ్చాడు!!

అప్పటిదాకా!.... ఊరంతా వెతుక్కున్న తల్లి.... గుండెలుబాదుకుంటూ వచ్చి ఉయ్యాల్లోంచి పిల్లాణ్ణి తీసుకుని... గుండెలకి హత్తుకునీ

కోటి దేవుళ్ళకి - కృతజ్ఞతలు చెప్పుకుంది!!

అలా బతికి బట్టకట్టిన పిల్లాడే....

గరికపర్తి కోటయ్య దేవర....

***

కోటయ్యకి ఐదారేళ్ళొచ్చాయ్!....

బళ్లో వేసారు... కానీ చదవట్లేదు!!

కొబ్బరి చిప్పకి... తీగలుకట్టి

గుర్రపు వెంట్రుకలు కట్టి కమానుతో వాయించడం మొదలెట్టాడు!!

అప్రయత్నంగానే అద్భుతమైన నాదం పుట్టింది!!

పిల్లనగోవి మీద పెదవి ఆన్చి... జగత్తుని మత్తులో ముంచేసిన మురళీమోహనుడి అంశ ఉన్నట్టు...

కోటయ్య... కొబ్బరి చిప్ప వాయిద్యం మీద కోటి రాగాలు పలికేవి!....

గురువులేడు!!

విద్య తెలీదు...

అయినా విన్నవారంతా మంత్రముగ్దులైపోతున్నారు.

**ఇందుకేనేమో.... ఆనాడు ఊయల వెళ్ళి కుంకుడు చెట్టుకి చిక్కుకుంది...**

స్వతహాగా జంగమ వారవడం....

తండ్రి లక్ష్మయ్యకు అంతో ఇంతో సంగీతం రావడంతో కొడుకు కోటయ్యకి సరళీస్వరాలు నేర్పాడు లక్ష్మయ్య.

ఇక చూస్కోండి!!

సరళీ స్వరాలు కొబ్బరి చిప్ప మీదే

జంట స్వరాలు కొబ్బరి చిప్ప మీదే...

కీర్తనలూ కొబ్బరి చిప్పమీదే!....

సంగీత సరస్వతికి కొబ్బరి చిప్పలో నైవేద్యం పెట్టేశాడు!

విద్య రావాలి కానీ వాయిద్యం ఏమంటే పలకదు?

***

ఆ కాలంలోనే జీవనోపాధి కోసం కోటయ్య తల్లిదండ్రులు నైజాం (హైదరాబాదు) కొచ్చేసారు.

ఇప్పుడు కోటయ్య స్థాయి కొబ్బరి చిప్పనించీ వాయులీనం దాకా పెరిగింది!!

హైదరాబాదు వచ్చిన కోటయ్యదేవరకి వాయిద్యంతోపాటు గానం కూడా వంట బట్టింది! రోజు అరుగు మీద కూర్చునీ అద్భుతంగా వాయిస్తూ ఉండేవాడు!

ఒక రోజు!

హైదరాబాద్ సంస్థానం మంత్రి సాలార్‌జంగ్ బహద్దర్ వ్యాహ్యాళికెళ్తూ

---

ఆకాశంలోని చంద్రుడు పక్షానికి పక్షానికి పెరగడం, తరగడం మనకు ఎరిగిందే కానీ మీరు పరిచయం చేసే సాహిత్య సంగీత సమ్రాట్టులకు సంబంధించి మీరిచ్చే సమాచారం, వివరణ పక్షానికి పక్షానికి పెరిగే దిశలోనే వుంటున్నాయి. పోతే ఈ పక్షం (16-31 మార్చి 2002), మీరు పరిచయం చేసిన 'వీణ వెంకట రమణదాసు' గురించిన వ్యాసంలో దాసుగారు వర్షం నిలేసిన తీరు దానిని మీరు వివరించిన తీరు అబ్బుర పరచాయి. వర్షం కురిపించిన సంగీతజ్ఞుల గురించి విని వున్నాం గాని, వర్షాన్ని నిలేసింది దాసుగారు ఒక్కరే కావచ్చేమో! నిజంగా దాసుగారు ఆ అద్భుత ఫీట్ సాధించినందుకు స్మరణీయులు. ఇతర శబ్దాలకు అవకాశం యివ్వకుండా సముద్ర గంభీర ధ్వనిలా వినిపించే వీణానాదానికి సంబంధించిన బ్రహ్మ రహస్యము సరియైన సందర్భములో భేదించడం ఆకట్టుకుంది. ఒకవేళ ఆ బ్రహ్మరహస్యం ముందే చెప్పివుంటే ఇక చెప్పడానికి ఏం మిగులుండేది కాదు. దాసుగారి 'అద్భుతం' సాధారణంగా కనబడేది. అందువల్ల అది వెల్లడి చేయడానికి మీరెంచుకొన్న సమయం, సందర్భము ఈ పరిచయాన్ని మహోన్నత స్థాయికి తీసికెళ్ళింది. దాసుగారి ఇంటి పేరు మారిపోయిందనటానికి, ఊపిరి బ్రతుకులతో మీరు చిన్న పదాలలో గుండెకు పట్టేట్లు చెప్పారు. దాసుగారిని పరిచయం చేస్తూ ఉగ్గుతో వీణ పాలతో వీణ, పాడేప్పుడు వీణ, తప్పటడగులప్పుడు వీణ.... తన శరీరం వీణ నరాలు తీగలు అంటూ సాగిన మీ వివరణ ఈ పక్షపు కథా నాయకుణ్ణి "విజువల్"గా మనముందుంచగలిగింది. అభినందనలు.

-జి.ప్రభాకర్‌రావు, మసాబ్‌టాంక్, హైదరాబాద్.

---

ఈ కుఱ్ఱాడి వాద్యం విని ముచ్చటపడి పోయి కుఱ్ఱాడి భుజాలు తట్టి తనతో తీసికెళ్ళి.... చిన్నన్న అనే గాయకుడికి అప్ప జెప్పి సంగీతం నేర్పమన్నాడు!!

**అర్థమౌతోందిగా ఉయ్యాలవెళ్ళి కుంకుడు చెట్టుకు ఎందుకు చిక్కుకుందో!!**

పదేళ్ళలో ఇటు హిందుస్తానీ.... అటు కర్ణాటక సంగీతాన్ని జుర్రేశాడు. ఈయన ప్రతిభని గుర్తించిన రాజగోపాలాచారి అనే జాగీర్‌దారు... నవాబ్ జఫర్‌జంగ్ దేవిడీలో గాయకుడిగా నియమించాడు...

కొన్నేళ్ళకి కోటయ్య దేవర పేరు మోగిపోయి... ఏకంగా హైదరాబాద్ సంస్థానంలోనే గవాయి (గాయకుడిగా) నియమితుడయ్యాడు.

ఎక్కడి గుడిసె, ఎక్కడి పేదరికం...

ఎక్కడి కొబ్బరి చిప్ప వాయిద్యం ఎక్కడి హైదరాబాద్ సంస్థానంలో ఆస్థాన పదవి....

ఎక్కడి పూరిగుడిసె.... వేలి నడకా... మట్టిబొచ్చె... తరవాణీ.....!

ఎక్కడి బంగళా.... గుఱ్ఱబ్బగ్గీ.... వెండికంచం..... బిర్యానీ.....!!

**ఉయ్యాలెల్లి.... కుంకుడు చెట్టుకెందుకు చిక్కుకుందను కున్నారూ!**

తన ఎదుగుదలకి కారణభూతుడైన రాజగోపాలాచారి మీద ఒక వర్ణం రాసి భక్తిని ప్రకటించుకున్నాడు కోటయ్యదేవర!

ఆ తర్వాత 1894లో దక్షిణాది పర్యటన....

సియాళ నారాయణస్వామి అయ్యర్!

తిరుక్కోడి కావై కృష్ణ య్యర్‌తో కలిసి తంజావూర్ సంస్థానానికి వెళ్ళి కచేరీ చేస్తే!

మహమ్మదీయుడి వేషంలో ఉన్న వ్యక్తి ఇంత చక్కటి కర్ణాటక సంగీతం ఎలా పాడుతున్నాడని రాజా వారి ఆశ్చర్యం...

తర్వాత ఇది నైజాం సర్కార్ ఆస్థానపు వేషమే గానీ మరోటి కాదని ఆయన చెప్పడం....

తంజావూర్ ఆస్థాన విద్వాంసుడిగా ఉండమని రాజావారు కోరడం

దేవర సున్నితంగా తిరస్క రించడం.... రాజా వారు కోటయ్య దేవరను ఘనంగా సన్మానం చెయ్యడం....



తనికెళ్ళ భరణి

1869 వరకు దక్షిణాదిన పర్యటించిన కోటయ్య దేవర - చివరి దశలో బందరు వచ్చేసి అక్కడ ఒక సంగీత పాఠశాలను ఏర్పాటుచేసి తను సంపాదించిన డబ్బులో అనేక మంది విద్యార్థులకు - ఉచితంగా భోజనం పెట్టి మరీ సంగీతం నేర్పించాడు!!

కోటయ్య గురించి చెప్పుకోవాల్సిన మరో విశేషం ఉంది!....

ఒక సారి వల్లూరు సంస్థానంలో ఒక సంగీత కచేరీ జరిగింది!

ఆ సభలో ఆర్గాను వాయించిందెవరో తెలుసా?

కోటయ్య దేవర పెంపుడు కుక్కలు!!!

కోటయ్య దేవర తన పెంపుడు కుక్కలకి ఆర్గాన్ తొక్కడం అలవాటు చేసి ఆ రోజు సభను రంజింప చేయగలిగాడు!!

అందుకే అంటారు - పశుర్వేత్తి - శిశుర్వేత్తి అని!....

శిశుర్వేత్తి అనగానే నాకు మళ్ళీ ... బందరు ఉప్పెన...

ఆ ప్రళయం.... అందులో ఊయల.... ఆ ఊయల్లో వటపత్రశాయిలా కోటయ్య దేవర.... కుంకుడు చెట్టు గుర్తుకొస్తున్నాయ్!!!

శివుడి ఆజ్ఞ లేందే చీమైనా కుట్టదు గదా!

**ఇందుకే గదా ఆ రోజు ఊయల.... కుంకుడు చెట్టుకు చిక్కుకుంది.**

**- తనికెళ్ళ భరణి**

---

సంస్కారవంతమైన సాహిత్యాన్ని అందించుచున్న శ్రీయుత తనికెళ్ళ భరణిగారూ!

మనః పూర్వక శుభాభినందనాలు. అభినందన చందనాలు. మార్చి 16-31 సంచికలోని వీణజోరుతో వర్షపు హోరుని నిలిపివేసిన "వీణ వెంకట రమణదాసు" గారిని గూర్చి వ్రాసిన రచనా సౌరభాన్ని చక్కగా చవిచూశాం. ఎంతో బాగా ఆనందింప జేసింది.

నరకాసురుని సంహరించడానికి సత్యభామాదేవి చేసిన సమరసన్నాహం 'హరిజాచు - అరిజాచు' అన్న పద్యం - ఎంతటి మనోజ్ఞతను కవితా ప్రాభవాన్ని అందించినది, తెలియని వారెవ్వరూ వుండరని తమకు తెలియనిది కాదు. అదేవిధంగా ఇక్కడ వెంకట రమణదాసుగారి వీణ హోరు - వర్షపు జోరు, పాఠకులకు హర్షం కలిగించే విధంగా, ఒకదానికొకటి అన్వయించుకొంటూ జంట పదాలతో రచనకు మిక్కిలి "రక్తి" చేకూర్చారు. వాన అలసిపోయి, వెలిసి పోయిందన్నారు.

"వస్తువు" అతి సామాన్యమైనదప్పటికి, మీ చేతి వాటంతో దాన్ని అనితర సాధ్యం చేస్తున్నారు. సాహితీ సరస్వతికి చక్కని నైవేద్యం సమర్పిస్తున్నారు. మీ రచన అలవి అలతి పదాలతో కవి పండితులను అమితంగా ఆకట్టుకొనుచున్నది.

"హాసం"కి మీ రచన అందించుట వలన మాకు "దరహాసం" కలుగుచున్నది. ఆ దరహాసాన్ని మాకు అలాగే నిరంతరం అందిస్తారని, అందించాలని ఆశిస్తున్నాం.

-వెలివల సాంబశివరావు, గుంటూరు.

చరిత్రలో శ్రీనాథుడు, గరిమెళ్ల, శివరావు, సావిత్రి ఇలా వీరి జీవిత చరమాంకంలో పడిన బాధలు గుర్తుకొస్తేనే హృదయం బరువెక్కుతుంది. గొంతు మూగపోతుంది. మరో సారంగపాణి కష్టాలను చదివి మోయలేని బరువుతో గుండె ద్రవించింది. ఇప్పటివరకు మీ నటనకి కడుపారా నవ్వుకునే నేను మీ వ్యాసం చదివి మనసారా ఏడ్చాను.

ఇంతకు మించి ఏం వ్రాయలేను.

-ఎస్.లక్ష్మీగోపాలన్, మూలపూరు.

---

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018**

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

# రాజా ఆడియో రివ్యూ



విడుదల : హెచ్.ఎం.వి.
వెల : ఒక్కొక్కటి రూ. 45/-

పుట్టి పెరిగిన ఊరు, అమ్మ చేతి గోరుముద్ద, చిన్నప్పటి ఆటపాటలు ఇవన్నీ మనిషికి అనిర్వచనీయమైన ఆనందాన్నిస్తాయి. తల్చుకుంటున్న కొద్దీ ఆ ఆనందం రెట్టింపు అవుతూ ఉంటుంది. 'అలనాటి క్లాసిక్స్' పేరిట హెచ్.ఎం.వి. వారు ఇటీవల విడుదల చేసిన 5 క్యాసెట్లూ అటువంటి అనుభూతిని మరో కోణంలో అందజేస్తాయి. ఫస్ట్ బంచ్‌గా విడుదలైన క్యాసెట్లలో మల్లీశ్వరి, మాయాబజార్, లవకుశ, భక్త ప్రహ్లాద, భక్తతుకారం చిత్రాలయొక్క సంగీతం ఉంది.

'మల్లీశ్వరి' ఆడియో క్యాసెట్‌లో రెగ్యులర్‌గా అందరికీ తెలిసిన భానుమతి, ఘంటసాల పాడిన హిట్‌సాంగ్స్‌తో పాటు - టి.జి. కమలాదేవి పాడిన తుమ్మెదా పాట, ఉషా పరిణయం యక్షగానం కూడా ఉన్నాయి. అలాగే హీరో హీరోయిన్ చిన్నప్పుడు పాడుకున్న పాటల వివరాలు, సినిమా టైటిల్ మ్యూజిక్‌తో పాటు చిత్తూరు వి. నాగయ్య ఇచ్చిన కామెంటరీ అన్నీ ఉన్నాయి.

'మాయాబజార్' ఆడియో క్యాసెట్‌లో ఉన్న పాటలు, పద్యాలు సినిమాలో ఉన్న వరుసలో లేకపోయినా మొత్తానికి అన్నీ వచ్చాయి. ముఖ్యంగా సి.యస్.ఆర్ పద్యం, దాన్తోపాటు మోహినీ భస్మాసుర సంగీత రూపకం, టైటిల్ మ్యూజిక్ కూడా ఉన్నాయి. వింటూ కళ్ళు మూసుకుంటే కళ్ళలో మాయాబజార్ కదలాడుతుంది. అహనా పెళ్ళియంట పాట ఎదురుగా - పాడినది సుశీల, ఘంటసాల అంటూ - ఇన్‌లే కవర్‌పై ఉండటం చూస్తుంటే "ఈ పాటని యుగళ గీతంగా పరిగణించరెందుకో..!?" అంటూ వి.ఎ.కె. రంగారావుగారు తరచుగా అనే మాట ఆయనతో పరిచయం ఉన్న వారికి గుర్తొస్తుంది.

'లవకుశ' ఆడియో క్యాసెట్‌లో చిత్రంలోని పాటలు, పద్యాలు శ్లోకాలు అన్నీ ఉన్నాయి కానీ ఒకే ఒక్కపాట (వెయ్యర దెబ్బ అనే రజకుల గీతం) మిస్సయింది. అప్పటికే క్యాసెట్ డెబ్బై అయిదు నిమిషాలకు రావటంతో ఆ పాటను మినహాయించి ఉంటారు. డెబ్బై అయిదు నిముషాల క్యాసెట్‌ను 45/- రూపాయలకు అందించడంలో ఉన్న సాధక బాధకాలు ఏమిటో శ్రోతలకు హెచ్.ఎం.వి. వారు ఏదైనా ఒక పత్రిక ద్వారా వివరిస్తే ఇలాంటి మినహాయింపుల వలన కలిగే అసంతృప్తికి కొంత ఊరట లభిస్తుంది. ఇన్‌లే కవర్‌పై 'విరిసే చల్లని వెన్నెల' పాటను సుశీల, కె. జమునారాణి, బృందం పాడినట్టుగా పేర్కొన్నారు. అది తప్పు. ఆ పాటను పాడినది యస్. జానకి, బృందం.

'భక్త ప్రహ్లాద' ఆడియో క్యాసెట్‌లో చిత్రంలోని పాటలు, పద్యాలు, శ్లోకాలు, దండకం ఇంచుమించు అన్నీ వచ్చాయి కానీ రేలంగి, పద్మనాభం అభినయించిన 'హిరణ్యకశిపుని కథ' వాణిశ్రీ అభినయించిన 'చెట్టుమీద ఒక చిలకుంది' అనే నృత్యగీతం మినహాయించబడ్డాయి.

'భక్త తుకారం' ఆడియో క్యాసెట్‌లో కూడా పాటలు సినిమాలో ఉన్న సీక్వెన్స్ ప్రకారం లేవు అయినా అన్నీ వచ్చాయి. ఈ చిత్రంలో ఉన్నది మంచి సంగీతమే అయినా 'అలనాటి క్లాసిక్స్' అకౌంట్‌లో ఈ చిత్రాన్ని ఎంపిక చేయటం సంగీత ప్రియులకు కొంత రుచించకపోయే అవకాశం ఉంది. అలనాటి క్లాసిక్స్ మకుటంపై ఎన్నిక కావలసిన చిత్రాలెన్నో ఉన్నాయి. అవి రెండో బంచ్‌లో విడుదలవుతాయని ఆశిద్దాం.

మొత్తం క్యాసెట్లని డిజిటల్‌గా రూపొందించారు. ప్రతి క్యాసెట్‌లోనూ ఆ సినిమా వివరాలను, గొప్పతనాన్ని సంగ్రహంగా తెలుపుతూ ఇన్‌లే కవర్ లోపల ముద్రించిన సమాచారం- ఇవన్నీ ఒక మంచి ప్రయత్నం ప్రజలకు చేరువ కావడానికి ఎంత శ్రద్ధ తీసుకోవాలో తెలుపుతాయి.

టోటల్‌గా నిజాయితీతో కూడిన ఈ అభిరుచిని అభినందించక తప్పదు.

# రాజా ఆడియో రివ్యూ

రవాణి - మరోసారి తనేమిటో చూపిన చిత్రమిది. దర్శకుడు వై.వి.యస్. చౌదరి తన గురువు కె. రాఘవేంద్రరావు లెవెల్లో కీరవాణి నుండి 'ది బెస్ట్' ట్యూన్స్ రాబట్టుకున్నాడు. లిరిక్స్ కూడా అదే స్థాయిలో రాయించుకోగలిగాడు. పాటలు అదిరిపోయేలా పాడించుకోగలిగాడు. ఉన్న 8 పాటల్లో 3 కీరవాణి, 5 సిరివెన్నెల రాశారు.

'కళ్ళలోకి కళ్ళుపెట్టి చూడలేకున్నా' పాట ఓ గుడ్ మెలోడీ... గుండెకి హత్తుకొని జ్ఞాపకాలలో మిగిలిపోగల క్యాచీ ట్యూన్ ఉందీ పాటలో! ఉదిత్ నారాయణ్ మాటలు స్పష్టంగా ఉండటం ఈ పాట ప్రత్యేకతలలో ఒకటి. చరణాల మధ్య - 'తాత్తనన ధిరనన ధిరన' అంటూ చిత్ర ఆలాపన ఎంత బావుందో, 'చినుకే నీకు గొడుగయ్యిందా' అంటూ రచయితగా కీరవాణి ఇచ్చిన ఎక్స్‌ప్రెషన్ కూడా అంతే బావుంది. పల్లవి అదేపనిగా వింటే - 'కాలం మారింది' సినిమాలో యస్.రాజేశ్వరరావు స్వరపరిచిన 'ముందరున్న చిన్నదాని అందమేమో' పాట బిగినింగ్ గుర్తొస్తే అందుకు కీరవాణిని తప్పు పట్టలేం. ఎందుకంటే- ఎందరి స్వరాలో నాలో ఇన్‌పుట్ అయి నా క్రియేటివిటీతో కలిసి అవుట్‌పుట్‌గా బైటికొస్తుంటాయి - అని ఆయన ఎన్నో ఇంటర్వ్యూలలో చెప్పారు కనుక!

'మన వీర వెంకట సత్యనారాయణ పెళ్ళి' అనే పాట జనంలోకి విపరీతంగా చొచ్చుకుపోయే పాట. శబ్దం మీద తనకున్న పట్టు ఏమిటో సిరివెన్నెల ఈ పాట ద్వారా మరోసారి నిరూపించుకున్నారు. కావాలంటే పాటని సాహిత్యంలోని అక్షరం అక్షరంతో పట్టి పట్టి మరీ పాడుకొని చూడండి. తెలుగు మాటకింత తీయటి శక్తి ఉందా అని అనిపించితీరుతుంది. ఒక విధంగా ఆ భావన మరింతగా బలపడడానికి అటు సంగీత దర్శకుడిగా, ఇటు గాయకుడిగా కీరవాణి కాంట్రిబ్యూషన్ కారణం. పాటని ఎంత బాగా పాడవచ్చో ఈ పాటలో కీరవాణిని చూసి 'కొంతమంది' గాయకులు తెలుసుకోవాలి.

'అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ' అనే మకుటంతో



విడుదల : మయూరి
వెల : రూ. 38/-

ప్రారంభమయ్యే 'లాహిరి లాహిరిలో' అనే టైటిల్ గీతం - తెలుగు సినీ సంగీత చరిత్రలో ఎక్కువకాలం నిలిచిపోయే విధంగా స్వరపరిచారు కీరవాణి. ఫ్లూట్, వీణ, వయొలిన్, రిథమ్స్ ఈ పాటలో ఎంత చక్కగా వినిపించాయో, వాటి ప్లేస్‌మెంట్ ఎంత కుదురుగా అమరిందో వర్ణించి చెప్పటానికి భాష సరిపోదు. పాట మొదటి నుంచి- చివర్న వచ్చే ఇంటర్ లూడ్ దాకా మొత్తం పాటను ఒకసారి వింటేచాలు. కనీసం పదిసార్లయినా వినకుండా ఉండలేం. మళ్ళీ సినీసంగీత స్వర్ణయుగం నాటి రోజుల్లోకి తీసుకువెళ్ళిపోతుందీ పాట. పాడింది - సునీతతో పాటు ఉన్ని కృష్ణన్.

సోనూ నిగమ్, సునీత పాడిన 'నేస్తమా ఓ ప్రియనేస్తమా' పాట ప్రస్తుతం ట్రెండ్‌కి తగిన ట్యూన్. రచనాపరంగా సీతారామశాస్త్రి 'రెప్ప వెనకాల తొలి స్వప్నమా - ఉప్పునీరై ఉబికి రాకుమా' అనే వాక్యాల ద్వారా తన ప్రత్యేకతను నిలబెట్టుకుంటారు. 'మనసే ఒక పున్నమి జాబిలి' అంటూ ఒక నిముషం ఇరవై సెకండ్ల పాటు సాగే స్వరఖండిక కూడా హాయిగా ఉంది. ఈ ఖండికను రాసి, గంగతో పాటు పాడినది కీరవాణి.

'మంత్రమేదో వేసింది మత్తు మందు జల్లింది మాయచేసి పోయింది ఓ లాహిరి' పాట ఓపెనింగ్ నించే ఆకట్టుకుంటూ ఉంటుంది - ముఖ్యంగా యూత్‌ని! కుమార్‌సాను, చిత్ర పాడిన ఈ యుగళం ఓపెనింగ్‌లో 'కంటి చూపు చెపుతోంది కొంటె నవ్వు చెబుతోంది' (జీవిత చక్రం-శంకర్ జైకిషన్) పాట నడకను గుర్తుచేసినా మొత్తం అంతా కీరవాణి స్టయిల్‌లోనే సాగుతుంది.

ఉదిత్ నారాయణ్, చిత్ర పాడిన 'అనగనగా ఒక ప్రేమ... ఎంత పని ఎంతపని చేసేనమ్మా' పాట కూడా ముందు ఉదహరించిన యూత్‌ఫుల్ సాంగ్స్ స్థాయికి ఏమాత్రం తగ్గకుండా చక్కని విలువలతో దీటుగా నిలిచింది.

సుఖ్వీందర్ సింగ్, చిత్ర పాడిన 'నడుము వంపుల్లో నాట్యం చేసే జడగంటలనే చూస్తుంటే కిలిమిరే' పాట మాంచి ఊపున్న సాంగ్. ఇలాంటి పాటలు కీరవాణి ఇదివరకు చాలా చేశారు (ఏం పిల్లదీ ఎంత మాటన్నదీ - అల్లరి ప్రియుడు/ ఏం వెట్టి చేశాడే ఆ బ్రహ్మ - స్టూడెంట్ నెం.1)

అన్ని పాటలూ బాగా కుదరటమే కాకుండా కొన్ని పాటలని పరభాషా గాయకులు పాడినా మాట స్పష్టంగా వినిపించటానికి కారణం ఏమిటి... మిగిలిన చిత్రాలలో అలా ఎందుకు ఉండటం లేదు - ఈ ప్రశ్న ఆడియోని రెండుసార్లకు పైన విని, తెలుగుతనంపై నిజమైన గౌరవం ఉన్న ప్రతివారి హృదయంలో ఉదయించి తీరుతుంది.

## కొంటె కొశ్చెన్లు
## తుంటరి జవాబులు



వి.మంజురాణి - హైదరాబాద్

ప్ర॥ అసలైన అహింసావాది?

జ॥ చెయ్యెత్తి జై కొట్టడానికి కూడా భయపడే వాడు

ప్ర॥ కథ చెబుతున్నప్పుడు ఎందుకో "ఊ" కొడతారు?

జ ॥ 'ఆఁ" అంటే మళ్ళీ మొదట్నించీ మొదలెడతామోనని

ప్ర॥ 'పొయ్యి లోని పిల్లి కదల్లేదు' అంటే అర్థం ఏమిటి?

జ॥ ఆ ఇంట్లో ఎలుకలు అస్సలులేవని.

## ఈ రూటే వేరు



వేస్టేజ్: పనికి రాని వయసు

- సి.హెచ్.ఆర్.ఎన్.నాగేశ్వరరావు, కొత్తకొట్టం

ఆంటీ: టీ మీద

- జె.యస్.యన్.స్వామి, హైదరాబాద్

జ్ఞానోదయం: తెలివి తెల్లవారుట

- ఎస్.అవినాష్, నల్లకుంట



## పేరు - రిపేరు




రోజా - నువ్వు నాకు నచ్చావు - నువ్వు లేక నేను లేను

-శరత్, అక్కయ్యపాలెం.

అమృత - ఎంతబాగుందో

'ప్రేమ' 'అద్భుతం' 'పెళ్లి' 'ఆనందం'

-ఎస్.జ్యోత్స్న సురేష్, కర్నూలు.

## చిలిపి లిపి

Camel Street

Chain : ఒంటిపేట గొలుసు



Foot Juice: పాదరసం

TV - బ్లాక్ అండ్ వైట్ టి.వి.

- జె.యస్.యన్.స్వామి, హైదరాబాద్

## డబుల్ రోల్




1. ఆ 'గాది'లోని ధాన్యం
'ఉగాది' నాడు తీయించండి.
2. ఆ 'జర్నలిస్ట్' పేరుని జనరల్ 'లిస్ట్'లో
వేశారని బాధ పడ్డాడు.
3. 'ఆ - వాలు' గచ్చు మీద 'ఆవాలు'
ఎండ బెట్టకురా జారిపోతాయి.

-బి.చక్రవర్తి, రెడ్డిపల్లి.

## చిలిపి కవిత

### ఇదో రకం భార్య



నీ కోసం బ్రతుకుతూ
నిన్ను బ్రతికిస్తూ
నీకోసం ఛస్తూ
నిన్ను చంపుతూ....

- ఒక పాఠకుడు

## పేరడీ పేరేడ్



ఉందిలే ఎండాకాలం ముందు ముందునా
అందరూ బోరింగ్ కొట్టే సందు సందునా ॥ఉందిలే.....॥
వచనం:- ఏమిటేమిటీ.... ఎండలుంటున్నావ్?
అంత వేడిగా ఉంటాయా?
ఎందుకు సందేహమెందుకూ
రానున్న ఎండలో నీ ఒంతు అందుకో
ఆ రోజు అదిగో కలదూ నీ ఎదుటా.... ఆ.....
నీకే బాధలటా.... ఆ ... ఆ... ఆ... ॥ఉందిలే॥
వచనం:- బలె బలె అదెలా ఉంటుందో
ఇశిదంగా చెప్పు
రాజధాని తెగ రగిలే రోజు
నీటి బొట్టుకై చచ్చేరోజు
వారానికోసారి నీరొచ్చు రోజు
ఫైవ్‌రూపీస్కో సోడా లభియించు రోజు
ఆ రోజెంతో దూరం లేదు రన్నయ్యో
అదిగో చూడు 'రేపే' నేడు చిన్నయ్యో ॥ఆ రోజంతో॥
వచనం:- అందుకు కారణం ఏంటో
అదికూడా నువ్వే చెప్పు
అసలాలోచన ముందే లేక
ముందాలోచన అసలే లేక ॥అసలా॥
అంధత్వమై మన వైఖరియైతే
మూర్ఖత్వమే మన ఊపిరియైతే
పేదా గొప్పా బేధం లేక అందరూ
నెత్తి నోరూ కొట్టూకుంటూ ఉందురూ
ఆ రోజెంతో దూరం లేదు రన్నయ్యో
అదిగో చూడు 'రేపే' నేడు చిన్నయ్యో ॥ఆ రోజెంతో॥

(ఎన్.టి.ఆర్. 'రాముడు-భీముడు' సినిమాలోని
'ఉందిలే మంచికాలం ముందు ముందునా' పాట
ఆధారంగా)

- శేష్మ ,హైదరాబాద్

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : తుమ్‌కో న భూల్ పాయేంగే
దర్శకత్వం : పంకజ్ పరాశర్
గీతం : [illegible]
సంగీతం : సజిద్ - వజిద్
గానం : సోనూ నిగమ్
అభినయం : సల్మాన్ ఖాన్, సుష్మితాసేన్, దియా మీర్జా

# యే బేఖుదీ దీవానగీ...





యే బేఖుదీ, దీవాన్‌గీ,
తుమ్హీసే హై మేరీ జానే జానా
ఆశ్కీ, ఆవార్‌గీ
తుమ్హీసే హై మేరీ జానే జానా
జానే జా యే దిల్ మేరా
తుమ్‌కో భులా న పాయేగా

తుమ్ మేరే దిల్ మే( ఐసే బసే హో
జైసే కి దిల్ కీ ధడ్‌కన్ బనే హో
తుమ్‌కో మేరీ జాన్ ఖబర్ హీ నహీ హై
మేరే లియే తుమ్ క్యా బన్‌గయే హో ॥యే బేఖుదీ॥

చాహతా మై( తుమ్‌కో ఏ ఆశ్కీ హై
ఇస్ ఆశ్కీ మే( ఇక్ బేఖుదీ హై
ఏ బేఖుదీ హీ దీవానాపన్ హై
దీవానేపన్ మే( ఆవారగీ హై ॥యే బేఖుదీ॥

ఫిల్మ్స్ వారు ఇంతకుముందు ఇశ్క్ (1997) ప్యార్‌తో హోనా హీ థా (1998), దుల్హన్ హమ్ లే జాయేంగే (2000) వంటి మంచి హిట్స్ తీసారు. దుల్హన్ హమ్ లే జాయేంగే హీరో సల్మాన్‌ఖాన్‌ను ఈ సినిమాలో కూడా రిపీట్ చేయడం జరిగింది. అతనికి జంటగా ఇద్దరు హీరోయిన్లు - సుస్మితాసేన్, దియా మీర్జా నటించారు. "ది లాంగ్ కిస్ గుడ్‌నైట్" అనే ఆంగ్లచిత్రం ఆధారంగా ఆధారపడి తీసిన చిత్రమిది.

పంకజ్ పరాశర్ దర్శకత్వం ఈ చిత్రంలో కొన్నిపాటలకు (క్యోం ఖన్‌కే తేరీ చూడీ, యే బేఖుదీ దీవాన్‌గీ) ఫజిద్-వాజిద్ సంగీతం సమకూర్చగా, మరికొన్ని పాటలకు (బిందియా చమ్‌కే చూడీ ఖన్‌కే, మెహందీ హై లగీ మరే హాథోం మే(, క్యా హువా తుఝే) దాబూ మాలిక్ సంగీతం ఇచ్చారు.

ఇంతకు ముందు మూడు సినిమాలు ప్రేమపై ఆధారపడి తీసినవే. ఈ సినిమాలో కాస్తయాక్షన్, ఫైట్లు కూడా కలిపేరు. అందుచేత సల్మాన్‌ఖాన్‌కు తన కండలు వేరేరకంగా కూడా ప్రదర్శించే అవకాశం వచ్చింది. సినిమా అట్టహాసంతోనే రిలీజయ్యింది కానీ అంత బాగా లేదని విమర్శలు వచ్చాయి. ఫస్ట్ హాఫ్‌లో ఉన్నంత పట్టు రెండవ హాఫ్‌కు లేదని ప్రేక్షకుల అభిప్రాయం.

ఫస్టు హాఫ్‌లో పట్టు ఉండడం సహజం. ఎందుకంటే కథ అలాటిది. రాజస్థాన్‌లో సల్మాన్‌ఖాన్ ఒక జమీందారుగారి ఏకైక పుత్రుడు. అతని ప్రియురాలు ఓ పల్లెటూరి ముగ్ధ మోహన సుందరి - దియామీర్జా.

సల్మాన్‌ఖాన్ ఒక మానసిక రోగంతో బాధపడుతూంటాడు. ఎవరితోనో యుద్ధం చేస్తున్నట్లు, తననెవరో కాలుస్తున్నట్లు ఇలా పగటికలలు, రాత్రి కలలు. చిన్నప్పుడు తగిలిన గాయం వల్ల తాత్కాలికంగా స్మృతి కోల్పోయి వుండవచ్చనుకున్నా అతని తల్లితండ్రులు కూడా ఆ చిక్కుముడి విప్పే ప్రయత్నం చేయరు.

చివరికి ఆ పల్లెటూరి పిల్లను పెళ్ళి చేసుకోబోతుంటే కొంతమంది గూండాలు అతన్ని అటాక్ చేయడం జమీందారు గారు పెదవిప్పడం జరుగుతుంది. జమీందారు అసలు కొడుకు అర్బాజ్‌ఖాన్ మరణించాడు. నది వద్ద దెబ్బతిని పడివున్న సల్మాన్‌ఖాన్‌ను ఆయన తెచ్చి పెంచుకుంటున్నాడు. ఇక సల్మాన్‌ఖాన్ తన గతజీవితాన్ని వెతుకుతూ ముంబయ్ చేరతాడు.

అక్కడ అతన్ని ప్రేమించిన సుస్మితాసేన్, పట్టుకుందామని చూసే పోలీస్ కమీషనర్ - అందరూ తారసిల్లుతారు. ఇక అక్కణ్నుంచి యాక్షన్ బిగిన్. కానీ గ్రిప్ కోల్పోయింది కూడా అక్కడే.

నిన్ను నేను మరువలేనని సినిమా టైటిల్. ఇది టైటిల్ సాంగులాటిదే. ఎందుకంటే హీరోగారు ఈ పాటలో ప్రేమ కలిగించే లక్షణాలు ఏకరవు పెట్టి -నాలో అటువంటి భావాలు కలిగించిన నిన్ను నా హృదయం ఎలా మర్చిపోగలదు అంటున్నాడు. తన శరీరం తన వశంలో లేకపోయినా, ఆవారాగా తిరిగినా తప్పంతా తన హృదయందీ, దానిని అలా తయారు చేసిన హీరోయిన్‌దీ నన్నమాట.

పల్లవిలో కనబడే బేఖుదీ అంటే కంట్రోలులో లేకపోవడం. ఏదైనా మాటకు "బే" అని చేరిస్తే వ్యతిరేకార్థం వస్తుంది. బేకరార్ (శాంతి లేకపోవడం), బేకసూర్ (తప్పు చేయనివాడు) ఇలా అనేకం వింటాం. బేకార్ (పనికిరానివాడు, పనికిరానిది) అనేది ఇంకా తరచుగా వింటాం. బేఖుదీ అంటే తనపై తనకు కంట్రోల్ లేని పరిస్థితి. దీనాన్‌గీ అంటే మతిభ్రష్టత్వం కానీ మతిభ్రష్టుడయినవాడిని దీవానా అనరు. పాగల్ అంటారు. ప్రేమ పిచ్చివాడు అని తెలుగులో కామన్‌గా అనేసినా హిందీలో వచ్చేసరికి ప్రేమపిచ్చి ఉన్నవాణ్ణి దీవానా అనీ, మతిభ్రష్టుడయినవాడిని పాగల్ అనీ అంటారు. ఆషిక్ అంటే ప్రేమికుడు, "మై ఆషిక్ హూఁ బహారోంకా" అని రాజ్‌కపూర్ తెరపై పాడిన పాట వినేవుంటారు. ఆషికీ అనే పేరుతో వచ్చిన సినిమా చూసేవుంటారు. ఆవారా అంటే పనీపాటా లేకుండా తిరిగే జులాయ్ కానీ ఆ పేరు చెప్పగానే గుర్తొచ్చేది ఒక గొప్ప సినిమా, ఆ సినిమా టైటిల్ సాంగ్. ఆ బాణీకి ముగ్ధులయిపోయిన రష్యన్లు "ఆవారా హూఁ" అని పాడుతూ పులకించిపోతారట. మరి అర్థం తెలుసో లేదో! గీ అని చివర చేర్చడం వల్ల "తనము" అని అర్థం వస్తుంది.

**ఈ మైమరపు, ఈ వెర్రి**
**నీవల్లనే సుమా**
**ఈ ప్రేమా, ఈ తిరుగుడూ**
**నీవల్లనే నా ప్రాణానికి ప్రాణమా**
**నా మనసు నిన్నెలా మరువగలదు?**

కానీ కళ్ళకు నిద్దుర రాదనీ, మరోటనీ ప్రేమ వల్ల ప్రభావితులయిన చాలామంది ఫిర్యాదులు చేస్తారు. దానికి కారణభూతులయిన వారికి మాత్రం ఈ గొడవలన్నీ తమ వల్లనేనని తెలియవు. ఖబర్ అంటే వార్త అనే అర్థంతో బాటు ఎరుక అనే అర్థంలో కూడా వాడతారు. ఖబర్ నహీ అంటే తెలియకపోవడం. మన తెలుగు కబురు ఖబర్‌నుండే వచ్చిందంటారు. ధడ్‌కన్ చాలా హిందీపాటల్లో వినేవుంటారు. గుండె చేసే చప్పుడే ధడ్‌కన్.

**నా గుండెలో నువ్వు గూడుకట్టావు**
**గుండె సవ్వడిగా మారి పోయావ్**
**నాకెంత విలువైనదానివయ్యావో**
**నీకే తెలియదు పాపం**

నా బాధ తెలియాలంటే నువ్వూ ఆ పరిస్థితిలో ఉండాలి అని కోరుకుంటున్నాడు ప్రేమికుడు. నీకూ నాలాగే ప్రేమ పుడితే నేను పడే అవస్థలు నువ్వూ పడతావ్. అప్పుడు ఒక్కొక్కటీ అనుభవిస్తావ్. ముందు ప్రేమ, ఆ తర్వాత మైమరపు. దానినుండి వెర్రి, ఆ వెర్రితనంవల్ల పిచ్చిపట్టినట్లు తిరగడం. అదీ లక్షణాల వరస. ప్రేమికుల వరస.

**నీకూ ఈ ప్రేమ రగిలితే బాగుండును**
**ఈ ప్రేమలోనే  ఓ మైమరపు**
**ఈ మైమరపు కూడా ఓ వెర్రే**
**ఆ వెర్రిలో పిచ్చి పట్టినట్లు తిరగడం.**

ఈ పాటలో ఉపయోగించిన పదాలు చాలా తక్కువ కానీ ప్రేమను వర్ణించడానికి ఇంతకంటె ఎక్కువ అక్కర్లేదనన్నట్టు చెప్పాడు. పాడిన తీరు చాలా ఆకట్టుకునేట్టు ఉంది. సాహిత్యపు విలువలు ఎక్కువ లేకపోయినా సూటిగా గుండె తట్టినట్లు ఉండే పాట ఇది. వినిచూడండి.

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**




**తెలుగు సినీ చరిత్రలో 1955వ సంవత్సరం ఇచ్చిన ఆణిముత్యాలలో ఒక చిత్రాన్ని ఖచ్చితంగా ప్రస్తావించి తీరాలి. ప్రసిద్ధి చెందిన బెంగాలీ కథ 'స్వయం సిద్ధ' ఆధారంగా తీసిన ఆ చిత్రానికి సర్వజనామోదం పొందే చిత్రాలు తీసే 'పీపులయ్య'గా ముద్రవేయించుకొన్న పి. పుల్లయ్య దర్శకుడు. సంగీత దర్శకుడు భీమవరపు నరసింహారావుతో ఆయన కలసి స్థాపించిన రాగిణీ సంస్థ ద్వారా తీసిన ఆ చిత్రం**




బి.యన్.ఆర్. గా పిలువబడే భీమవరపు నరసింహారావు తెలుగు సినీ సంగీతంలో ఓ మలుపు తీసుకొచ్చిన వ్యక్తి. అంత వరకు రాగయుక్తంగా, కొంత శాస్త్రీయంగా ఉండే సినిమా పాటలలో జానపదరీతుల్ని ప్రవేశపెట్టి వాటికి జనరంజకత్వాన్ని కలగజేసిన కళాకారుడు. విచిత్రం ఏమిటంటే ఈయన సంగీత విద్వాంసుడు కాదు. ఎవరి దగ్గరా సంగీతం నేర్చుకోలేదు. ఎనిమిదో ఏట నుంచీ నాటకాల్లో వేషాలు వేస్తూ పాటలు పాడుతూ ఉండేవారు. ఓ రోజు హార్మోనియం వాయించాలని కోరికపుట్టి తనంతట తానే సాధన చేసి మంచి పట్టు సంపాదించుకున్నారు. ఆ కృషిలో రాగాలను తెలుసుకోవటం, స్వరకల్పన చేయటం అబ్బింది. ఆయనకు సిగిరెట్లు కాల్చే అలవాటు విపరీతంగా ఉండేది. అందుకు డబ్బు కావాలి కనుక అప్పట్లో థియేటర్లలో నడిచే మూకీ చిత్రాలకు నేపథ్య సంగీతంలా హార్మోనియం వాయించేవారు. అలా అంచెలంచెలుగా ఎదుగుతూ సినిమాలకు సంగీత దర్శకత్వం వహించే అవకాశాలను అందుకోగలిగారు. 'మాలపిల్ల' చిత్రంలో 'నల్లవాడే గొల్లపిల్లవాడే' పాటతో ఆయన పేరు ప్రభంజనంలా ఆంధ్రదేశాన్ని చుట్టేసింది. బి.యన్.ఆర్. నటుడు కూడా కావటంచేత 'రైతుబిడ్డ', 'తిరుగుబాటు', 'అర్ధాంగి', 'చిరంజీవులు', 'మహామంత్రి తిమ్మరుసు' చిత్రాలలో నటించారు. 'రైతుబిడ్డ' చిత్రంలో కాసా సుబ్బన్న పాత్రను ఆ తరం వారు నేటికీ మర్చిపోలేరు. ఈ 'అర్ధాంగి' చిత్రంలో ఆయన ఓ పాత్రను ధరించటమేకాక ఎడిటింగ్ బాధ్యతను కూడా నిర్వహించారు.


అర్ధాంగిలో సావిత్రి, బి.యన్.ఆర్


అర్ధాంగిలో దొరస్వామి, బి.యన్.ఆర్, గుమ్మడి

రచన, శ్రావ్యత పాటకు ముఖ్యమైనవని, ఆ రెండింటినీ ఐక్యంచేస్తూ సంగీత దర్శకుడు పాటను స్వరపరచాలని నమ్మే బి.యన్.ఆర్. - ఆత్రేయ రాయగా 'అర్ధాంగి' చిత్రం ద్వారా అందించిన పాటలలో ఓ అయిదు:

**రాధను రమ్మన్నాడు**
**రాసక్రీడకు మాధవదేవుడు**
**రాధను రమ్మన్నాడు**
**నల్లనివాడు అల్లరివాడు**
**నమ్మినవారికి చల్లనివాడు**
**ముల్లోకాలను పిల్లనగ్రోవితో**
**మురిపించే మోహనకృష్ణుడు ॥రాధను॥**
**గోపాలుడు మా పాలిటి దేవుడు**
**రేపల్లెకు తానెపుడూ పాపడు**
**చల్లను తెచ్చే గొల్లపిల్లతో**
**సరసాలాడుచు ఉన్నాడు**
**యమునాతటిలో ఉన్నాడు**
**ఇది అనువౌ సమయం అన్నాడు**
**యశోదమ్మకీ విషయాలేవీ**
**తెలుపవద్దనీ బ్రతిమాలాడూ ॥రాధను॥**



ఈ పాటను ఆకుల నరసింహారావు పాడేరు. సినిమాలో ఓ హరిదాసు (పాత్రధారి పేరు బెంగుళూరు రంగస్వామి) ఇల్లిల్లూ తిరుగుతూ హీరోయిన్ (సావిత్రి) ఇంటి ముందు ఆగి పాడే పాట యిది. అప్పట్లో మన తెలుగు సినీ సంగీతంపైనా, రంగస్థల సంగీతంపైనా మరాఠీ నాటక గీతాల ప్రభావం ఉండేది. ఆ వరుసల ప్రభావం ఆధారంగా కూర్చిన ఈ పాటలో కొంతవరకు ఖమాజ్, మోహన, యమన్ వంటి రాగాల ఛాయలను అక్కడక్కడ కనిపించేట్టుగా ట్యూన్‌ని రూపొందించారు. 'పాట పాడటం' అనే వ్యాపకాన్ని నిజాయితీగా స్వీకరించే ప్రతి వారూ చిత్తశుద్ధితో సాధన చేయదగ్గ ట్యూన్ యిది. ఇలాంటి వరసల్ని ప్రాక్టీస్ చెయ్యటం వలన గాత్రానికి సుస్వర వ్యాయామం జరుగుతుంది.

ఎక్కడమ్మా చంద్రుడూ? చుక్కలారా, అక్కలారా
నిక్కి నిక్కి చూతురేల ఎక్కడమ్మా చంద్రుడూ...?
చక్కనైన చంద్రుడు ఎక్కడమ్మా కానరాడు
మబ్బు వెనుక దాగినాడో మనసులేక ఆగినాడో ॥ఎక్కడమ్మా॥
పెరుగునాడు తరుగునాడు ప్రేమ మారనిసామి, నేడు
పదము పాడి బ్రతిమలాడి పలుకరించిన పలుకడేమి! ॥ఎక్కడమ్మా॥
చక్కనైన చంద్రుడు ఎక్కడమ్మా కానరాడు
ఏలనో కానరాడు ఎక్కడమ్మా చంద్రుడు
చక్కనైన చంద్రుడు ఎక్కడమ్మా చంద్రుడూ...!



ఈ పాటను జిక్కి పాడగా ప్రధాన పాత్రధారిణిగా సావిత్రి అభినయించింది. సన్నివేశపరంగా అక్కినేని నాగేశ్వరరావు కూడా కనిపిస్తారు. తాళికట్టిన వానికి బుద్ధిమాంద్యం అని తెలుసుకున్న కథానాయిక కన్నీళ్ళతో అతడి బాధ్యతను స్వీకరించి అతడిని నిద్రబుచ్చే సన్నివేశంలో పాడిన పాట యిది. పీలూ రాగచ్ఛాయలలో ఈ పాట స్వరపరచబడింది. భార్యాబిడ్డలు (1971) అనే చిత్రంలోని 'చక్కనైన చందమామ ఎక్కడున్నావూ నీవు లేక దిక్కులేని చుక్కలైనాము' అనే పాటను ఆత్రేయ రాసేటప్పుడు 'అర్ధాంగి'లో తను రాసిన ఈ 'ఎక్కడమ్మా చంద్రుడు' పాటకు సంబంధించిన తునకలు జ్ఞాపకాలతో రవ్వంతైనా మెదిలి ఉండాలి.



వద్దురా కన్నయ్య ఈ పొద్దు ఇల్లువదలి పోవద్దురా అయ్య
పశువులింటికి తిరిగి పరుగులెత్తేవేళ
పసిపాలను బూచి పట్టుకెళ్ళేవేళ ॥వద్దు॥
పట్టు పీతాంబరము మట్టిపడి మాసేను
పాలుగారె మోము గాలికే వాడేను ॥వద్దు॥
గొల్లపిల్లలు చాల అల్లరి వారురా
గోలచేసి నీపై కొండెములు చెప్పేరు ॥వద్దు॥
ఆడుకోవలెనన్న పాడుకోవలెనన్న
ఆదట నీకున్న అన్నిటను నీదాన



కాఫీ రాగంలో స్వరపరచబడిన ఈ పాట పాడినది జిక్కి. తెరపై అభినయించినది సావిత్రి, అక్కినేని. బుద్ధిమాంద్యంగల తన భర్తను ప్రజ్ఞావంతుడిగా తీర్చిదిద్దే ప్రయత్నంలో కథానాయిక ఉండగా ఓ రోజు ఆమెకు తెలియకుండా ఆ భర్త బయటికి దొంగతనంగా వెళ్ళిపోతున్న సమయంలో ఆమె పాడే పాట యిది. ఇటువంటి సన్నివేశాలకు ఈ రోజులలో ఎటువంటి పాటలు వస్తాయో ఊహించుకుంటే ఈ పాట గొప్పతనం మనకు తెలియకుండానే తెలిసిపోతుంది.

ఈ పాటకు సంబంధించినదే మరొక విషయం : స్వరకర్త బి.యన్.ఆర్. ఎవ్వరి దగ్గరా సంగీతం నేర్చుకోకపోవటం వలన - ఈ పాటను కొంత క్లాసికల్ బ్యాగ్రౌండ్‌తో ట్యూన్ చెయ్యాలను కోవటం వలన- మరొక సంగీత దర్శకుడు అశ్వత్థామను పిలిపించారు. బి.యన్.ఆర్. అంటే అశ్వత్థామకి, అశ్వత్థామ అంటే బి.యన్.ఆర్.కి మంచి గౌరవం ఉండేది. అంచేత 'వద్దురా కన్నయ్య' మొత్తం పాటంతా అశ్వత్థామే ట్యూన్ చెయ్యటం జరిగింది, ఈ పాటకు స్వరకర్తగా అశ్వత్థామ పేరు వేస్తానని రాగిణి సంస్థ భాగస్వామి హోదాలో బి.యన్.ఆర్. అన్నా... అశ్వత్థామ మర్యాదగా, మృదువుగా 'దాన్దేముందండీ' అంటూ ఒద్దన్నారని 'అర్ధాంగి' చిత్రానికి అసోసియేట్ డైరెక్టర్‌గా పనిచేసి, తర్వాతి రోజుల్లో దర్శకుడుగా ఎన్నో చిత్రాలను తీసిన ఆమంచర్ల శేషగిరి రావు చెప్పారు.

రాక రాక వచ్చావు చందమామ
లేక లేక నవ్వింది కలువభామ...
మబ్బులన్ని పోయినవి మధుమాసం వచ్చినది
మరులుకొన్న విరికన్నె విరియబూసి మురిసింది
లేక లేక నవ్వింది కలువభామ ॥రాక॥
రేకులన్ని కన్నులుగా లోకమెల్ల వెతికినది
ఆకసాన నినుజూచి ఆనందం పొంగినది
లేక లేక నవ్వింది కలువభామ ॥రాక॥
తీరని కోరికలే తీయని తేనియలై
వెన్నెల కన్నులలో వెల్లివిరిసి మెరిసినవి...
దొంగలాగ దూరాన తొంగి చూతువేల
రావోయి రాగమంత నీదోయి ఈరేయి
రాక రాక వచ్చావు చందమామ లేక లేక నవ్వింది కలువభామ






ఈ పాటను జిక్కి పాడగా ప్రధాన పాత్రధారిణిగా సావిత్రి, సన్నివేశపరంగా అక్కినేని అభినయించారు. ఈ పాటకు యమన్ రాగం ఆధారం. కానీ 'రేకులన్ని కన్నులుగా లోకమెల్ల వెతికినది' అనే రెండవ చరణంలోని మొదటి రెండు పంక్తులకు మోహనలాగ బాణీని కూర్చి తిరిగి తరువాతి పంక్తులకు యమన్ లోకి రావటం జరిగింది.

బుద్ధి మాంద్యంతో వెనక బడ్డ భర్తను సంపూర్ణమైన వ్యక్తిత్వం గల ప్రజ్ఞావంతుడిగా తీర్చి దిద్దిన తరువాత కథానాయిక తన జీవిత భాగస్వామితో హాయిగా పాడుకునే సందర్భానికి రాసిన పాట ఇది. సన్నివేశం డిమాండ్ చేసినా సరే సభ్యత, సంస్కారం దిగజారని రోజులవి. అందుకే ఈ పాట సంగీత సాహిత్యాలలో ఆ పవిత్రత అణువణువుణా తొణికిసలాడుతూ కనిపిస్తుంది. మనసు కవి ఆత్రేయ మనసు అనే పదాన్ని ఉపయోగించకుండా చాలా పాటలు రాశారని వాటిలో మనసు పెట్టి రాసిన మరో మనసైన పాట ఇదని తెలిస్తే కొందరికి ఆశ్చర్యంగానే ఉంటుంది మరి.

సిగ్గేస్తదోయ్ బావ సిగ్గేస్తదీ
మొగ్గలేను ఒగ్గలేను
మొగమెత్తి చూడలేను ॥సిగ్గే॥
పచ్చికా బయలులోన
మచ్చికగా మనముంటే
సిగ్గులేని చందమామ
చాటుగుండి చూస్తాడు ॥సిగ్గే॥
రెప్పలార్పకుండా ని
న్నెప్పుడైనా చూస్తినా
టక్కులాడి చుక్కలన్ని
ఫక్కుమని నవ్వుతాయి ॥సిగ్గే॥




గుట్టుగా చెట్టుక్రింద
గుస గుసలు చెప్పుకుంటే
చెట్టుమీది పిట్టలన్ని
చెవులు నిక్కబెడ్తాయి ॥సిగ్గే॥
ఎందుకో అందరికి
ఇంత ఈసు మనమంటే
ఎవ్వరూ చూడలేని
ఏడకైన ఎళ్దాము ॥సిగ్గే॥




ఈ పాటను పి.లీల పాడగా కథానాయకుడు (అక్కినేని) తమ్ముడు (జగ్గయ్య)ని వలలో వేసుకున్న యువతిగా నటించిన సురభి బాలసరస్వతి అభినయించింది. యమన్, బేహాగ్, గౌడ్ సారంగ్ రాగాల ఛాయలను కలుపుకుంటూ జానపద శైలిలో బాణీని సమకూర్చారు. ఎక్కడైనా జానపద నృత్యాలు జరుగుతుండగా ఈ పాటకు వేరే నృత్యరీతులను జతచేసి ప్రదర్శిస్తే 'మొక్కజొన్న తోటలో' పాటకు దీటుగా నిలబడదగ్గంత విషయం ఉంది ఈ పాటలో.

పైన పేర్కొన్నవే కాక చరిత్రపరంగా ఇంకొన్ని విషయాలు ఉన్నాయి ఈ చిత్రంలో. 'అర్ధాంగి' పేరిట తెలుగులోను 'పెణ్ణిన్ పెరుమై' పేరిట తమిళంలోనూ ఈ 'స్వయం సిద్ధ కథ'ను నిర్మించటం జరిగింది. రెండిటికీ దర్శకుడు పి. పుల్లయ్యే. తెలుగులో అక్కినేని, జగ్గయ్య వేసిన పాత్రలను తమిళంలో జెమినీ గణేశన్, శివాజీ గణేశన్ నటించారు. రెండు వెర్షన్స్‌లోనూ సావిత్రి కామన్. ఈ కథను వినిపించగానే నాగేశ్వరరావు రోల్ అయితేనే వేస్తానని జెమిని గణేశన్ పట్టుబడ్డాడట. మరి శివాజీ ది నెగిటివ్ రోల్ అవుతుంది కదా అని పుల్లయ్యగారు ఫీలవుతుంటే - "వాటెవర్ రోల్ యు గివ్ ఐ విల్ డూ ఇట్ డాడీ"... - అని శివాజీ గణేశన్ అని ఆ నెగిటివ్ రోల్‌ని ఆనందంగా స్వీకరించి అద్భుతంగా పోషించారు. దటీజ్ శివాజీ" అంటూ చెప్పారు ఆమంచర్ల శేషగిరిరావు. ఇవాల్టి ప్రముఖ దర్శకుడు శ్రీ కె. రాఘవేంద్రరావు ఆనాడు పుల్లయ్యగారికి అసిస్టెంట్‌గా దర్శకత్వ శాఖలో పనిచేయటం ఈ చిత్రానికి సంబంధించిన మరో విశేషం!



# సుతిమెత్తని గళం అతి మెత్తని హృదయం కలగలసిన స్వర పారిజాతం ఏ.ఎం.రాజా



-పి.బి.శ్రీనివాస్

చలన చిత్ర సంగీత చరిత్రలో తనదైన అగ్రస్థానాన్ని గడించి, ఆక్రమించి పదిలపరుచుకున్న గాయక సంగీత నిర్దేశకులుగా వెలుగొంది వెలుగు లీనిన కళాకారులు కీ॥ శే॥ శ్రీ ఏ.ఎం.రాజా.

ఆంగ్లంలో ఏ.ఎం. (A.M.) అనే అక్షరాక్షరద్వయం ప్రభాత సూచకం! కనుక, A.M. రాజా అంటే వెలుగుల రవి అని స్ఫురిస్తుంది. ఆయన కంఠస్వరమూ, స్వరరచనా కూడా అతి తేలికగా, పిల్లగాలిలాగా, చల్లని హాయి చేకూర్చేవి. ఒకానొక చిత్రంలో, బండితోలుతూ, ఆ చిత్ర నాయకుడు "ఆహోహో! భలే చిఱుగాలి" అని పాడతాడు. ఆ పాట పాడిన వారు రాజాగారే. పాటలోని మాటలలోని "చిఱుగాలి" లాగే ఆయన లలిత గాత్రంలో ఆ పాటకూడా తేలి హృదయాలని తేలిస్తుంది.

చెన్నపురి ప్రెసిడెంసీ కాలేజీల్లో డిగ్రీ చదువు చదివే రోజుల్లో, నా చిన్ననాటి ఆత్మీయ మిత్రుడు M.S. శ్రీరామ్‌తో రాజాకి పరిచయం ఏర్పడింది. అది క్రమంగా పెరిగి స్నేహమై, ఇద్దరూ చెట్టాపట్టాలేసుకుని తిరిగేవారట. కలిసే, సినిమాలకెళ్ళే వారట. శ్రీరాం, ప్రఖ్యాత వీణావిరించి శ్రీ ఈమని శంకరశాస్త్రిగారి మేనల్లుడు.

శ్రీ శంకరశాస్త్రి గారు అప్పట్లో జెమినీ స్టూడియోలో నెల జీతం తీసుకుంటూ పని చేసిన 'ఆస్థాన సంగీత విద్వాంసులలో అతిముఖ్యులు'. జెమినీ ఎస్.ఎస్.వాసన్‌గారికి అత్యంత ప్రియకళాకారులు. వాసన్‌గారు 'సంసారం' తెలుగు చిత్రానికి హక్కులు కొని తీసుకుని జెమినీ బేనర్‌లో అదే పేరుతో (సంసారం) తమిళ చిత్రాన్ని తిరిగి నిర్మించారు. ఆ చిత్రానికి శ్రీ శంకరశాస్త్రి సంగీతం అందించారు. టైటిల్ సాంగ్ తెలుగులో ఘంటసాల దిగ్రేట్ పాడారు. పెద్ద హిట్ సాంగ్ అయింది. సుసర్ల దక్షిణామూర్తి కట్టిన మట్టునే ఉపయోగించవలసిందిగా వాసన్‌గారు శాస్త్రిగారిని కోరారు. అప్పటికి శ్రీరాం ద్వారా రాజా గాత్రాన్ని వినిమెచ్చుకుని వుండటం వలన ఆ పాటకి రాజా పేరు సూచించే సరికి, శ్రీ వాసన్ సమ్మతించారు. రాజా ఆ పాటని చాలా లలితంగాను, భావయుక్తంగాను ఆలపించారు - తన బాణీలోనే! అదికూడా తెలుగులో లాగే గొప్పహిట్టు. చిత్రం కూడా జూబిలీ హిట్టయే సరికి, ఎ.ఎం.రాజా పేరు నేపథ్యగాయకుల జాబితాలో చేరింది. క్రమక్రమంగా హిట్ సాంగ్స్ పాడి, చాలా పాప్యులర్ సింగర్‌గా పరిగణింపబడ్డారు ప్రజలచేత. ఏ.ఎన్.ఆర్.కీ ఎన్.టి.ఆర్. గారికీ కూడా పాడే సదవకాశాలు రావడంతో రాజా ప్రాముఖ్యం పెరిగింది.

బహుముఖ ప్రజ్ఞావతి శ్రీమతి భానుమతి గారి "విప్రనారాయణ"లో శ్రీ ఎస్.రాజేశ్వరరావు గారి సంగీత నేతృత్వంలో రాజా ఏఎన్నార్‌కి పాడిన పాటలు బహుళ ప్రజాదరణ పొందాయి. "చూడుమదే చెలియా" అనే పాట రాజా గారికి, అత్యధిక ఖ్యాతి నార్జించి పెట్టింది. అలా అలా రాజా పాడిన పాటలు, వందలూ వేలూ అయ్యాయి. తెలుగు తమిళాలలోనే కాక కన్నడ, మలయాళ చిత్రాలలో కూడా అగ్రనాయకులకి రాజా పాడి, తనయశస్సుని పెంపొందించుకున్నారు. కన్నడంలో టి.జి. లింగప్ప గారి సంగీతంలో 'స్కూల్ మాస్టర్' చిత్రంలో "అతిమధురా అనురాగ" అనే యుగళ గీతం కన్నడ దేశంలో ప్రతిరోజూ మోగుతూ వుండేది. ఆనాడు డా॥ రాజ్‌కుమార్‌గారికి ఒక టాప్ రేంజ్ సాంగ్ చాలా బాగా పాడారు. ఇటీవల నేను వినడం తటస్థించింది. మంచి పటువుగా పాడారు. మలయాళంలో సరేసరి. పి.లీలగారితో డ్యూయెట్స్, సోలో పాటలూ అధికంగానే పాడే వారు. ప్రేంనజీర్, సత్యన్ వంటి ప్రముఖ హీరోలకి కొన్ని హిందీ డబ్బింగు చిత్రాలలో కూడా ఆయనకి అవకాశాలు లభించాయి. సుతిమెత్తని గాత్రంలాగే, వెన్నకన్న మృదువైన స్వభావం. తను నొచ్చుకునే వారే తప్ప ఇతరులని నొప్పించే గుణమే లేదు.

"అహ్" అనే హిందీ చిత్రాన్ని నిర్మించిన రాజ్‌కపూర్, దాన్ని తెలుగులోకీ, తమిళంలోకీ డబ్బింగు చేస్తూ వుండిన సందర్భాన అందులో లతా ముఖేశ్‌లు పాడిన పాటలు పాడేందుకు జిక్కీ, రాజాలు ఎన్నికైనారు. ఆరుద్రగారి రచనలు, "పందిట్లో పెళ్ళౌతున్నాది", "విధిరాకాసి కత్తులు దూసి", "పాడు జీవితమూ" మున్నగు గీతాలు అశేష రసికలోకాన్ని ఉర్రూత లూగించాయి. ఆ చిత్రం తరువాత జిక్కీ రాజాలు కలిసి పాడే వివాహ జీవితము ప్రారంభమైంది. ఆ చిత్రగీతాల ధ్వని ముద్రణ సమయాన "బాంబే" లోనే ఈ ఇద్దరి "ప్రేమా" - లేఖలు వ్రాసుకొందో లేదో కాని, చూపులు కలిసి, మనసులు కలిసి, అతిత్వరలోనే పెళ్లికి దారితీశాయి.

"ప్రేమలేఖలు" చిత్రం ద్వారా వీరికి పెళ్లి కుదిరింది. కుటుంబం మూడు పువ్వులూ ఆరు కాయలుగా అభివృద్ధి చెంది, 'పెద్ద సంసారం'గా రూపొందింది.



'ప్రేమలేఖలు' ద్వారా చేరువైన గాత్రద్వయం-రాజా, జిక్కీ

వివాహం పిదప, కొన్నేళ్లు ఇద్దరూ మంచి డిమాండులో వున్న "గాన దంపతులుగా" విలసిల్లారు. అనేక చిత్రాల్లో కలిసి, సుమధుర జనరంజక గీతాలూ, యుగళ గీతాలూ పాడారు.

శ్రీధర్ నిర్దేశించిన "పెళ్లికానుక" చిత్రానికి, రాజా ప్రప్రథమంగా సంగీత దర్శకత్వం వహించారు. ఆ చిత్రం సెన్సేషనల్ హిట్ కావడంతో, మొదటి చిత్రంతోనే రాజా సంగీత దర్శకులుగా కూడా స్థిరపడ్డారు. పాటలు కూడా రికార్డు సృష్టించి, పాత రికార్డులని బ్రేక్ చేశాయి. చాలా ఏళ్లు తమ సంగీత రాజ్యాన్ని రాజా ఏలారు. అరవంలో అదే శ్రీధర్ డైరెక్ట్ చేసిన "తేన్‌నిలవు" అనే చిత్రంలో రాజాపాడిన సోలో "కాలైయుంనీయే, మాలైయుం నీయే" అనే పాట లలిత శాస్త్రీయ సంగీత పుష్పపరిమళాలు సంతరించుకుంది. ఆ పాటలో శ్రీమతి సంగీత జానకి (ఎస్.జానకి) ఆలపించిన హమ్మింగు పాడిన వైనమై, బంగారానికి తావి అబ్బినట్లు ఆ పాటకి వైశిష్ట్యాన్ని అందించాయి. వైజయంతీమాల, జెమినీ గణేశన్‌లపై చిత్రీకరింపబడిన ఆ పాట ఆ చిత్రానికంతటికీ - 'హైలైటై' నిలిచింది. కూర్చోలేదు - 'పెళ్లికానుక' చిత్రం తమిళ వెర్షన్‌లో సుశీలా రాజాల 'వాడిక్కై మఱందదు ఏనో' అనే యుగళగీతం స్వరాజాలపాత్మై ప్రవహించింది.

నేను 'చిత్రరాగం'లో ప్రవేశించే సరికే, రాజా, రాజాలా చిత్రసంగీత సీమని పాలిస్తూ వుండే వారు. క్రమేణా, నాకూ జనాదరణ లభించడం వలన, ఆయన సంగీతంలో రెండు మూడు పాటలు పాడే అవకాశాలు లభించాయి. ముఖ్యంగా "విడి వెళ్లి" చిత్రంలో జిక్కీగారు నేనూ పాడిన "పణ్ణోడు పిఱందదు తాళం" అనే పాట గొప్ప హిట్టయ్యింది. "పురియాదు పురియాదు" అనే అశరీర గీతం (Back Ground Song) "ఆడిప్పెరుక్కు" అనే చిత్రానికి పాడాను. పాటకి తగిన చక్కని ట్యూన్ కట్టారు రాజా ఆ పాటలో. "జీవిత రహస్యం ఎవరికీ అర్థం కాదు. అనే తాత్పర్యం"కు ఆ నా గీతానికి చిత్రంలో "సరోజా దేవి" అద్భుతాభినయం వన్నె చేకూర్చింది.



ఒకే స్టూడియో (జెమినీ)లో మా ఇద్దరి చిత్రగాన జీవితం ప్రారంభం కావడం యాదృచ్ఛికం. ఇద్దర్నీ శ్రీ ఈమని శంకర శాస్త్రి గారే పరిచయం చేశారు. ఇద్దరికీ కామన్ ఫ్రెండ్ మామండలీక రామశాస్త్రి! అయనే "పెళ్లిరోజా" మంచిరోజా అనే చిత్రాల్ని నిర్మించి సంగీత దర్శకత్వం నిర్వహించిన ఎం.ఎస్.శ్రీరాం. తరుచూ కలుసుకోకపోయినా, రాజాగారూ నేనూ అప్పుడప్పుడు కలుసుకున్నప్పుడు చాలా ఆప్యాయంగా మాట్లాడుకునే వాళ్లం-

విచిత్రమేమంటే, అందరూ మేమిద్దరం పోటీ పడే గాయకులం అనుకునే వారు. మా ఇద్దరికీ పడదు కూడా అనుకునే వారు. చిత్రసీమలో ఇలాంటి అపోహలు చాలా సహజం.

ఒకనాడు, నా "కార్యాలయం"గా మారిన "వుడ్‌లేండ్స్ డ్రైవిన్ - రెస్టారెంట్"లో మేమిద్దరం అనుకోకుండా కలుసుకున్నాం. రాజా డ్రైవిన్‌కి ఎప్పుడో ఒకసారి కాని తరచు వచ్చేవారు కారు. నేను మాత్రం "డెయిలీ ఎటెండెన్స్".

ఆయన వచ్చిన ఆ రోజున నేను అక్కడే వుండడం వలన కలుసుకోగలిగాం. ఇహ చూడండి. ఎప్పణ్ణించో మనసులో దాగి వున్న కబుర్లన్నీ ఆరుగంటల పర్యంతం ఆ రోజున మాట్లాడేసుకున్నాం. ఎన్నెన్నో విషయాలు చర్చించుకున్నాం. చెట్టునీడని నిలుచునే - వచ్చేవాళ్లు వెళ్లే వాళ్లు మమ్మల్ని గమనిస్తూనే వున్నారు. అయితే ప్రొద్దునే చిఱుతిండితిని, పనుల కెళ్లి, మళ్లీ మధ్యాహ్నం టిఫిను కోసం వచ్చిన వాళ్లూ మరికొందరు చూపరులూ, మేమిద్దరం అక్కణ్ణుంచి, కదలకుండా నిలుచున్న చోటునే నిలుచుని మాటాడుకుంటూ వుండటం చూసి, తమ కళ్లని తామే నమ్మలేక పోయారు. "ఎంత విచిత్రం ఇద్దరు స్పార్థికులు ఇంత సేపు మాటాడుకుంటున్నారేమిటి? ఏమిటి మాటాడు కుంటు న్నారు చెప్మా" అనే భావన వాళ్ళ ముఖాలలో కొట్టొచ్చినట్టు కనబడింది. ఆ భావాలని గమనించి, మేమిద్దఱం చిఱునవ్వు కున్నాం.

"రాజా" నాతో మాటాడినంత సరదాగా ఎన్నడూ, ఎవ్వరితోనూ మాట్లాడం ఎరగరు. ఒక విధమైన బిడియం ఆయన వెన్నంటి వుండేది. ఎంతో మంది ఆయనకి గర్వం చాలా అధికం అని కూడా అనుకోవడం కద్దు. అది బిడియం మాత్రమేనని చాలా మందికి తెలియదు. ఒకింత అనుమానం మాత్రం అందరిపైనా వుండేది. నాయందు కూడా కొత్తలో కొంత అనుమానం వుండేదని అనిపించేది కానీ పరిచయం కొంత పెరిగి సాన్నిహిత్యం లభించిన పిదప, అలా అనుకోవడం వట్టి భ్రమ అని అనిపించింది.

తనకి నచ్చకపోతే తటాలున కారెక్కి వెళ్ళి పోయే వారే తప్ప. ఎవరినీ పల్లెత్తు మాట అనడానికి కూడా సాహసించే వారు కారు. అలాంటి వ్యక్తి. నాతో అంతసేపు ఒకే చోట నిలుచునే మాట్లాడడం చూస్తే ఆశ్చర్యం ఎవరికి కలగదు? ఆ సన్నివేశం, ఇన్నేళ్ల తర్వాత ఈనాడు కూడా, నా మనోరజిత యవనికపై దృగ్గోచరమౌతూనే వుంది.

ఆయన సంగీతంలో, మాధుర్యానికి, సన్నివేశపు ఔచిత్యానికీ, చాలా ప్రాధాన్యం వుండేది. పాశ్చాత్య సంగీతంలో కూడా పర్యాప్త జ్ఞానం సంపాదించి వుండడం వలన చిత్రాలలో Back Ground Music చాలా బాగా సమకూర్చేవారు. దాన్నే టెక్నికల్‌గా, రీ రికార్డింగ్ అంటూంటాం. ఒక విధంగా ఆయనని New Trend Setter అని అనవచ్చు. అంతకు మునుపు చిత్రాల్లో అనేకంగా కర్నాటక హిందుస్థానీ సంగీతాల ప్రభావం వుండేది. రాజా ఆ పద్ధతిని చాకచక్యంతో మార్చి మలిచి, లలిత సంగీతపు బాణీలో కంపోజ్ చేయడం ప్రారంభించి, క్రొత్తవారికి ఒక నూతన పంథా చూపించారని అంటే అది అసత్యం కాబోదు. ముఖ్యంగా ఆ సమయాన, హిందీ చిత్రాల్లో అధికంగా వినవచ్చే ట్యూన్ల ప్రభావం ఒకింత ఆయన సంగీతంపై వుండేదని నాకనిపించేది. ఆ క్రొత్తదనం, రసికజనుల్ని ఇట్టే ఆకట్టుకుంది. ప్రథమ చిత్రంలోనే అఖండ విజయం తెచ్చి యిచ్చింది. అంతకు ముందు రాజేశ్వరరావు, అశ్వత్థామ, పెండ్యాల, చలపతిరావు మున్నగు దిగ్గజాల స్వరరచనలలో కూడా ఈ వైవిధ్యం లేకపోలేదు అనడం సమంజసమే. అయినా రాజా ఆ వైవిధ్యంలో కూడా తమ వైయక్తిక వైవిధ్యాన్ని సాధించగలిగారని చెబితే అతిశయోక్తి అనిపించుకోదు.



జిక్కి, రాజాల కాంబినేషన్ ఒక బిగ్ సెన్సేషన్ అనిపించుకునేది. దేశ దేశాల్లో పర్యటించి, అనేక సంగీత కార్యక్రమాలు జరిపించే వారు. ఎన్నెన్నో ఎవార్డులు, ఆనర్లు అందుకున్నారు. పద్మశ్రీ పద్మభూషణ్‌ల వంటి దేశీయ గౌరవాలకి ఆయన మరణానంతరం కూడా తగిన వారని (Posthumous awards) అనిపిస్తుంది నాకు.

ఈ సంగీతపు జంట రసజ్ఞ హృదయక్షేత్రాలలో ఎన్నో పంటలు పండించింది. 'ఏ.ఎం.రాజా' మరణం, సినిమాలలోని సన్నివేశం లాంటిది. ఈ జంట ఒక లలిత సంగీత కార్యక్రమంలో పాల్గొనేందుకు రైలు ప్రయాణం చేస్తున్నప్పుడు, ఆర్కెస్ట్రా వారందరికి సదుపాయాలు సరిగా అందుతున్నాయో లేదో అని తెలుసుకునేందుకు వెళ్ళి, మళ్లీ తమ భార్య నిరీక్షిస్తున్న కంపార్టుమెంట్లో ఎక్కబోతూ కాలుజారి నడుస్తున్న రైల్లోంచి క్రిందపడి, హఠాత్తుగా దుర్మరణం పొందారన్న వార్త, నేనూ మా మిత్రుడు శ్రీరాం టి.వి.లో సడెన్‌గా ప్రసారమైనప్పుడు విని నిర్ఘాంతపోయాం!

అది నిజంగా "దుర్భర దురంత దురంతం"!



ఆ మధ్య జిక్కీగారు ఆ సన్నివేశాన్ని తలుచుకుంటూ కన్నీరు పెట్టుకుని "నేను కూడా వెంటనే కిటికీలోంచి దూకెయ్యాలనుకున్నాను కానీ, తోటి ప్రయాణికులు దూకనివ్వలేదు". అని నాతో అన్నప్పుడు, నాకు కలిగిన అనుతాపం ఇంతా అంతా కాదు. గత సంవత్సరం 'రాజా' వర్ధంతి జరిగిన సందర్భాన, తోటి గాయనీ గాయకులందరు పాల్గొన్నాం. చాలా ఘనంగా వైభవంగా జరిగింది. ఆ సంస్మరణ సంగీత సభలో - అందరూ ఆయన సంగీతపరిచిన హిట్ పాటలు పాడాం. ఆయన గారి అబ్బాయిలు కూడా ఆయన బాణీలోనే లలిత గాత్రంలో చక్కగా ఆలాపించగల దిట్టలు. వారి వారి వృత్తి ధర్మాన్ని నెఱవేరుస్తూనే తల్లితోపాటు సంగీత కార్యక్రమాల్లో పాల్గొంటూ వుంటారు.

నేను మొట్టమొదటిసారి ఆయన్ని జెమినీ స్టూడియోలో శ్రీ శాస్త్రిగారి ప్రత్యేకపు గదిలో చూసి నప్పుడు బుష్ షర్ట్, గాబర్డీన్‌పాంటు ధరించి అలాగే



నీటుగా కూర్చుని "హార్మోనియం" పైన అంగుళాలు కదలాడిస్తూ, ఏదో ట్యూన్ కడుతూ, పాడుతూ కనిపించారు. మా అసామాన్య సామాన్య మిత్రుడే పరిచయం చేశాడు. చాలా మర్యాదగా రిసీవ్ చేసుకుని, స్వాగతించారు. - ఆ సన్నివేశం నా స్మృతిపథంలో ఇప్పుడు కూడా తాజాగా Fresh గా మెరుస్తూ వుంది. వేసుకున్న బట్టల్ని నలగ నిచ్చే వారు కారు. అన్నీ నీట్ హేబిట్స్ - మితభాషి. మిత్ర హితైషి.

ఆయనకి "పియానో"పై మంచి అధికారం వుండేది. ఆర్కెస్ట్రేజేషను కూడా స్వంతంగా చేసుకోగలిగే సామర్థ్యం వుండేది. ఎరేంజర్ల మీద కంప్లీట్‌గా ఆధారపడే వారు కాదు. "ఒక విధంగా, పెర్ఫెక్షనిస్టు అనే అనాలి ఆయన్ని.

"పన్నెండు పిఅందదు తాళం" అనే డ్యూయెట్ పాటకి నేను రిహార్సలు కోసం వెళ్లిన సందర్భాన పల్లవిని, నా చేత ఎన్ని సార్లు పాడించి, తనూ పాడారో తలుచుకుంటే, ఇప్పటికీ నాకు అమితాశ్చర్యం వేస్తుంది. "మీరు కరెక్ట్‌గా పాడుతున్నారు. అయినా మరోసారి వినండి", అని విసుగు విరామం లేకుండా పాడిపాడి, నిద్రలో లేపినా కూడా గబుక్కున ఆ పల్లవి నా నోట అప్రయత్నంగా పలికే విధాన పాడింపించారు. ఈనాడు కూడా ఆయన సజీవుడై వుండి వుంటే, ఎన్నెన్నో మెలోడీస్ ప్రజలకి అంది వుండేవి అనడానికి నాకెంత మాత్రం సందేహం లేదు. ఎంత మంచి గాయకులో అంతకుమించిన స్వరకర్త అని అనడం సబబే-



ఒక్కొక్క మ్యూజిక్ నోటూ నోట్ చేసుకుని, కార్డ్స్ దగ్గర్నించీ, దగ్గరుండి, గమనించి, మ్యూజీషియన్స్ చేత వాయింపించి, సంపూర్ణ న్యాయం చేకూర్చేకునేవారు. 'India's One of the best Singer - Composers' అంటే అదికూడా పరిమితోక్తే.

"గాఢమైత్రి" అనిపించుకునేటంతటి మిత్రులం కాకున్నా "అతి సన్నిహిత స్నేహితులం" అనిపించుకోగలిగేటంతగా, మా పరిచయం పెరిగింది. రాజా బ్రతికినన్నాళ్లు, జిక్కీరాణితో "కింగ్" లాగే బ్రతికి అకస్మాత్తుగా "షాకింగ్" అందించి మరణించారు. ఆయన మరణించినా, తన కుమార ద్వయం, (మహేశ్‌బాబు, చంద్రశేఖర్) గాత్రాలలో తరుచు ధ్వనిస్తునే వున్నారు.

ఒక మంచి కళాకారుడి కుండవలసిన ప్రతిభా లక్షణాలు ఆయనలో పుష్టిగా వున్నాయి. "కృషియాగం" చేస్తూనే వుండే వారు, పాటపుట్టి, రికార్డయి, పాప్యులర్ హిట్టయ్యేదాకా, ఆయన శ్రద్ధా దీక్షా ఏ మాత్రం తగ్గేది కాదు - రికార్డింగు సందర్భాలలో ఆద్యంతమూ- "నా బొందో" అని పరిశ్రమించే వారు.

ఎస్.పి.బి., కె. జేసుదాసుల చేతకూడా మంచి పాటలు పాడించి వుండే వారేమో- తదుపరి కూడా జీవించి వుండి వుంటే - ఏ పాట ఎవరిచేత పాడిస్తే బాగుంటుందో నిర్ణయించుకునే వారు. గాయనీ గాయకుల కంఠస్వర ప్రసారం (Range) గుర్తుంచుకుని Tunes కట్టేవారు. ఏ సంగీత దర్శకుడికైనా, ఈ దృష్టికోణం వుండి తీరాలి. అప్పుడే గీతాలకి సంపూర్ణ న్యాయం సమకూరుతుంది. సాధారణంగా Human Perfection సాధించేదాకా, తాపత్రయపడే వారు. ఆయన పాటలు నేటికీ ఎల్లెడలా మ్రోగుతూనే వున్నాయి. మ్రోగుతూ ఇతోధిక వ్యాప్తి పొందుతూనే వుంటాయి.

ఘంటసాల గారి గాన పద్ధతి రాజాగానంపై ప్రభావం కలిగి వున్నట్లునిపించేది. కాని, ఆయనకున్న అతి సునిశిత గాత్రం, ఆయన వ్యక్తిత్వానికెంతైనా దోహదం చేసేది. సంగతులు చాలా వేగమైనవి కూడా ఇంపుగా పలికేవి సునాయాసంగా-

ఘంటసాల గారు పాడినన్ని పద్యాలు మాత్రం. రాజా పాడినట్లు గుర్తులేదు. పాడిన కొన్ని పద్యాలు శ్రావ్యంగా, భావయుక్తంగా పాడే వారు. మొత్తం మీద పాట వినగానే, ఇది రాజా పాడిన పాటే అని సులువుగా గుర్తించ గలిగేలా ఆయన గాత్రంలో మార్దవం స్ఫురించేది. మిస్సమ్మలో (అరవంలో 'మిస్సియమ్మ') రామారావుగారికి పాడిన "బృందావనమది అందరిదీ" సుశీలగారి గాత్రంతో పాటు వాడవాడలా మోగింది. "తెలుసుకొనవె యువతీ" వంటి సందేశాత్మక గీతాలు కూడా తలుచుకొనేలా వినిపిస్తునే వున్నాయి. ఇంకా వినిపిస్తూనే వుంటాయి. ఆనాటి ఎందరో సంగీత దర్శకుల బాణీలకి రాజా తన మృదుస్వరాన్ని అందించి మధురంగా ఆలపించారు. అటు గానంలోనూ, మరోవైపు సంగీత సృష్టిలోనూ తనదైన వ్యక్తిత్వాన్ని నిరూపించిన రాజా సదా సంస్మరణీయులు.

---

**ఘంటసాల ముచ్చట్లు!**

# భడవా వచ్చిందే పిల్లా...



యం.యస్. విశ్వనాథమ్



ఘంటసాల



శ్రీమతి ఘంటసాల సావిత్రి

'సిపాయి చిన్నయ్య' సినిమాలో పాట కోసం రిహార్సల్స్‌కి వెళ్లి వచ్చారు ఘంటసాల. రాగానే 'ఆత్రేయ చూడు ఎలా రాశోడో!?' అన్నారు. 'ఏం రాశారు?' అని అడిగాను. 'ఏది పడితే అది ఎలా పడితే రాస్తున్నాడు' అన్నారాయన బాధగా. నేనేం మాట్లాడలేదు. కాస్సేపాగి "భడవా వచ్చిందే పిల్లా..." అంటూ రాశాడు.... భడవా ఏంటి భడవా!?" అంటూ తెగ ఫీలయిపోయారు. రెండు మూడు రోజుల పాటు ఆ పాటని ప్రాక్టీసు చేస్తున్నప్పుడు, హమ్ చేస్తున్నప్పుడు కూడా అలాగే బాధపడేవారు. తీరా టేక్ టైమ్‌కి వచ్చిన స్క్రిప్ట్ చూసి హాయిగా ఊపిరి పీల్చుకున్నారాయన. అందులో 'పడవా వచ్చిందే పిల్లా' అని వుంది...!

అసలు విషయం ఏమిటంటే ఆ సినిమా సంగీత దర్శకుడు ఎమ్.ఎస్.విశ్వనాథం తమలపాకులు ఎక్కువగా నమిలేవారు. ఆ తాంబూలం నోటితో 'పడవా వచ్చిందే' అని నేర్పితే అది 'భడవా వచ్చిందే' అని బైటికి వినిపించింది. అది విని ఈయన బాధపడిపోయార్న మాట.

ఎమ్మెస్ విశ్వనాథం సంగీత దర్శకత్వం వహించిన 'ప్రేమలు - పెళ్లిళ్ళు' సినిమాలో 'మనసులేని దేవుడు మనిషికెందుకు మనసిచ్చాడు' అనే పాటంటే ఘంటసాల గారికి ఎంతో ఇష్టం. ఆ పాటను రిహార్సల్స్ చేసి వచ్చిన తర్వాత 'ఎంత బావుందీ పాట....' అని తెగముచ్చటపడ్డారు. ఆ పాటను పాడాలని ఎంతగానో అనుకున్నారు. సమయానికి ఆరోగ్యం సహకరించలేదాయనకి. ఆరోగ్యం చక్కబడ్డాక పాడదామని వెళ్లారు. - ట్రాక్ కోసం రామకృష్ణతో పాడించిన పాట విని పాడకుండా వెనక్కి వచ్చేశారు. "అదేంటండీ.... ఆ పాట పాడాలని ఎంతో ముచ్చట పడ్డారు కదా!?" అని అన్నాను. "నిజమే.... కానీ ఆ కుర్రాడు (రామకృష్ణ) చాలా బాగా పాడేడు" అని అన్నారాయన. ఎంత ఇష్టపడినా ఆయన పాడలేకపోయిన పాటగా ఆ పాట నాకు బాగా గుర్తుండిపోయింది.

**-ఘంటసాల సావిత్రి**

# ఎ.ఎం. రాజా గానం చేసిన గీతాలు...

## ఇంటిగుట్టు

రచన: మల్లాది రామకృష్ణశాస్త్రి సంగీతం: ఎమ్మెస్ ప్రకాష్

ప: ఆడువారి మాటలు రాక్ అండ్ రోల్ పాటలు
ఆడువారి కోపాలు మాపైన పన్నీటి జల్లులు ॥ఆడు॥
డియోడ డి ఇ డి ఈ ఈ
చ: ఏమన్నా కాదంటారు తామన్నదే రైటంటారు
వాదించి సాధించి చేసేరు సాములు ॥ఏమన్నా॥
వయ్యారి భామలు
కోసేవన్నీ కోతలు
వేసేవన్నీ ఫోజులు చేసేవన్నీ డాబులు
ఈ ఆడు లేడీలు బాపురే ॥ఆడు॥
చ: వీరిది వేసమైతే వారిది మోసమైతే
వేసాలు, మోసాలు దాగేవి కావులే ॥వీరిది॥
సాగేవి కావులే
జోకు జోకు చూపులు చూపులోనే బ్రేకులు
జోకులోనే షాకులు
ఈ ఆడు లేడీలు బాపురే ॥ఆడువారి॥

## భాగ్యరేఖ

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి సంగీతం: పెండ్యాల

నీ సిగ్గే సింగారమే ఓ చెలియ నీ సొగసే బంగారమే
కనులార గని మెచ్చేనే ఓ వనలక్ష్మి మనసిచ్చి దిగివచ్చేనే
నీ నవ్వుపూలు అవేమాకుచాలు
నీ ఒయ్యారాలు అవే వేనవేలు
ఓ పేదరాలా మరేపూజలేలా
మా పైని దయజూపవా ఓ నాచెలి ॥నీ॥
మా తోట పూచే వసంతమ్ము నీవే
మా బాట చూపే ప్రభాతమ్ము నీవే
మాలోన కొలువైన మహాలక్ష్మి నీవే
మాపైని దయ చూపవా - ఓ నాచెలీ ॥నీ॥

## విప్రనారాయణ

రచన: సముద్రాల సంగీతం: యస్.రాజేశ్వరరావు

చూడుమదే చెలియా కనులా ॥చూడు॥
బృందావనిలో నందకిశోరుడు ॥బృందా॥
అందముగా దీపించే లీలా ॥చూడు॥
మురళీకృష్ణుని మోహనగీతికి ॥మురళీ॥
పరవశమైనవి లోకములే ॥పరవశ॥
విరబూసినవి పొన్నలు పొగడలు ॥విర॥
పరిమళమెగసెను మలయానిలయముల
సోలెను యమునా ॥చూడు॥
నారీ నారీ నడుమ మురారీ ॥నారీ॥
హరికి హరికి నడుమ వయ్యారీ ॥హరి॥
తానొకడైనా... ఆ....
తానొకడైనా తలకొకరూపై ॥తానొక॥
మనసులు దోచె రాధామాధవ
కేళీ నటనా.... ॥చూడు॥

## అప్పుచేసి పప్పుకూడు

రచన: పింగళి సంగీతం: యస్. రాజేశ్వరరావు

అ: మూగవైన ఏమిలే నగుమోమే చాలులే
సైగ లింక చాలింపుము జాణతనము తెలిసెనులే ॥మూగ॥
ఆపలేని అనురాగం చూపులలో తొణికెనులే
దొంగమనసు దాగదులే సంగతెల్ల తెలిసెనులే ॥మూగ॥
పలుకకున్న నేమాయెను వలపుబాస లింతేలే
నను దయతో ఏలుకొమ్ము కనుసన్నల మెలిగెదలే ॥మూగ॥
అందాలే బందాలై నను బందీ చేసెనులే
కలవరమిక ఎందుకులే వలదన్నా వదలనులే ॥మూగ॥

## భాగ్యరేఖ

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి సంగీతం: పెండ్యాల

మనసూ గేసఖ తనువూగే ప్రియమదిలో సుఖాల
డోలలూగే ఏమధువా నేనోయి ప్రియ
వయసూగే చెలి సొగసూగే ప్రియ వగలూరు ఓర
చూపులూగే ఏకర మూపేనో సకియా
మలుపు మలుపు కడనిలచి చెవిలో మంతనాలు ఊదాలి
కలసి మెలసి కలకాలమిలాగే మధురయాత్ర సాగాలి
అలలూగే మది కలలూగే ప్రియ తెలివాక
తేలునొక ఊగే ఏవలపూపేనోయి ప్రియా
రేవు రేవు కడ కనులు కనులతో మూగబాసలాడాలి
పైరగాలి పన్నీటియేటిపై పడవ సాగిపోవాలి
ఇలాగే పడవ సాగిపోవాలి
తరువూగే సఖి తెరువూగే ప్రియ తలిరాకువోలె
డెందమూగె ఏవలపూపే నో సకియా
తేనెలాని ఎలతేటి పాట మనలోని మమత చాటాలి
కనుల కొనల కలకాలము వలపులు కాపురముండాలి
ఇలాగే కాపురముండాలి

## భక్త అంబరీష

రచన: గబ్బిట వెంకటరావు సంగీతం: యల్. మల్లేశ్వరరావు

హే ప్రభూ జగదైక విభో
కరుణాలోలా శ్రితజనపాలా
ఈ జగమే నీ లీలా... హే... ॥కరుణా॥
బాధలైన ఆవేదనలైనా
నీ దయగానే భేదములేక
నీ పరీక్షలో నిలచినవారే నిర్మలయోగులు శౌరీ... హే... ॥కరుణా॥
నీ పదసేవా సుగతికి త్రోవా
నీ పదసేవా సుగతికి త్రోవా
నమ్మిన వారికి... ఆ ఆ ఆ...
నమ్మిన వారికి... దేవా
ఆపదలైనా అరడియైనా
ఆపదలైనా అరడియైనా
లోపము రాదు ముకుందా... హే... ॥కరుణా॥

## ప్రేమలేఖలు

రచన: ఆరుద్ర సంగీతం: శంకర్-జైకిషన్

పాడు జీవితం - యవ్వనం
మూడునాళ్లా ముచ్చటలోయి - అయ్యయ్యో
నీ పరుగూ లెచటికోయి ॥పాడు॥
చీకటి దారి చుట్టూ ఎడారి-
చేయునదేమి - చెలి యిలు చేరి - ప్రేయసి ఇలు చేరి
దారిలో మూఢా తడబడకోయి... తడబడకోయి! ॥పాడు॥
కంటికి రెప్ప మన పుట్టిల్లు
కాని దానికి నీ బుణమే చెల్లు - నీ బుణమే చెల్లు
ఎడబాటంటే ఎదలో ముల్లు... ఎదలో ముల్లు ॥పాడు॥

## చక్రపాణి

రచన: రావూరు వెంకట సత్యనారాయణ రావు సంగీతం: భానుమతీ రామకృష్ణ

ఓ ప్రియురాలా
పలుక వేలనే... నాతో...
ఓ ప్రియురాలా. ఓ జవరాలా
ప్రియురాలా... ఓ జవరాలా
పలుక వేలనే... నాతో... ఓ ప్రియురాలా...
ఆ... ఆ... ఆ... ఆ... ఆ...
వెన్నెల సెలయేరున విరబూసిన ॥2॥
కలువవు నీవేనే జవరాలా ॥2॥
నా మదిలో డోలలూగరావే...
ఓ ప్రియురాలా
మిన్నుల పువుతోటల విహరించే ॥2॥
కిన్నెర వీవేనే జవరాలా ॥2॥
నా మదిలో...
నా మదిలో వీణ మీటరావే ॥2॥
ఓ ప్రియురాలా
పొన్నల నీడలలో నడయాడెడి ॥2॥
నెమలివి నీవేనే జవరాలా ॥2॥
నా మదిలో...
నా మదిలో నాట్యమాడరావే ॥2॥
ఓ ప్రియురాలా... ఓ జవరాలా
అలుక లేలనే నాపై... ఓ ప్రియురాల

## మిస్సమ్మ

రచన: పింగళి సంగీతం: యస్. రాజేశ్వరరావు

తెలుసుకొనవె యువతీ - అలా నడుచుకొనవె యువతీ ॥తె॥
యువకుల శాసించుటకే - యువతు లవతిరించిరని ॥తె॥
సాధింపులు బెదిరింపులు - ముదితల కిక కూడవని
హృదయమిచ్చి పుచ్చుకునే - చదువేదో నేర్వాలని ॥తె॥
మూతి బిగింపులు - అలకలు - పాతపడిన విద్యలనీ
మగువలెపుడు - మగవారిని - చిరునవ్వుల గెలవాలని ॥తె॥

## పక్కింటి అమ్మాయి

రచన: ముద్దుకృష్ణ సంగీతం: అశ్వత్థామ

కలయేమో... ఇది నా జీవిత ఫలమేమో...
ఇది నా కలయేమో... ఆ...
కలయేమో... ఇది నా జీవిత ఫలమేమో
చెలియా ఇది నా కలయేమో
కలయేమో... ఇది నా జీవిత ఫలమేమో చెలియా ఇది నా
కలయేమో
కొండల కోనల లోయల లోపల... ఆ... ఆ... ఆ...
కొండల కోనల లోయల లోపల...
అడవుల నీడల అలస గమనమున
నిండు నీరుతో నడిచే నదిలా మేలాలాడే పూల పడవలో
నా... కలయేమో...
పూల పడవలో పూలరాణివై కొలువు తీర్చగా దేవీ
పూల పడవలో పూలరాణివై కొలువు తీర్చగా దేవీ
నీ దరి పాలనలో... నే ... పాటకులముగా
పడవను నడిపిన ప్రేమయాత్రలో...
నా... కలయేమో...
ఇది నా జీవిత ఫలమేయో...
చెలియా ఇది నా కలయేమో...

## పెళ్లికానుక

రచన: ఆచార్య ఆత్రేయ సంగీతం: ఎ.ఎం. రాజా

ఆడేపాడే పసివాడా
అమ్మలేని నిను చూడ
కన్నీటి కథ ఆయె దీపావళి ॥ఆడేపాడే॥
ఊరెల్ల వెలుగు
ఆనందం మనకు
కనరాని దూరమురా... కనరాని దూరమురా...
చ: నెనరెల్ల అనలాన నీరైననాడు
నెమ్మది మనకింక కనరాదు ॥నెనరెల్ల॥
ఇలవేల్పువలె ఇంట వెలసిన దేవీ
ఇలవేల్పువలె ఇంట వెలసిన దేవీ
మమతే మరచీ మరుగైనదేమీ
కన్నులలోని కాంక్షలు అన్నీ
కలలాయె నేటికిరా
కలలాయె నేటికిరా
చ: అనురాగమున తానె
అనిపించు దేవి
ఎనలేని భావాల పెనవేసి ॥అను॥
పాశము తెగతెంచి
మోసముచేసె
పాశము తెగతెంచి
మోసము చేసె
బ్రతుకే మనకు బరువైపోయే
నిన్నటి కథలే నేటికి వ్యథలై
నిను నన్ను వేధించెరా
నిను నన్ను వేధించెరా

## ఆలీబాబా 40 దొంగలు

సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి
గానం: భానుమతితో యుగళం

అ: ప్రియతమా మనసుమారునా
ప్రేమతో సిరులు నిలిచి మీరునా
ఆ: తేనెలూరే పాటలన్నీ
తీయగా నీటిపైన వ్రాతలే కదా ॥తేనె॥
అ: ఖుదాపై బాస చేతునే
హృదయమే నీది మధుర భాషిణీ
అ: నా మనోహరీ
వినుము నీ గులామునే
ఆ: ఓ మనోహరా
కొనుము నా సలాములే ॥అ: నా మనోహరీ॥
తేనెలూరే పాటలన్నీ
తీయగా నీటిపైన వ్రాతలే కదా
అ: జవ్వనీ నీవులేని జన్మమే వృధా
ఆ: సుందరా నీవులేని అందమే వృధా ॥జవ్వనీ॥
ఇ: వలపుమీర తనివితీరా
హాయిగా ప్రణయసీమ
సాగిపోదమా ॥వలపు॥
ప్రియతమా మనసు మారునా
ప్రేమతో సిరులు నిలిచి మీరునా ॥ప్రియతమా॥
ప్రియతమా...

అ: ప్రియతమా మనసుమారునా
ప్రేమతో సిరులు నిలిచి మీరునా
ఆ: తేనెలూరే పాటలన్నీ
తీయగా నీటిపైన వ్రాతలే కదా ॥తేనె॥
అ: ఖుదాపై బాస చేతునే
హృదయమే నీది మధుర భాషిణీ
అ: నా మనోహరీ
వినుము నీ గులామునే
ఆ: ఓ మనోహరా
కొనుము నా సలాములే ॥అ: నా మనోహరీ॥
తేనెలూరే పాటలన్నీ
తీయగా నీటిపైన వ్రాతలే కదా
అ: జవ్వనీ నీవులేని జన్మమే వృధా
ఆ: సుందరా నీవులేని అందమే వృధా ॥జవ్వనీ॥
ఇ: వలపుమీర తనివితీరా
హాయిగా ప్రణయసీమ
సాగిపోదమా ॥వలపు॥
ప్రియతమా మనసు మారునా
ప్రేమతో సిరులు నిలిచి మీరునా ॥ప్రియతమా॥
ప్రియతమా...

## ప్రేమలేఖలు

రచన: ఆరుద్ర సంగీతం: శంకర్-జైకిషన్ గానం: జిక్కితో యుగళం

నీ వెవ్వరవో చిరునవ్వులతో
నీ రూపు నను మంత్రించే
మది పొంగి పొంగి పులకించె
నీ వెవ్వరవో చిరునవ్వులతో
నీ రూపు నను మంత్రించే
ప్రతిరోజు రోజు వేధించె
కనుమూసిన తెరచిన నీ రూపే
నా కన్నుల ముందర కనిపించె
ఎల కోరికలేవో కుసుమించి
నా దేహమే వికసించె
మది పొంగి పొంగి పులకించె
ప్రియురాలిని మొదటే తెలుసుకొని
నేనామె రహస్యం కనుగొంటే - నే
నెందుకు బయటికి చెప్పాలి?
తను దూరమై మురిపించె - ప్రతిరోజు రోజు వేధించె
నిను చూడకనే ప్రేమించితినే
కనుగొనిన నే లోబడనా
నా మానస చోరా - నీ తలపే
ఈ లోకము మరపించె
మది పొంగి పొంగి పులకించె

## విప్రనారాయణ

రచన: సముద్రాల సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: భానుమతితో యుగళం

అ: మధుర మధురమీ చల్లని రేయి
ఆ: మరువతగనిదీ ఈ హాయీ ॥మధుర॥
అ: నవ్వుల వెన్నెల నాలో వలపుల
నవ్వుల వెన్నెల నాలో వలపుల
ఆ: స్వాముల సోయగమెంచీ
పులకించునదేమో రే రాణి ॥మధుర॥
అ: విరికన్నెలు అరవిరిసిన కన్నుల
దరహసించునో దేవీ
ఆ: మన అనురాగము చూసీ...
విరికన్నెలు అరవిరిసిన కన్నుల
దరహసించునో దేవీ
చిరునవ్వులు చిలుకును స్వామీ ॥మధుర॥
నీ వరమున నా జీవనమే
పావనమాయెను స్వామీ
నీ వరమున నా జీవనమే
పావనమాయెను స్వామీ
అ: ఈ వనసీమయె నీ చెలిమీ
ఈ వనసీమయె నీ చెలిమీ
జీవన మాధురి చవిచూపినదే ॥మధుర॥

# ఎ.ఎం. రాజా గానం చేసిన గీతాలు...

## మిస్సమ్మ

రచన: పింగళి సంగీతం: యస్. రాజేశ్వరరావు

ఔనంటే కాదనిలే
కాదంటే ఔననిలే
ఆడువారి మాటలకు
అర్థాలే వేరులే
అర్థాలే వేరులే... అర్థాలే వేరులే ॥ఔనంటే॥
అలిగి తొలగి నిలిచిచో
చెలిమిచేయ రమ్మనిలే
చొరవచేసి రమ్మనుచో
మరియాదగ పొమ్మనిలే ॥ఆడు॥
విసిగి నసిగి కసిరినచో
విషయ మసలు ఇష్టమెలే
తరచి తరచి వూసడిగిన
సరసమింక చాలనిలే ॥ఆడు॥

## పెళ్ళికానుక

రచన: ఆత్రేయ సంగీతం: ఎ.ఎం. రాజా గానం: సుశీలతో యుగళం

అ: వాడుక మరచెదవేల
నను వేడుక చేసెదవేల
నిను చూడని దినము నాకొక యుగము
నీకు తెలుసును నిజము
నీకు తెలుసును నిజము
ఆ: వాడుక మరువను నేను
నిను వేడుక చేయగలేను
నిను చూడని క్షణము నాకొక దినము
నీకు తెలుసును నిజము
నీకు తెలుసును నిజము
అ: సంజరంగుల చల్లని గాలుల
మధుర రాగము మంజుల గానము ॥సంజ॥
తేనె విందుల తీయనని కలలూ
మరచిపోయిన వేళ
ఇక మనకీ మనుగడ ఏల
నీ అందము చూపి డెందము ఊపి
ఆశ రేపెదవేలా ఆశ రేపెదవేల
ఆ: ఓ ఓ ఓ... సంజరంగులు సాగినా
చల్లగాలులు ఆగినా ॥సంజ॥
కలసి మెలసిన కన్నులలోనా
కలసి మెలసిన కన్నులలోనా
మనసు చూడగ లేవా
మరులు తోడగ లేవా ॥వాడుక॥
అ: కన్నులా ఇవి కలల వెన్నెలా
చిన్నె వన్నెల చిలిపి తెన్నులా ॥కన్నులా॥
మనసు తెలిసీ మర్మమేలా
ఆ: ఇంత తొందర ఏలా
ఇటు పంతాలాడుట మేలా
నాకందరికన్నా ఆశలు ఉన్నా
హద్దు కాదనగలనా హద్దు కాదనగలనా
ఇ: వాడని నవ్వులతోడ
నడయాడెడు పువ్వుల జాడ
అనురాగము విరిసి లోకము మరచి
ఏకమౌదము కలసి ఏకమౌదము కలసి

## అప్పుచేసి పప్పుకూడు

రచన: పింగళి సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: లీల, ఘంటసాలతో త్రిగళం

ఆ: సుందరాంగులను చూసిన వేళల
కొందరు ముచ్చట పడనేలా
కొందరు పిచ్చను పడనేలా ॥సుంద॥
అ: అందము ప్రాయము ఐశ్వర్యముగల
సుందరి దొరకుటె అరుదుకదా ॥అందము॥
ముందుగ ఎవరిని వరించునోయని
తొందరలో మతిపోవు కదా ॥సుంద॥
అ: హృదయమునందలి ప్రేమగీతమే
మధురముగా వినిపించు కదా
మందహాసమున మనసును దెలిపే
ఇందువదన కను విందుకదా
ఆ: ప్రేమ పరీక్షలు జరిగే వేళల కొందరు పరవశ పడనేల
కొందరు కలవర పడనేల
అ: యువతి చెంత పరపురుషుడు నిలిచిన
భావా వేశము కలుగు కదా ॥యువతి॥
ప్రేమ పందెమును గెలిచే వరకు
నా మది కలవర పడును కదా ॥ప్రేమ పరీక్షలు॥
అ: కోయిల పలుకుల కోమలి గాంచిన ॥కోయిల॥
తీయని తలపులు కలుగు కదా
వరము లొసంగే ప్రేమదేవి గన
పరవశమే మది కలుగు కదా ॥సుంద॥

## అప్పుచేసి పప్పుకూడు

రచన: పింగళి సంగీతం: యస్. రాజేశ్వరరావు గానం: సుశీలతో యుగళం

అ: చేయి చేయి కలువరావె హాయి హాయిగా
నదురు బెదురు మనకింక లేదు లేదుగా ॥చేయి॥
ఆ: పెద్దవారి అనుమతింకా లేదు లేదుగా
చేయి చేయి కలుపుటెలా హాయి హాయిగా ॥పెద్ద॥ ॥చేయి॥
అ: మగని మాట కెదురాడుట తగదు తగదుగా
నాతి చెంత విరహము నే తాళలేనుగా ॥మగని॥ ॥చేయి॥
ఆ: వీలుకాని విరహమింకా వలదు వలదుగా
దాసి మీద వలపు మీకు తగదు తగదుగా ॥వీలు॥ ॥చేయి॥

## పెళ్ళికానుక

సంగీతం: ఎ.ఎం. రాజా

తీరెనుగా నేటితో నీ తీయని గాథ
మిగిలిపోయె నీ మదిలో మాయని బాధ
తీరెనుగా నేటితో నీ తీయని గాథ
మిగిలిపోయె నీ మదిలో మాయని బాధ
ప్రేమమయి నాట్యమాడ మేడలుకట్టి
ఘన విషాద నాటకమ్ము కన్నులు చూసి
ప్రేమమయి నాట్యమాడ మేడలుకట్టి
ఘన విషాద నాటకమ్ము కన్నులు చూసి
నీ ప్రేమధారబోసి దైవానికి... కదిలీ పోయావే ఏకాకివై
నీ ప్రేమధారబోసి దైవానికి... కదిలీ పోయావే ఏకాకివై

# యస్.పి. కోదండపాణి స్వరపరిచిన గీతాలు...

## శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న

రచన: వీటూరి

గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం (తొలి పరిచయం)(1), పి.బి. శ్రీనివాస్(2), కె. రఘురామయ్య(3) (4) & పి. సుశీల

ఆ: ఓ... ఏమి ఈ వింత మోహం
అహో! ఏమి కలవరము?
ఏమి కలకలము?
ఏమి ఈ ప్రణయదాహం...
ఓ... ఏమి ఈ వింత మోహం
పలికెను నయనాలు పరవశ గానాలు
సుధలే చిందేను మధురాధరాలు
ఉరకలు వేసెను అంతరంగమున
వలపు దొంతరలు ॥ఓ...॥
అ1:రావే కావ్య సుమబాలా! జవరాలా! ప్రియురాలా
నవ భావ రాగమాలా! రావే కావ్య సుమబాలా!
ఊహకు అందని నీ అందం
కని ఊగిపోయెనే నాడెందం ॥ఊహకు॥
మానసమేలే దేవివి నీవే
నీ దయ నాపై రానీవే

ఆ: ఓ... ఏమి ఈ వింత మోహం
అ(2): జగమున కనరాని సుందర నారి
వగలే రగిలే నిన్నే కోరి
అలవై ఆడవె నాట్యమయూరీ
వలపులు చిలికించు నయనచకోరి
నీ పరువాలే నాకు వరాలే
రావే రావే ఓ... వయ్యారీ
జగమున కనరాని సుందర నారి
ఆ: ఓ... ఏమి ఈ వింత మోహం
అ(3): నా హృది పయనించు శృంగార రధమా!
నన్నే కరుణించు అందాల భామా! ॥నా హృది॥
అ(4): తరగని సరసాల సురశాల నీవే
తపమూ జపమూ సకలము నీవే
నీ సరి జతగాడ నేనేలే
నీ సరి జతగాడ నేనేలే
ఆ: ఓ... ఏమి ఈ వింత మోహం

## గోపాలుడు-భూపాలుడు

గానం: ఘంటసాల,యస్.జానకి

ఆ: ఒకసారి కలలోకి రావయ్యా ॥ఒక॥
నా ముంగిళ్ళు కవ్వించిపోవయ్యా
ఓ గొల్లగోపయ్యా
అ: ఒకసారి రాగానె ఏమౌనులే
నీ హృదయాన శయనించి ఉంటానులే
ఏలుకొంటానులే
ఒకసారి రాగానె ఏమౌనులే...
ఆ: పగడాల నామోవి చిగురించెరా
మోము చెమరించెరా
మేను పులకించెరా
సొగసు వేణువు చేసి పలికించరా ॥సొగసు॥
అ: కెమ్మోవిపై తేనె ఒలికించనా ॥కెమ్మోవి॥
తనివి కలిగించనా
మనసు కరిగించనా

కేరింతలాడించి సోలించనా ॥కేరింత॥
ఆ: ఒకసారి కలలోకి రావయ్యా...
అ: ఒంపుసొంపుల మెరుపు మెరిపించవే
వగలు కురిపించవే
మేను మరపించవే
మరపులో మధుకీల రగిలించవే
మరపులో మధుకీల రగిలించవే
ఆ: చిలిపి చూపుల సిగ్గు కలిగిందిరా ॥చిలిపి॥
మొగ్గ తొడిగిందిరా
మురిసి విరిసిందిరా
పదును తేలిన వలపు పండించరా ॥పదును॥
అ: ఆ... ఆ: ఆ...
ఆ: ఆ... అ: ఆ...
ఇ: ఓ... ఓ... ఓ...

## మహాబలుడు

రచన: ఆరుద్ర

గానం: బాలసుబ్రహ్మణ్యం, సుశీల

విశాల గగనంలో - చందమామా
ప్రశాంత సమయములో కలువలేమా
ఒడిలోన వాలితే ఒకసారి కరిగితే - నేరమా? ॥విశాల॥
వన్నెలలో చిన్నెలలో తేనెలున్నవి
నా కన్నులనే గిన్నెలతో తాగమన్నవీ
ఒలికే మధువూ

కొసరే వధువూ - రెండూనీవే... ఓ... ॥విశాల॥
చుక్కలలో జాబిలిలా వెలుగుతావులే
నా చక్కదనం దొరలాగా ఏలుతావులే
తీరే తనివీ - మీరే అలవీ
ఏదో గారడీ... ఓ... ॥విశాల॥

## దేవత

రచన: వీటూరి గానం: ఘంటసాల,సుశీల

ప: తొలి వలపే పదే పదే పిలిచే
ఎదలో సందడి చేసే
ఆ: తొలివలపే పదేపదే పిలిచే
మదిలో మల్లెలు విరిసే... తొలివలపే
అ: ఏమో ఇది ఏమో నీ పెదవుల
విరిసే నవ్వుల పువ్వుల అందాలు
ఆ: ఆ అందం అనుబంధం నా మనసున
నీకై తోచిన పూసిన కానుకలు
అ: ఏమో యిది ఏమో నీ పెదవుల
విరిసే నవ్వుల పువ్వుల అందాలు
ఆ: ఆ అందం అనుబంధం
నా మనసున నీకై దోచిన పూచిన కానుకలూ
అ: నీ కనుల వెలిగేనే దీపాలు
ఆ: అవి నీ ప్రేమకు ప్రతిరూపాలు ॥నీ కనుల॥
మన అనురాగానికి హారతులు ॥తొలి॥
ఆ: గరినిరిగా
అ: ఆ ఆ ఆ ఆ
ఆ: మగనిగమా
అ: ఆ ఆ ఆ ఆ
ఆ: గమ నీద నీదపా
అ: ఆ ఆ ఆ ఆ
ఆ: ఏలా ఈ వేళా కడువింతగ తోచె
తీయగ హాయిగ ఈ జగమూ
అ: యవ్వనము అనుభవమూ జతకూడిన వేళా
కలిగిన వలపుల పరవశమూ ॥ఏలా ఈ వేళా॥
ఆ: ఈ రేయి పలికెలే స్వాగతమూ
అ: ఈనాడే బ్రతుకున శుభదినమూ ॥ఈ రేయి॥
ఈ తనవే మనకిక చెలిసగమూ ॥తొలి॥

## బంగారు తిమ్మరాజు

గానం: కె. జమునారాణి

నాగమల్లి కోనలోన నక్కింది లేడికూన
ఎరవేసి... హా... గురిచూసి... హా... పట్టాలి మావ పట్టాలి మావా
చూపుల్లో కైపుంది... మావ సొగసైన రూపుంది... మావ
వయ్యారం ఒలికిస్తుంది
వన్నెల చిన్నెలు నేర్చింది మావా
ఓ ఉడుకుమీద ఉరికావంటే
జడుసుకుంటుంది మావా ॥ఉడుకు॥
దాన్ని ఒడుపుచూసి మచ్చిక చేస్తే
వదలనంటుంది మావోయ్ ॥దాన్ని॥ ॥నాగమల్లి॥
నడకల్లో హొయలుంది... మావా
నాట్యంలో నేర్పుంది... మావా ॥నడకల్లో॥
మలిసందె సీకట్లోన
నీటికి ఏటికి వస్తుంది (2)
ఓ జాడ చూసి కాసావంటే
దారికొస్తది మావా ॥జాడ॥
దాని జాలి చూపునమ్మావంటే
దగా చేస్తది మావోయ్ ॥దాని॥ ॥నాగమల్లి॥

## శ్రీరామకథ

రచన: వీటూరి గానం: ఘంటసాల, పి.సుశీల

ప/ఆ: మాధవా మాధవా ననూ లాలించరా
నీ లీలాకేళి చాలించరా బాలను నేను తాళగలేను
అలసీ మనసే తూలెరా...
అ: ఓ చెలీ... ఓ సఖీ...
చ/ఆ: దాగని వలపు దాచగలేను వేగమె రారా దోచుకు పోరా
కన్నుల పూచె వెన్నెల పూలూ
వాడక మునుపే చేకొనరా
ప: ఓ చెలీ... ఓ సఖీ... సదా నీ వాడనే
అందాల దేవీ అలుకేలనే...
సందిటిలోనా బందీచేసీ సరగున నన్నే ఏలవే
చ: మేఘమాలికల డోలికలూగీ
మేనులు మరచీ విహరించేమా
ఏకాంతముగా పువ్వుల దాగి
విశ్వప్రేమనే వివరించేమా ॥ఓ చెలీ॥
చ: బ్రతుకున వరము యీ పరవశము
కమ్మని కల యిదీ కరిగించకుమా
అ: నీవే నేనుగ - నేనే నీవుగ
నిఖిలము నిండీ - లీనమయేమా
ఆ: మాధవా మాధవా ననూ లాలించరా
నీ లీలా కేళీ తెలించరా
అ: ఓ చెలీ... ఓ సఖీ... సదా నీవాడనే
అందాల దేవీ నీవాడనే...

## గురువును మించిన శిష్యుడు

రచన: జి. కృష్ణమూర్తి గానం:పి.బి. శ్రీనివాస్, పి.సుశీల

ఏడేడు జన్మలనుండీ - పడివుందీ బ్రహ్మముడీ
మళ్ళీ పడబోతుందీ - మళ్ళీ పడబోతుందీ
మనల నొకటిగా చేస్తుందీ ॥ఏడేడు॥
ఎగిరే నను బంధించావూ - పగడాలా పంజర మందూ
నాగుండెల గుడిలో నిలిపీ - దేవునిగా పూజిస్తున్నా
నోరారా పిలిచే వేళా - దూరానా నిలిచే వేలా
గారానా చేరువ కాగా - మారామూ చేయుట మేలా
మాటలతోనే మరపిస్తావే - మాటలు కావు మనసేయిచ్చా
మాటలతోనే మరపిస్తావే
మాటలు కావు మనసేయిచ్చా ... ఓ... ఓ... ఓ... ॥ఏడేడు॥
ఏదేవుని దీవెన బలమో - యీడేరెను మన లేవలపూ
మీ అడుగూ జాడలలోనే - నా ఆశల దివ్వెల వెలుగూ
నీ సిగలో మల్లెగమారీ - ఊసులతో ఊరిస్తాను
మీ కన్నుల కాంతిని చేరి - మనసారా అలరిస్తాను
తీయని మనకల నిజమౌతుంది - తప్పదు వలపు ఫలియిస్తుందీ
తీయని మనకల నిజమౌతుంది
తప్పదు వలపు ఫలియిస్తుందీ... ఓ... ఓ... ఓ... ॥ఏడేడు॥

## జాతకరత్న మిడతంబొట్లు

రచన: కె. అప్పలాచార్య గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం

సనిద నిదమ గమగస
దయచూడవే గాడిదా
నిగమ దయ చూడవే గాడిదా
పరుపు కోసమని నిదుర మానుకుని
వెదకి వెదకి వేసారినాను... ఆ...
సనిద నిదమ గమగస
దయచూడవే గాడిదా
తోకకు ఆకులు కట్టే వెధవకు
నీవు లేనిదే తోచకున్నది
పాపం లచ్చి నిన్నటినుంచి
పిచ్చిదాని వలె తిరుగుచున్నది
దా... దామ్మదా... మదమా!?
గమగస దాదా దాదాదా
దద దదదద దదదద దా
నీవు రాక మనఊరి ఇళ్లలో
మురికి బట్టలు మూల్గుతున్నవి
దొరికావంటే పెడతా పచ్చని గడ్డి
దొరకకపోతే విరుగుతుంది నీ నడ్డి
విరుగుతుంది నీ నడ్డి
సనిద నిదమ గమగస
దయచూడవే గాడిదా
ఆహో ఎంతటి తీయని గానం
కోకిల కెక్కడిదింతటి జ్ఞానం
సింహము కన్నా నువ్వే నయము
నిన్ను చూసిన కలుగదు భయము
వసుదేవుడు కొలిచిన గార్ధభదేవా
బిరబిర దొరికితే కొడతా కొబ్బరికాయ
కొడతా కొబ్బరికాయా... కొబ్బరికాయా... హా...
తెల్లవారెను కోడికూసెను వెర్రి గుర్రము పళ్ళు తోమెను
ఏడిపించక దొరకవయ్యా గాడిదయ్యా
ఏడిపించక దొరకవయ్యా గాడిదయ్యా
గాడిదయ్యా గాడిదయ్యా లింగా... దొరికితివా దొంగా
అదిరి బెదిరి పోతావేల దూరంగా

## పండంటి కాపురం

రచన: గోపి గానం: పి. సుశీల

మనసా కవ్వించకే నన్నిలా
ఎదురీదలేక కుమిలేను నేను
సుడిగాలిలో చిక్కిన నావను
ఆనాడు వెన్నెల నేనై
కరిగాను కౌగిలిలోన
ఈనాడు చీకటిలాగ మిగిలాను చీకటిలోన
నేనోడిపోయి గెలుపొందినాను
గెలిచానని నవ్వనా ఏడ్వనా ॥మనసా॥
ఎగిరింది కడలి కెరటం ఆ నింగి స్నేహం కోసం
ఏనాటికైనా అవి చేరువౌనా
కెరటానికి నింగికి స్నేహమా ॥మనసా॥
మోముపై ముంగురులేమో వసివాడి మల్లియలాయె
గుండెలోన కోరికలన్నీ కన్నీటి చారికలాయె
ఏ తీగకైనా కావాలి తోడు
నా జీవితం శాపమా పాపమా ॥మనసా॥

## నేనంటే నేనే

రచన: కొసరాజు గానం: బాలసుబ్రహ్మణ్యం

అ: ఓ చిన్నదానా
ఓ చిన్నదాన నన్ను విడిచి పోతావటే
పక్కనున్న వాడిమీద నీకు దయరాదటే
ఒక్కసారి యిటుచూడు పిల్లా
మనసు విప్పి మాటాడు బుల్లే ॥ఒక్కసారి॥
నిజం చెప్పవలెనంటే నీకు నాకు సరిజోడు
హోయ్ గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మ
గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మ
గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మ
నే చూడని జాణలేదు భూలోకంలో - పిల్లా
నను మెచ్చని రాణిలేదు పైలోకంలో
కంటికి నచ్చావే చెంతకు వచ్చావే
కంటికి నచ్చావే చెంతకు వచ్చావే
నిలవకుండ పరుగుతీస్తే నీవె చింత పడతావే... పిల్లా...
హోయ్ గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మ
గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మ
గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మా... ఆ ఆ ఆ...
బెదిరి బెదిరి లేడిలాగ గంతులెయ్యకే
చేయిబట్టి అడిగినపుడు బిగువు చెయ్యకే
రంగు చీర లిస్తానే...
రంగు చీర లిస్తానే
రవల కమ్మ లేస్తానే
దాగుడు మూతలు వదలి కౌగిలి యిమ్మంటావే
హోయ్ గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మ
గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మ
గుంతలకిడి గుంతలకిడి గుంతలకిడి గుమ్మ
నీ నడుము బట్టి హంసలాగ నాట్యం చేస్తా
నీ కౌగిటిలో గుంగుమ్ముగ రాగం తీస్తా...
ఒహోహో... ఒహో హో
నీ నడుము బట్టి హంసలాగ నాట్యం చేస్తా
నీ కౌగిటిలో గుంగుమ్ముగ రాగం తీస్తా...
కారులోన ఎక్కిస్తా... పాంయ్ పాంయ్
కారులోన ఎక్కిస్తా...
జోర్జోరుగ నడిపేస్తా
చెంప చెంప రాసుకుంటూ జలసాగా గడిపేస్తా
పిప్పీ... పిప్పీ... పిప్పీ... పిప్పీ... పిప్పీ... పిప్పీ... పీ పీ పీ

## గూడుపుఠాణి

రచన: దాశరధి గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, సుశీల

ప/అ:తనివి తీరలేదే నా మనసు నిండలేదే
యేనాటి బంధమీ అనురాగం
చెలియా ఓ... ఓ... చెలియా ॥తనివి॥
చ/అ:ఎన్నో వసంత వేళలలో వలపుల ఊయలలూగేమే
ఎన్నో పున్నమి రాత్రులలో వెన్నెల జలకాలాడామె
అందనీ అందాలా అంచుకే చేరినను (2)
విరిసిన పరువాలా లోతులే చూసినను ॥తనివి॥
చ/ఆ: ఎప్పుడు నీవే నాతోవుంటే ఎన్ని వసంతాలైతేనేమి (2)
కన్నులనీవే కనబడుతుంటే ఎన్ని పున్నములు వస్తేనేమి
వెచ్చని కౌగిలిలో హాయిగా కరగించినను (2)
తీయని హృదయంలో తేనెలే కురిపించినను ॥తనివి॥

# యస్.పి. కోదండపాణి స్వరపరిచిన గీతాలు...

## సుఖ దుఃఖాలు

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి గానం: బాలసుబ్రహ్మణ్యం

మేడంటే మేడాకాదూ
గూడంటే గూడూకాదూ
పదిలంగ అల్లుకొన్న
పొదరిల్లు మాది... పొదరిల్లు మాది ॥మేడంటే॥
నేనైతే ఆకూ కొమ్మా
తానైతే వెన్నెలవెల్ల ॥నేనైతే॥
పదిలంగ నేసిన పూసిన
పొదరిల్లు మాది... పొదరిల్లు మాది ॥మేడంటే॥
కోవెల్లో వెలిగే దీపం దేవి మాతల్లి
కోవెల్లో తిరిగే పాటల గువ్వ నా చెల్లి ॥కోవెల్లో॥
గువ్వంటే గువ్వకాదు గోరవంకగాని
వంకంటే వంకగాదూ - నెలవంకగాని ॥మేడంటే॥
గోరింటా పెళ్ళయిపోతే
ఏ వంకకో వెళ్ళిపోతే ॥గోరింటా॥
గూడంతా గుబులైపోదా
గుండెల్లో దిగులైపోదా ॥మేడంటే॥

## లక్ష్మీ కటాక్షం

రచన: సి. నారాయణరెడ్డి గానం: ఘంటసాల, సుశీల

ఆ: రా... వెన్నెల దొరా కన్నియను చేరా
రా... కన్ను చెదరా వేచితిని రారా...
అ: ఈ పాల వెన్నెలలోన నీ నీలి కన్నులలోన
ఉన్నాను లేవే ప్రియతమా
ఆ: నీ మగసిరి నగవులు చాలునులే
నీ సొగసరి నటనలు చాలునులే
నీ మనసైన తారను నే కాలేనులే
అ: రా... వెన్నెల దొరా వింత కనవేలా
రా... చిలక జొరా అలిగినది లేరా
ఆ: ఈ మబ్బు తెరచాటేల ఈ నింగి పయనాలేల
ఎద నిండి పోరా చంద్రమా
అ: నీ పగడపు పెదవుల జిగినేనే
ఈ చెదరని కౌగిలి బిగినేనే
నా ఎద నిండ నీవే నిలిచేవులే ॥రా...॥

## జగత్ కిలాడీలు

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి గానం: పి. సుశీల, బాలసుబ్రహ్మణ్యం

ఆ: వేళచూస్తే సందెవేళ
గాలివీస్తే పైరగాలి ॥వేళచూస్తే
ఏల ఒంటరి తోటకడకు
ఎందుకోరకూ ఎందుకోరకూ
అ: కళ్ళు కప్పే రాత్రివేళ
ఒళ్ళునిమిరే పిల్లగాలి ॥కళ్ళుకప్పే॥
మెల్లమెల్లన తోట పిలిచె
అందుకోరకే అందుకోరకే
ఆ: అచ్చంగా వసంతమాసం వచ్చేదాకా
వెచ్చన్నీ పూదేనియలు తెచ్చేదాకా ॥అచ్చంగా॥
అ: పెదవి పెదవీ ఎదురై ఎదురై ॥పెదవీ॥
మధువులు వెదకే వేళా
మగువా అదియే వసంతవేళ ॥వేళచూస్తే॥
అ: రెప్పల్లో దాగిన చూపులు చెప్పే దేమిటో
గుండెల్లో గుసగుసలాడే కోరికలేమిటో ॥రెప్పల్లో॥
ఆ: రారా వెంటనే - పొదరింటికీ
ఇక రాదురా నిదుర నా కంటికీ... ॥కళ్ళుకప్పే॥

## సుఖ దుఃఖాలు

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి గానం: సుశీల

ప: ఇది మల్లె వేళయనీ
ఇది వెన్నెల మాసమనీ
తొందరపడి ఒక కోయిల - ముందే కూసింది
విందులు చేసింది
కసిరే ఎండలు కాల్చుననీ
ముసిరే వానలు ముంచుననీ
ఇక కసిరే ఎండలు కాల్చుననీ
మరి ముసిరేవానలు ముంచుననీ
ఎరుగని కోయిల ఎగిరింది ॥ఎరుగని॥
చిరిగిన రెక్కల ఒరిగింది
నేలకు ఒరిగింది ॥ఇది॥
మరిగిపోయేది మానవహృదయం
కరుణ కరిగేది చల్లని దైవం ॥మరిగి॥
వాడే లతకు ఎదురై వచ్చు వాడని వసంతమాసం
పసివాడని కుసుమ విలాసం ॥ఇది॥
ద్వారానికి తారామణిహారం
హారతి వెన్నెల కర్పూరం ॥ద్వారానికి॥
మోసం ద్వేషంలేని సీమలో ॥మోసం॥
మొగసాల నిలిచె నీ మందారం ॥ఇది॥

## పండంటి కాపురం

రచన: గోపి గానం: యస్.పి.కోదండపాణి, పి. సుశీల

ఇదిగో దేవుడు చేసిన బొమ్మ
ఇది నిలిచేదేమో మూడురోజులు
బంధాలేమో పదివేలు
నదిలో నావ ఈ బ్రతుకు
దైవం నడుపును తన బసకు

అనుబంధాలు ఆనందాలు
తప్పవులేరా కడవరకు ॥ఇదిగో॥
రాగం ద్వేషం రంగులురా
భోగం భాగ్యం తలుకేరా
కునికే దీపం తొణికే ప్రాణం
వెలిగే కాలం తెలియదురా ॥ఇదిగో॥



ఏప్రిల్ 5

యస్.పి. కోదండపాణి వర్ధంతి సందర్భంగా

సినీ సంగీత ప్రియుల కోసం - హాసం

